gd. No. A. 136

# ఆంధ్ర ప్రదేశ్



సంచికలో....

చీన
ఈజిప్షియన్ చిత్రకళ
వ్యాఖ్యాన సరోజినీదేవి

చీన భారతదేశంలో
కార్మిక వర్గం
మ్మరాజు వెంకటరావు

★

ని కాంధ్ర నిర్మాతలు
ఈశ్వరదత్

★

లో నవళ కారంభం

★

గు పిడుగు -
వ్యావహారిక భాష
న్నలగడ్డ
సత్యనారాయణమూర్తి
కుగు వెంకటసీతాపతి

సెప్టెంబరు,
1963



సరిహద్దుల కాపలాదార్లు : ఉత్తర సరిహద్దులలో కర్తవ్య నిర్వహణలో నిమగ్నులై వున్న భారత సైనికులు రోజంతా కష్టించి పనిచేసిన పిమ్మట విశ్రాంతి తీసుకుంటున్నారు.

[చూ- 48వ పేజీ.]

ఉత్తర సరిహద్దు ప్రాంతాలలో గస్తీవిధులు నిర్వహిస్తున్న భారత సైనికులు. [చూ- 48వ పేజీ]

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 7 సంచిక : 11

భాద్రపద - ఆశ్వయుజ

1885 శకం

సెప్టెంబరు : 1963

## విషయ సూచిక



సంవత్సరంచందా — రు. 3—00,

విడి ప్రతి రు. 0—25 నయాపైసలు.



క్రీ.పూ. 2500 సం.నాటి ఈజిప్షియన్‌శిల్పానికి చెందిన శిరబొమ్మ [ చూ. వ్యాసం 9 వ పేజీ ]



ముఖచిత్రం: ఆగస్టు 15 వ తేదీన సికింద్రాబాదులో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవ పెరేడులో ముఖ్యమంత్రి గౌరవ వందనం స్వీకరిస్తున్న దృశ్యం.

వెనుక అట్ట: తిరుపతి శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయం ముందు భాగం దృశ్యం. ఈ క్షేత్రంలో ఈ నెల బ్రహ్మోత్సవాలు జరుగుతున్నాయి. దేశం నలుమూలలనుంచీ వేలమంది భక్తులువచ్చి ఉత్సవాలలో పాల్గొంటున్నారు.

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ!

ఈ నెలతో మనకు స్వాతంత్ర్యం లభించి పదహారు సంవత్సరాలు గడిచాయి. ఒకదేశ చరిత్రలో పదహారు సంవత్సరాలంటే చాలా స్వల్పకాలం మాత్రమే. కాగా భారతావనివంటి సంక్లిష్టమైన సాంఘిక, రాజకీయ వ్యవస్థలుగల సువిశాలమైన దేశంలో స్వాతంత్ర్యాన్ని సంపూర్ణంగా పటిష్ఠంచేయడానికి చాలా కాలం పడుతుంది. ప్రతి సంవత్సరం మనం స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకుంటున్నప్పుడు స్వాతంత్ర్యం అన్నది సాధనం మాత్రమే గాని లక్ష్యంకాదనీ, మన సౌభాగ్యానికై స్వాతంత్ర్యాన్ని వినియోగించుకోవాలనీ గుర్తుచేసుకోవడం మంచిది.

నేను మీకు క్రిందటిసారిలేఖ వ్రాసినప్పటినుంచి చాలా సమయాన్ని యితరపనులకు వెచ్చించవలసి వచ్చిందికాబట్టి ఈ పర్యాయం ఎక్కువ విషయాలు ప్రస్తావించలేక పోతున్నానేమోననిపిస్తున్నది.

ఆహారోత్పత్తి సమస్య మనకు ఎప్పుడూ వుండనేవుంది. ఈ సమస్యా పరిష్కారానికి మనం కృషిచేస్తున్నాం. క్రొత్త చిన్నరకం నీటి పారుదల పథకాలను; చెరువుల అభివృద్ధి పథకాలను; ఆనకట్టలు, కాలువలు, డ్రైనేజి, గట్లనిర్మాణాలనుచేపట్టగలగడానికి వీలుగా చిన్నతరహా సేద్యపు నీటివసరులకు కేటాయింపును యాభై శాతం మేరకు పెంచడానికి ఇటీవల నిశ్చయించారు. మొదట చేసిన రూ. 14.56 కోట్ల కేటాయింపును ఇప్పుడు రూ. 20 కోట్లకు పెంచారు. ప్రణాళిక గత రెండు సంవత్సరాల కాలంలో 82,200 ఎకరాల విస్తీర్ణంలో నీటిపారుదల సౌకర్యాలు కల్పించబడ్డాయి. రూ. 2.40 కోట్ల ఖర్చుతో వర్తమాన సంవత్సరంలో అదనంగా 80,000 ఎకరాల విస్తీర్ణంలో నీటిపారుదల సౌకర్యాలు కల్పించాలనుకున్నాము. వచ్చే రెండు సంవత్సరాల కాలంలో ఏటా 90,000 ఎకరాలచొప్పున నీటిపారుదల సౌకర్యాలు కలుగజేయ దలిచాము. చిన్న తరహా నీటిపారుదల కార్యక్రమాన్ని వేగవంతం చేయడానికి చర్యలు తీసుకోవడం జరిగింది. ప్రతి సందర్భంలోనూ రూ. 2.50 లక్షలవరకూ పథకాలకు పాలనావిషయంగా మంజూరీ ఇచ్చేందుకు చీఫ్ ఇంజనీరుకు ఇతోధికాధికారాలు సంక్రమింప జేయడంకూడా జరిగింది. పథకాల పరిశీలన, స్థిరీకరణలు శీఘ్రంగా పూర్తయ్యేట్లు చూడవలసిందిగా రెవెన్యూ, పబ్లిక్ వర్క్సు శాఖలను కోరడం కూడా జరిగింది. గత కొన్ని లేఖలలో నేను ప్రస్తావిస్తూ వచ్చిన భారీ పథకాలుగాక ఇవి అదనపువి.

రాష్ట్రస్థాయిలో ప్రణాళికా యంత్రాంగాన్ని పటిష్ఠం చేస్తూ ఉత్తర్వులు చేసిన విషయం మీకు తెలిసేవుంటుంది. పని త్వరితంగా పూర్తి కావడంలో పరిపాలనా సంబంధమైన ఇబ్బందులు అడ్డుపడకుండా వుండేలా చేయాలనే మా ఆశయం మేరకు ఇది జరిగింది. రాష్ట్రాలలో ప్రణాళికా యంత్రాంగాన్ని పటిష్ఠం చేయవలసిన అవసరాన్ని ప్రణాళికాసంఘం వారు గత కొంత కాలం నుంచి నొక్కి చెబుతున్నారు. చైనా దురాక్రమణానంతరం అనుభవంవల్ల ఈ అవసరాన్ని మరింతగా గుర్తించాము. వచ్చే 15 సంవత్సరాలకూ భవిష్యత్ప్రణాళికలను రూపొందించవలసి వుంది. నాలుగవ ప్రణాళికను రూపొందించే పనిని ప్రారంభించేందుకు వచ్చే నెలనుంచి 15 పరిశీలక బృందాలు కార్యాచరణకు ఉపక్రమిస్తాయి. ఈ దృష్ట్యా ప్రణాళికా శాఖ కార్యదర్శి ప్రణాళిక అంశాల పట్ల ఎక్కువ ధ్యానం చూపగలగడానికి వీలుగా ఆయనకు కొన్ని విధులను తగ్గించవలసిన అవసరం వుంది. ప్రస్తుతంవున్న ప్రాధాన్య క్రమాన్ని ఎప్పటికప్పుడు పూర్తి పరిస్థితియొక్క అవసరాల కనుగుణ్యంగా మార్పు చేయవలసివుంది. ప్రణాళికా పథకాల మదింపు, ప్రతిపాదనలకు సంబంధించిన తగిన ఆర్థిక, సాంకేతిక పరిశీలనలను చేపట్టడంతోపాటుగా రాష్ట్ర ఆర్థిక పరిస్థితి, ధరవరలు, సరఫరాలు, మానవ శక్తి సమస్యలను జాగ్రత్తగా గమనించడం కూడా జరిగింది. కనుక ప్రస్తుత ప్రణాళికా, పంచాయతీరాజ్ శాఖను విడదీసి ప్రణాళికాశాఖ, పంచాయతీరాజ్ శాఖ అనే రెండు శాఖలను ఏర్పాటు చేయడానికి నిశ్చయించాము. ఈ విభజనవల్ల మన రాష్ట్రంలో ఏర్పడే వ్యవస్థ కొన్ని ఇతర రాష్ట్రాలలో వున్న ఏర్పాట్లకు స్థూలంగా అనుగుణ్యంగా కూడా వుంటుంది. ఈ విభజన ఫలితంగా సామర్థ్యం పెంపొందగలదని నేను ఆశిస్తున్నాను.

ఇటీవల స్వల్పకాలంపాటు శాసనసభా సమావేశం కూడా జరిగింది. అతి ముఖ్యమైన అమ్మకం పన్ను ( సవరణ ) చట్టం ఈ సమావేశంలోనే ఆమోదించ బడింది. అప్లైడ్ ఎకనమిక్ రీసెర్చ్ జాతీయ మండలి డైరెక్టరు జనరల్ డాక్టర్ పి. ఎస్. లోకనాథన్‌ను సాధారణ అమ్మకం పన్ను చట్టం అమలును సమీక్షించ గోరిన

విషయం మీకు తెలిసిందే. అదనపు ఆదాయాన్ని పెంపొందించడం, చిన్న వర్తకులకు పన్ను మదింపు విధానాన్ని సులభం చేయడం, పన్ను ఎగవేతకు కారణమయ్యే లోపాలను నివారించడం, పొరుగు రాష్ట్రాలకు వ్యాపారం తరలి పోవడాన్ని అరి కట్టడం, పరిపాలనా విధానంలోను, సిబ్బందిలోను సామర్థ్యాన్ని పెంపొందించడం ఈ సమీక్ష లక్ష్యాలు. డాక్టర్ లోకనాథన్ సమర్పించిన నివేదిక ప్రాతిపదికగా చట్టంలో దిగువ పేర్కొన్న క్రొత్త అంశాలను పొందుపరచడం జరిగింది.

(i) సంవత్సరానికి మొత్తం టర్నోవరు రు. 3 లక్షలకు మించిన వ్యాపారస్థుల పన్ను విధింపుకులోబడిన టర్నోవరులపై ఒక శాతంలో 4 వ వంతు మేరకు అదనపు పన్ను విధింపు.

(ii) ఇదివరకు అనేక వస్తువులపై ఉన్న మల్టీపాయింట్ పన్నును సింగిల్ పాయింటు పన్నుగా విధించడం.

(iii) అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు హోదాగలవారు అంతకు పై హోదాగల అధికారి మాత్రమే దుకాణాలను తనిఖీ చేయడం.

(iv) తప్పుడు మినహాయింపులు కోరేవారిపై జరిమానా విధించడం.

(v) ప్రభుత్వం చెల్లించాల్సిన బకాయీలను ఒక సంవత్సరం లోగా చెల్లించని మొత్తాలపై ప్రభుత్వం వడ్డీ చెల్లించడం.

(vi) నిలుపుదల ఉత్తరువు (స్టే ఆర్డరు)కై డిప్యూటీ కమీషనర్లకు రివిజన్ దరఖాస్తులను అందజేయడం.

ధాన్యం, బియ్యం వ్యాపారాలలో పన్ను చెల్లింపు ఎగవేతలను అరికట్టడానికి తగిన నియమావళులనుకూడా చేర్చడం జరిగింది. రు. 40,000/- లకు తక్కువగా టర్నోవరు ఉన్న వ్యాపారస్థులు కొనుగోలుచేసిన లెక్కలనుమాత్రమే నిర్వహించడానికి వీలుగా నిబంధనలను సవరించడమేగాక అటువంటి వ్యాపారస్థుల ఆఖరు లెక్కల మదింపుకు అనుసరించే విధానాలనుకూడా సులువు చేయడం జరిగింది.

మత్స్యశాఖ అందజేసిన నివేదిక ఎంతో సంతృప్తికరంగా ఉంది. 1962-63వ సంవత్సరంలో మనఆదాయం 1960-61 వ సంవత్సరం కన్నా రెండింతలుగా ఉంది. చెరువులు, కుంటలు మొదలయిన వాటిల్లో అనువైన చేపలను నిలువచేసే సమస్యను మత్స్యశాఖ ఎల్లప్పుడూ యెదుర్కొంటూనే ఉంది. అయితే గత రెండు సంవత్సరాలనుంచి మన నీళ్ళలో "మిరర్‌కోర్" అనే విదేశీరకం చేపను అధికంగా పెంచడం ప్రారంభించాము. రాష్ట్రం అన్ని ప్రాంతాలలోనూ యీ రకంచేపల గ్రుడ్లు అధికంగానే లభిస్తున్నాయి. మన గ్రామాలలోని చెరువు, కుంటలలో అధికంగా చేపలను పెంచి తద్వారా గ్రామపంచాయతీల ఆదాయాన్ని అధికంచేసే వనరులు పెంచవచ్చని మన అనుభవం తెలుపుతున్నది. తక్కువకాలం నీరుఉండే కుంటలలో సయితం 'మిరర్‌కోర్' రకం చేపలనుపెంచి ప్రోటీనులు అధికంగాగల ఆహారాన్ని సంపాదించవచ్చు. యీ చేపలు సంవత్సరానికి 10 పౌండ్లకు పెరుగుతాయి. మన ఆహారంలో చేపలను ముఖ్య భాగంగా ఎల్లప్పుడూ గుర్తించడం వల్లనూ, పౌష్టికాహారానికి చెందిన యీ అంశంపై తగిన శ్రద్ధ వహించాల్సిన అవసరం ఉన్నందువల్లనూ యీ విషయాన్ని నేను ప్రస్తావిస్తున్నాను.

"జై హింద్."

భవదీయుడు,

నీలం సంజీవరెడ్డి

# తమసో మా జ్యోతిర్గమయ ...

— కమ్మిసెట్టి వెంకటేశ్వరరావు

వెలిగించు ఒక కాంతి దీపిక
వినిపించు ఒక శాంతి గీతిక

ఎవరు కోరిన కోరకున్నా
నీ వెవరవో తెలియకున్నా
శాంతమై చైతన్య వంతమై
దీపింప నీ విశ్వ వాటిక...

వెలిగించు ఒక కాంతి దీపిక
వినిపించు ఒక శాంతి గీతిక

సుఖదుఃఖములను భావించక
ప్రతి ఫలాపేక్ష, కావించక
సృష్టి సౌందర్య ప్రదీప్తికై
అర్పించు నీ చిరుత కానుక...

వెలిగించు ఒక కాంతి దీపిక
వినిపించు ఒక శాంతి గీతిక

నీరవత పేరుకో నీయకు
మత్తులా జడత రానీయకు
ఈ మహో విశ్వాలయములోన
నిల్చి మ్రోగించు జయ ఘంటిక...

వెలిగించు ఒక కాంతి దీపిక
వినిపించు ఒక శాంతి గీతిక

మధుర స్వరము లీను తంత్రిక
వలపు వెదజల్లు సుమ కన్యక
రవి చంద్రులే కాదు గగనాన
వెలుగు విరజిమ్ము చిరు తారక...

వెలిగించు ఒక కాంతి దీపిక
వినిపించు ఒక శాంతి గీతిక

ఆనంద మిచ్చునది త్యాగం
అంద మిచ్చునది అనురాగం
మానవుని అమరత్వ గమ్యమున
కడుపు పువ్వుల దారి జీవిక...

వెలిగించు ఒక కాంతి దీపిక
వినిపించు ఒక శాంతి గీతిక






## స్వాతంత్ర్య దినోత్సవం

ఈ సంవత్సరం అగస్టు 15 వ తేదీతో భారతదేశం స్వాతంత్ర్యం పొంది 16 సంవత్సరాలునిండాయి. దేశ ఉత్తరసరిహద్దులలోఅశుభకరమైనపరిణామాలుఏర్పడినతరుణంలో ఈ పర్యాయం స్వాతంత్ర్య దినోత్సవాలుజరిగాయి. 1962వ సం.లో స్వాతంత్ర్య దినోత్సవాలు జరుపుకున్న తరువాత గడిచిన ఒక సంవత్సర కాలంలో అనేక ముఖ్య సంఘటనలు జరిగాయి. భారత ప్రజలలో మానసికంగా కొంత ముఖ్యమైన పరివర్తన వచ్చింది. దీని ప్రభావం రాజకీయ వ్యవస్థ యందంతటా ఇంకా ప్రతిఫలిస్తున్నది. సుస్థిరమైన పరిపాలనా వ్యవస్థవల్ల ఏర్పడిన వాతావరణం మూలంగా దేశంలో దాదాపు సంతుష్టభావం, స్తబ్దత ఏర్పడ్డాయి. స్వాతంత్ర్యం పొందిన తరువాత గత 14 సంవత్సరాలలో భారతదేశం అభ్యుదయం, సుస్థిరత అనే గమ్యాలవైపుకు దిగ్విజయ యాత్రచేసింది. ప్రజాస్వామ్యం, ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అనే ద్వంద్వ లక్ష్యాలను మనం ఆమోదించాము. మానవాళి చరిత్రలో ఈ రెండులక్ష్యాల సమామ్నాయం అపరూపం, అద్వితీయం. కొన్ని రాజ్యకూటాలవారికి కొంతకాలంగా మన విధానాలపై కొన్ని విపరీతమైన అభిప్రాయాలు వుంటున్నప్పటికీ అంతర్జాతీయ రంగంలో మనదేశాన్ని శాంతికీ, సహజీవనానికీ దాదాపు చిహ్నంగాపరిగణించడంజరిగింది. దేశంలో పురోగతి మందకొడిగా సాగుతుండడంపట్ల, నిర్విఘ్నంగా అధికారం సాగిస్తున్నందువల్ల కలిగేకొన్నిలోపాలపట్ల అప్పుడప్పుడు అసంతృప్తి ప్రకటించడం జరుగుతున్నప్పటికీ దేశ ప్రాతిపదిక విధానాలకు పెద్ద వ్యతిరేకత ఏమీ లేదు. ఆమోదయోగ్యమైన ప్రత్యామ్నాయ మార్గాలను సూచించడంకానీ, పరిశీలించడం కానీ ఎప్పుడూ జరగలేదు. ఉత్తమ జీవన విధానాలను ఇతోధికంగా రూపొందించుకోవాలన్నదే ప్రజల ఏకైక నినాదం. పరిణతి నొందిన దేశంగా భారతావని త్వరితగతిని అభివృద్ధి జెందుతున్నది. గొప్పతనాన్ని, ఘనతను సంతరించు కుంటున్నది.

గత అక్టోబరులో చైనా ద్రోహ బుద్ధితో దురాక్రమణ జరిపి భారతదేశం సాగిస్తున్న దిగ్విజయయాత్రకు అడ్డుతగలజూచింది. చైనా చర్య మనకు దిగ్భ్రాంతి కలిగించింది. కాని వెంటనే తేరుకున్నాము. సక్రమ ఆలోచనావిధానం, రాజనీతిజ్ఞతల బలిమి ద్వారా క్రమక్రమంగా పెంపొందించుకున్న మన శక్తి స్వరూపానికి, సైనిక రంగంలో మన లోపాలు హఠాత్తుగా కనుగొనబడడంతో విఘాతం కలిగింది. ఈ ఘాతుక చర్యను మొత్తంమీద జాతి ఎదుర్కొని నిలిచిన తీరు గణనీయమైనదే. అయినప్పటికీ కొందరికి ఇంకా భయభ్రాంతులు వుంటాయనుకోక తప్పదు. ఈనాడు ఆలోచనా ధోరణి మారిపోయింది. పూర్వం సవ్యంగా కనిపించినవాటన్నింటినీ కూడా ఇప్పుడు చెడుగా వున్నా యనుకునే దృక్పథం ఏర్పడింది. నిస్పృహతో ఆలోచించే అలవాటు కొందరికి అయింది. మేధావి వర్గాలు తమను తాము నిందించుకునే స్థితికి వచ్చాయి. విశ్వసించే స్వభావం తగ్గిపోయి దాని స్థానే సంశయాలు అధికం కాజొచ్చాయి. అయితే మొత్తం మీద ప్రజలలో విశ్వాసం, మనోస్థయిర్యం ఇంకా మిగిలివున్నప్పటికీ కొన్నివర్గాలలో ఇవిమృగ్యమయ్యాయి.

మన స్వాతంత్ర్య దినోత్సవం నాటికివున్న పరిస్థితి ఇది. విశ్వాసానికి ఏర్పడిన ఈ క్లిష్టపరిస్థితి మనలను అధిగమించే ప్రమాదం వుంది. దీనిని దృఢ సంకల్పంతో ఎదుర్కోవాలి. త్యాగానికి పునరాంకితులం కావడానికి మన సర్వస్వాన్ని ఒడ్డాలి. ప్రజాసమస్యలను దాదాపు మరుగుపరచడానికి దారితీసిన అధికార-నిర్విఘ్నమైన,సంపూర్ణమైన-సంబంధమైన సమస్యలను అదుపులోకి తెచ్చి శాశ్వతంగా పరిష్కరించాలి. ''రక్షణకై అభివృద్ధి'' అనే నినాదాన్ని అంతటా సమర్థంగా నిరంతరం ప్రతిధ్వనింప జేయాలి. స్వార్థపరత్వం స్థానే సమస్త జాతి శ్రేయస్సుకు తోడ్పడాలనే విశాల దృక్పథం అలవడాలి.

ఇవన్నీ కేవలం సాధారణాంశాలు కావు. ఇవి మనకు సవాళ్ళ వంటివి. ఒక జాతిగా మనం వాటిని ఎదుర్కొనైనా ఎదుర్కోవాలి లేదా వాటికి బలి అయినా కావాలి. ప్రతిదీ సాఫీగా సాగిపోయినప్పుడు కొన్ని సమయాలలో ఆదర్శ వాదం ఒక భ్రమగా అపహాస్యం చేయబడుతుంది. కాని క్లిష్టపరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు, సమస్య తీవ్రత, దానిని ఎదుర్కోవడానికి మనకుగల శక్తికి మధ్య అంతరాన్ని పూడ్చగలిగేది కేవలం ఆదర్శ వాదం మాత్రమే. ఇప్పుడు ఆదర్శవాదం పుంజుకుంటుండటం దేశానికి శుభ సూచన. కొందరు ప్రజలు ఉదాసీన వైఖరిని ప్రదర్శించినప్పటికీ ఆదర్శ వాదం మెల్లమెల్లగా బలపడి, దేశ వ్యాప్తంగా ఏక లక్ష్యంతో మరోమారు ఉత్సాహాన్ని పునరుద్దీపింపజేసే సూచనలు కనిపిస్తున్నవి. సంశయాలను, సందేహాలను వెలుబుచ్చేవారు, నిందారోపణలు చేసేవారు ఎప్పుడూ వుండనే వుంటారు. అయినప్పటికీ జైత్రయాత్ర సాగిపోవలసిందే.

స్వాతంత్ర్య దినోత్సవ నీతి ఇదే.

## భారత, నేపాల్ దేశాలు

నేపాల్ రాజ దంపతులు భారతదేశంలో 13 రోజులపాటు పర్యటించడం, ఈ ఉభయ దేశాల సంబంధాలలో శుభావహమైన పరిణామాన్ని సూచిస్తుంది. సహాయ సహకారాలకు, వాత్సల్యానికి అర్హమైన సోదరదేశంగానే నేపాల్‌ను భారతదేశం ఎప్పుడూ భావించింది.

భారతదేశం తన పరిమితులను దాటి కూడా నేపాల్‌కు సాధ్యమైనంతవరకు సహాయం చేసింది. ఈ ఉభయ దేశాలలోని కొందరు వ్యక్తుల లేదా పార్టీల విధానాలవల్ల కలిగిన తాత్కాలికమైన సంశయాలను, అనుమానాలను భారతదేశం లక్ష్యపెట్టలేదు. త్రిశూల్ వంటి భారీ ప్రాజెక్టుల రూపంలోనే గాక భారతదేశం మీదుగా పాకిస్తాన్‌తో వర్తకం సాగించుకోడానికి సౌకర్యాలు కల్పించడంవంటి చర్యల ద్వారా కూడా భారతదేశం నేపాల్‌కు గట్టి సహాయం చేస్తున్నది. వార్తాసౌకర్యాలు, వ్యవసాయం, అడవులు, ఆరోగ్యం, విద్య, నీటిసరఫరా విషయాలలో నేపాల్‌ను ఆధునీకరించడంలో సహాయం చేస్తున్నందుకు రాజుమహేంద్ర భారత ప్రభుత్వానికీ, నేపాల్‌లోని భారతీయ సహాయక సంస్థకూ తమ దేశం తరఫున కృతజ్ఞతలు తెలియజేశారు.

స్మృతులకాలంనుంచీ ఈ రెండు దేశాలు చారిత్రకంగా, సాంస్కృతికంగా, ప్రకృతిసిద్ధంగా సన్నిహితమైనవి. శాంతి, స్నేహ సంబంధాల విషయంలో ఈ ఉభయదేశాల మధ్య అనేక సంవత్సరాల క్రితం ఒప్పందం జరిగింది. ఒకరి సార్వభౌమాధికారాన్ని మరొకరు గౌరవించడం, సంపూర్ణ సమానత్వం ప్రాతిపదికపై ఈ రెండు దేశాలమధ్య సత్సంబంధాలకు ఈ ఒప్పందం మార్గదర్శకం. ఢిల్లీలో జరిగిన ఒక విందులో డాక్టర్ రాధాకృష్ణన్ రాజుమహేంద్రతో ఇలా అన్నారు : "మన దేశాలు ఇరుగు పొరుగున వున్నవి. అనేక విషయాలలో మనకు సామ్యంవుంది. కాబట్టి మీ రక్షణ, మీసుస్థిరత మాకు ఎంత ముఖ్యమో, మా రక్షణ, మా సుస్థిరత మీకు కూడా అంతే ముఖ్యం."

"నేపాల్‌పై విదేశ దాడులు జరిగే సందర్భంలో పెకింగ్ ప్రభుత్వం నేపాల్‌ను ఆదుకుంటుంది," అని కొంతకాలం క్రింతం చైనా విదేశాంగ మంత్రి మార్షల్ చెన్ యీ అనడం జరిగింది. అయితే నేపాల్ నాయకులకు ఎవరి అంతర్యాలు ఏమిటో తెలుసు. ఖాట్మండులో భారత స్వాతంత్ర్య దినోత్సవాల సందర్భంలో నేపాలీ రాష్ట్ర పంచాయతీ అధ్యక్షుడు చేసిన ప్రసంగం గమనార్హమైనది. "నేపాల్ మీదుగా భారతదేశంపై దాడీ జరపాలంటే దురాక్రమణదారు నేపాలీల కళేబరాల మీదుగానే నడిచి వెళ్లాల్సి వుంటుంది," అని ఆయన వక్కాణించారు.

నేపాలీల వ్యక్తిగత శాసనాలవిషయంలో ఇటీవల విప్లవాత్మకమైన మార్పువచ్చింది. ఇది నేపాల్ అభ్యుదయ సాధన కృషిలోని గమనార్హమైన అంశం. నిజానికి ఈ మార్పు నేపాల్‌రాజు అభ్యుదయ కాంక్షకూ, ఉదార దృక్పథానికీ తార్కాణం. ఇప్పుడు అనేక ముఖ్య అంశాల విషయంలో నేపాలు సాంఘిక, న్యాయశాస్త్ర వ్యవస్థ స్వరూప స్వభావాలు చాలావరకు భారత దేశంలోని వాటి స్వరూప స్వభావాలను పోలివుంటాయి. అందువల్ల దృక్పథం, కార్యాచరణ విధానాలలోని సామ్యం ప్రాతిపదికపై వీటిమధ్య మైత్రి వర్ధిల్లుతుంది.

## అమెరికా సహాయంలో కోత

విదేశాలకు 4,100 మిలియన్ డాలర్ల వరకు సహాయంగా ఇవ్వడానికి అనుమతించే బిల్లు అమెరికా ప్రజా ప్రతినిధుల సభలో చర్చకు వచ్చిన సందర్భంలో సహాయ మొత్తాన్ని 585 మిలియన్ డాలర్లకు తగ్గించడం జరిగింది. ఇది అమెరికా పాలక వర్గానికి పెద్ద దెబ్బ.

ప్రజా ప్రతినిధుల సభయొక్క ఈ చర్యను ప్రెసిడెంట్ కెన్నెడీ తీవ్రంగా విరశించారు. ఇది బాధ్యతా రహితమైనదీ, పక్షపాతమైనది అని ఆయన అన్నారు. ముఖ్యమైన ఒక కార్యక్రమానికి రిపబ్లికనులు అనాలోచితంగా అఘాతం కలిగించారని శ్రీ కెన్నెడీ విమర్శించారు.

రిపబ్లికన్ పక్షం వారు ప్రతిపాదించిన ఒక సవరణను కూడా ప్రజా ప్రతినిధుల సభవారు ఆమోదించారు. దీని మేరకు —అమెరికా ప్రభుత్వం బొకారో ఉక్కు కర్మాగారం ప్రయోజనాత్మకమైన ప్రాజెక్టు అనే విషయాన్ని కాంగ్రెసుకు నచ్చజెప్పే పర్యంతం—వచ్చే సంవత్సరం ముగింపువరకు ఈ కర్మాగారానికి అమెరికా సహాయాన్ని నిలుపు చేస్తారు. ఈ సవరణను అమెరికా పాలక వర్గం వారు కూడా బలపరిచారు. అయితే ఈ నిలుపుదల తాత్కాలికం మాత్రమేననీ, శాశ్వతమైనది కాదనీ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు వెల్లడించారు.

ప్రణాళికా కార్యక్రమాలకు ఏర్పడిన ఉక్కు కొరత దృష్ట్యా అమెరికా సహాయం లభించినా, లభించకపోయినా బొకారో కర్మాగారాన్ని నెలకొల్పడానికి భారత ప్రభుత్వం నిశ్చయించుకుంది. కాగా అమెరికాలో ఈ సహాయాన్ని వ్యతిరేకిస్తున్న వారు, ఇటీవల వాయిస్ ఆఫ్ అమెరికాతో మనం చేసుకున్న ఒప్పందంపై జరిగిన వివాదానికి ప్రభావితులైనట్లు, కొంతకాలం తరువాత బొకారో కర్మాగారం ఉక్కు ఉత్పత్తిలో అమెరికాతో పోటీపడగలదనే ఆందోళనకు కూడా లోనైనట్లు తెలుస్తున్నది. అమెరికా ధన సామ్యవాద ఆర్థిక వ్యవస్థను పటిష్ఠమొనర్చ దానికి వినియోగపడరాదనే పాతకాలం నా వాదం కూడా తరుచుగా వినిపిస్తున్నది.

లోగడ భారతదేశంలో అమెరికా రాయబారిగా పనిచేసిన ప్రొఫెసర్ గాల్‌బ్రైత్ బొకారో కర్మాగారానికి సహాయం చేయవలసిన అవసరాన్ని గట్టిగా సమర్థించడం జరిగింది.

అయితే ప్రజా ప్రతినిధుల సభ వారి నిర్ణయం దృష్ట్యా, కర్మాగారాన్ని గురించిన

విషయాలను ప్రత్యక్షంగా తెలుసుకునే నిమిత్తం అమెరికా సెనెటు సభ్యులు కొందరు భారతదేశానికి రావలసిన కార్యక్రమం రద్దయింది.

ఈ వార్త భారతదేశంలో నిరాశ కలిగించినా ఈ విషయంలో తీవ్ర వ్యాఖ్యానాలు చేయడం తొందరపాటు చర్యే అవుతుంది. ప్రజాస్వామ్యంలో ఎవ్వరూ కూడా అంతిమ నిర్ణాయకులు కారు. కనుక అమెరికాలోగానీ ఇండియాలో గానీ అంతర్గతంగా వచ్చే ఒత్తిడులను త్రోసిపుచ్చడానికి వీలులేదు. కాబట్టి ఓర్పుతో, పట్టుదలతో కార్య సాధనకు కృషి చేయడం అవసరం. అయితే ప్రస్తుతానికి జరిగిన ఈ కోత నిజానికి ప్రతికూల దృష్టితోనే జరిగినట్లయితే అది విచారించదగిన విషయం. క్రమేణా ఉభయ పక్షాలవారు కూడా సంగతి సందర్భాలను సక్రమ దృష్టితో పరిశీలించగలరనీ, ఇబ్బందులు తొలగిపోగలవనీ ఆశించబడుతున్నది.

## విమాన దళ విన్యాసాలు

రేడార్ ప్రయోగం, విమాన రక్షణ విషయాలకు సంబంధించిన ఆధునిక పద్ధతులను భారత విమానదళ సిబ్బందికి అవగాహన చేసేనిమిత్తం జరపదలచిన సమిష్టి విమానదళ విన్యాసాలకు అవసరమైన సాధనసామగ్రి అమెరికానుంచి మన దేశానికి రావడం మొదలైనది కాబట్టి ప్రధానమంత్రి, అమెరికా, ఇంగ్లాండులతో కుదుర్చుకున్న ఒప్పందంలోని వివిధ అంశాలపై లోక సభలో సమగ్ర ప్రకటన చేశారు.

ఈ ఒప్పందంవల్ల భారతదేశ మూల సిద్ధాంతాలకు ఏమీ భంగం ఉండదనీ, భారత దేశంపై చైనాదాడి జరిపే సందర్భంలో ఏదైనా చర్య తీసుకోవలసిన నిర్బంధం అమెరికా, ఇంగ్లాండులకు ఈ ఒప్పందం క్రింద ఏమీవుండదనీ ఆయన స్పష్టంచేశారు.

దాదాపు పూర్తి ఉత్తర సరిహద్దుల నిమిత్తమై విస్తృతమైన, క్లిష్టమైన ఒక రేడార్ వ్యవస్థను నెలకొల్పడానికి ప్రతిపాదించారు. శాశ్వతంగా నెలకొల్పబడే సాధనాలు భారత ప్రభుత్వ ఆస్తిగా వుంటాయి. భారత విమానదళం సాంకేతిక ప్రవీణులు వాటిని ఉపయోగిస్తారు. కాగా వారికి ఈ రేడార్ సెట్ల ఉపయోగంలో శిక్షణ గరపడం జరుగుతుంది.

రేడార్ సాధనాల ప్రయోగ పరిశీలనలకు వివిధ నమూనాల ఫైటర్ విమానాలు అవసరమవుతాయి కాబట్టి మనం జరపదలిచిన శిక్షణా విన్యాసాలకు ఇలాంటి విమానాలను అరువుగా ఇవ్వడానికి ఇంగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియా ప్రభుత్వాలు సంసిద్ధత తెలిపాయి. అమెరికా సంచార రేడార్ సెట్లను పంపిస్తున్నది. ఈ సమిష్టి విన్యాసాలవల్ల భారతీయ విమాన చోదకులు, సిబ్బంది విమాన రక్షణకు సంబంధించిన ఆధునిక పద్ధతులలో ఎంతో అనుభవం గడించ గలుగుతారు. ఈ విన్యాసాలు సాగుతున్నప్పుడూ, ఆ తరువాత కూడా భారత విమాన రక్షణ బాధ్యత భారత విమానదళం చేతులలోనే ఉంటుంది.

ఈ విధంగా భారత సైన్యాన్ని అన్ని విధాలా పటిష్ఠంచేసే చర్యలు త్వరితగతిని పూర్తవుతున్నాయి. దేశరక్షణ బడ్జెటు 867కోట్ల రూపాయలతోకొత్తప్రమాణాన్ని సృష్టించింది. భారతదేశంలో మిగ్ విమానాల నిర్మాణానికిగాను ఫ్యాక్టరీలను నెలకొల్పడంలో సహాయపడడానికి సంసిద్ధతను ప్రకటించిన రష్యాతోసహా, అన్ని మిత్ర రాజ్యాల నుండి అధునాతన యుద్ధ పరికరాలనూ,ఆయుధాలను పొందే ఏర్పాట్లను మనం చేస్తున్నాం. సామ్రాజ్య విస్తరణ కాంక్షగల పరిపాలకులను మన సరిహద్దులనుదాటి రానీయకుండా మన సరిహద్దు రక్షణ బలాలను అన్ని విధాలా పటిష్ఠం చేసుకునే రోజు అట్టే దూరంలో లేదు.

## భారతసహాయక దేశాల క్లబ్బు

చాలాకాలంగా వాయిదాపడుతూ వచ్చిన భారత సహాయక దేశాల క్లబ్బు సమావేశం ఎట్టకేలకు వాషింగ్‌టన్‌లో గతమాసంలో ముగిసింది. ఇది భారతదేశానికి ఎంతోతృప్తికరంగా, అనుకూలంగా ముగిసింది. ఇంతకు పూర్వం పారిస్‌లోప్రకటించిన వాగ్దానాలకు మరో 13.7 కోట్ల డాలర్లను యీ కమిటీ జతపరచింది దీనితో, భారత సహాయక దేశాల క్లబ్బుద్వారా మూడవ పంచవర్ష ప్రణాళిక మూడవ సంవత్సరానికి లభ్యమయ్యే సహాయం 105.2 కోట్ల డాలర్లకు పెరిగింది.

ఇదేగాక, భారత సహాయక దళాల క్లబ్బులో చేరని దేశాలనుండి సుమారు 6 కోట్ల డాలర్ల మేరకు సహాయం సిద్ధంగా వుంది. మరో 3 కోట్ల డాలర్ల అదనపు సహాయాన్ని మిగిలిన వాగ్దానాలకన్న కఠిన నిబంధనలతో యివ్వడానికి సంసిద్ధులయిన ముగ్గురు సభ్యుల అభిమతానుసారంగా వాడకానికి అంతే మొత్తాన్ని గుప్తంగా ఉండదలచే మరో మూడు పాశ్చాత్య రాజ్యాలనుండి సంపాదించడానికివీలుగా యీ క్లబ్బు అదనపు సహాయకార్యక్రమం రూపొందించబడింది.

మొట్టమొదట భారతదేశం 125 కోట్ల డాలర్లను కోరిందిగాని మరో 6 నెలలు మాత్రమే వున్న యీ ఆర్థిక సంవత్సరంలో 110 కోట్ల డాలర్లు కన్న ఎక్కువ అవసరం లేదని అభిప్రాయ పడింది. గత సంవత్సరంతో పోల్చిచూస్తే యీ సంవత్సరం ఎంతో మెరుగ్గావుంది. గత సంవత్సరం భారత సహాయక క్లబ్బునుండి అదనపు సహాయమేమీ లేకుండా 107 కోట్ల డాలర్లు మాత్రమే లభించాయి.

భారత సహాయక క్లబ్బు యిచ్చిన మొత్తంలో 80.2 కోట్ల డాలర్లను సభ్య దేశాలూ; మిగిలినసొమ్మును ప్రపంచ బ్యాంకూ, అంతర్జాతీయ అభివృద్ధి సంఘం కలిసి ఇచ్చాయి.

సగానికిపైగా సహాయక గ్రాంట్లూ, నామకార్థపు వడ్డీపైన దీర్ఘకాలిక ఋణాల రూపంలోనూ; 15 కోట్లడాలర్లు మినహా మిగిలిన దానిని 15 సంవత్సరాలూ, ఆపైన చెల్లించే రాయతీ గడువుమీదా యివ్వడం జరిగింది.

భారత సహాయక దేశాల క్లబ్బుద్వారా మూడవ పంచవర్ష ప్రణాళిక తొలి మూడు సంవత్సరాలకు లభ్యమైన సహాయం యిప్ప

---

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1963 జూన్ నెలలో విశాఖపట్నం జిల్లా నరసీపట్నం తాలూకాలోని యీ దిగువ పేర్కొన్న గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది :

చెట్టుపల్లి, రోలుగుంట, కొమరవోలు, కొత్తపేట.



టికి 341.7 కోట్ల డాలర్లు వుంది. వచ్చే సంవత్సరారంభంలో యీ సహాయకదేశాలు మూడవ ప్రణాళిక మిగతాకాలంలో అభివృద్ధిని పరిశీలించుటకుగాను తిరిగి సమావేశమౌతాయి.

1963–64 సం. కాలానికి భారత సహాయక దేశాలనుండి లభ్యమయ్యే సహాయం యీ విధంగా వుంటుంది. అమెరికా 43.5 కోట్లడాలర్లు, ఇంగ్లండు 8.4 కోట్ల డాలర్లు, జర్మనీ 9.95 కోట్ల డాలర్లు, ఇటలీ 4.5 కోట్ల డాలర్లు, జపాను 6.5 కోట్ల డాలర్లు, కెనడా 3.05 కోట్లడాలర్లు, ఫ్రాన్సు 2 కోట్ల డాలర్లు, నెదర్ లాండ్స్ 1.1 కోట్లడాలర్లు బెల్జియం 1 కోటి డాలర్లు, ఆస్ట్రియా 0.7 కోట్ల డాలర్లు, ప్రపంచబ్యాంకూ, అంతర్జాతీయ అభివృద్ధిసంస్థా కలిసి 24.5 కోట్ల డాలర్లు.

### దక్షిణాఫ్రికాకు ఆయుధ సహాయ నిషేధం

గత నెల మిత్రరాజ్య సమితి భద్రతా సంఘం, దక్షిణాఫ్రికాకు అన్ని దేశాలూ ఆయుధ సహాయాన్ని నిలిపివేయవలసిందిగా ఒక తీర్మానాన్ని చేయడంతో, దక్షిణాఫ్రికాలోని జాతి విచక్షణవిధానాన్ని ప్రపంచం ఒక్కుమ్మడిగా ఎదుర్కోవడంలో మరో అడుగు ముందుకు వేయడం జరిగింది. పదకొండు

(మిగతా 74 వ పేజీలో)

# మాజీ మంత్రి శ్రీ "అల్లూరి" అస్తమయం

ప్రసిద్ధ కాంగ్రెసు నాయకుడు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మాజీమంత్రి అఖిల భారత కాంగ్రెస్ మాజీ ప్రధాన కార్యదర్శి, రచయిత, శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు 3 వ తేదీ మధ్యాహ్నం 2-00 గంటలకు హైద్రాబాద్‌లోని ఉస్మానియా ఆస్పత్రిలో తమ 51వ యేట అస్తమించారు. కొద్దికాలంగా మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధితో శ్రీ రాజు బాధ పడుతున్నారు. శ్రీ రాజు మరణం పట్ల ముఖ్య మంత్రి డాక్టర్ నీలం సంజీవ రెడ్డి సంతాపాన్ని ప్రకటిస్తూ "శ్రీ అల్లూరి జీవితమంతా ఒక వీరోచిత గాథ. ఆయన అస్తమయం ఆంధ్ర దేశానికి తీరని సంతాపాన్ని కలిగించిం"దని అన్నారు.

## జీవితం

శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు 1913 జనవరి 25 న పశ్చిమ గోదావరి జిల్లా పలమర్రు గ్రామంలో రైతు కుటుంబంలో జన్మించారు. 1930 మొదలు స్వాతంత్ర్యసమరవీరుడుగా పెక్కు పర్యాయాలు జైలుకెళ్లారు. మొత్తంమీద 9 సంవత్సరాలపాటు జైలులోనే జీవితంగడిపారు. 1933 లో వీరిని అరెస్టుచేసి కాంగ్రెస్ సంస్థ రహస్యాలు రాబట్టాలని అప్పటి ప్రభుత్వం విపరీతంగా కొట్టించింది. శ్రీ అల్లూరి పట్ల పోలీసుల అమానుష ప్రవర్తన గురించి అప్పుడు మద్రాసు



శాసన మండలి చర్చించడం, అప్పటి ప్రభుత్వం ఒక విచారణ సంఘాన్ని ఏర్పాటుచేయడం కూడా జరిగింది. ఈ విషయం బ్రిటిష్ పార్లమెంటులో కూడా ప్రస్తావించబడింది. శ్రీ రాజు ఎం.ఎల్.సి.గా పార్లమెంటు మెంబరుగా, ఎ.పి.సి.సి. ప్రెసిడెంటుగా, ఎ.ఐ.సి.సి. ప్రధాన కార్యదర్శిగా బహుముఖంగా సేవచేశారు. శ్రీ డి. సంజీవయ్యగారి నాయకత్వాన 1960 లో ఏర్పడిన ఆంధ్ర ప్రదేశ్ మంత్రివర్గంలో పి. డబ్ల్యు. డి. మంత్రిగా పనిచేశారు.

వీరు 1934లో వినయాశ్రమంలో చేరి హిందీ భాషలో మంచి పరిజ్ఞానం సంపాదించారు. కొంత కాలంపాటు హిందీ ప్రచార కార్యదర్శిగా పనిచేశారు. శ్రీ రాజు చక్కని రచయిత కూడా. మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ విరచితమైన గ్రంథాన్ని "వోల్గా నుంచి గంగానది వరకు" అనే పేరుపెట్టి శ్రీ అల్లూరి తెలుగులోకి అనువదించారు.

సత్యాగ్రహోద్యమం ముమ్మరంగా కొనసాగుతున్న రోజులలో వీరు గుంటూరు జైలులోను, తర్వాత మంతెనవారి పాలెంలోను రాజకీయ పాఠశాలలు నడిపారు.

చొరవ, వ్యక్తిత్వం శ్రీరాజులోగల విశిష్ట లక్షణాలు, ఎటువంటి పరిస్థితినైనా సాహసంతో ఎదుర్కొని చాకచక్యంతో సాధించడం వీరిలోగల ప్రత్యేకత.

శ్రీ సత్యనారాయణరాజు గారికి వృద్ధులైన తల్లిదండ్రులు భార్య, ముగ్గురు కొడుకులు, ముగ్గురు కుమార్తెలు వున్నారు.

# ప్రాచీన ఈజిప్షియన్ చిత్రకళ

ప్రపంచ ప్రఖ్యాతి కాంచిన ప్రాచీన చిత్ర కళలలో ఈజిప్షియన్ చిత్రకళ మరొకటి. ఈ చిత్రకళ క్రీ. పూ. మూడు వేల సంవత్సరముల నాటిది. నాందీ ప్రస్తావన లేకుండానే ఆనాటికే ఈ చిత్రకళెంతో అభివృద్ధి చెందినట్లు కన్పించుట చేతను, మెసపొటేమియన్ చిత్ర కళను కొన్ని విధముల పోలి యుండుట చేతను, మెసపొటేమియన్ చిత్రకళ నుంచే ఈ చిత్ర కళ జనించినదని ఒక వాద మున్నది. కాని కొందరు ఈ వాదమును ఖండించుచు, ఈజిప్షియన్ చిత్రకళ మెసపొటేమియన్ చిత్రకళ కన్న ఉదాత్తమైన దనియు, బహుశః ఒకచోటి నివాసస్థులే ఈ రెండు దేశములకు వలస వచ్చి యుండవచ్చు ననియు, అదే ఆ రెండు చిత్రకళలకు గల పోలికలకు కారణమై యుండవచ్చు ననియు నుడువుచున్నారు. కానీ నాటికి ఈ రెండు చిత్రకళల గురించి మన కింకను తెలియని విషయములనేకము లుండుటచే, మనము ఈ ప్రాచీన అర్వాచీనతల గురించి సాజాత్యమును గురించి ఒక నిర్ణయమునకు రాలేము.

అనేక శతాబ్దముల కాలము వర్ధిల్లిన ఈజిప్షియన్ చిత్రకళ కాలక్రమాన కొలది మార్పులు పొందినను, తన ప్రత్యేకతను మాత్రము తుదివరకును పోగొట్టుకొనలేదు. ఈ చిత్రకళ రెండు భిన్న విధములుగా నున్నది. ఒకటి మత సంబంధమైనది, రెండవది సామాన్య జీవితమునకు సంబంధించినది. వారెన్నడును ఈ రెండిటిని ఏకము చేయలేదు. కాని దురదృష్టవశాత్తు ఈనాడు ఆ రెండవ చిత్రకళ పూర్తిగా



'కారనాక'లో శిధిలదేవాలయం

రూపుమాసినది. మొదటి చిత్రకళకు స్థానమైన వారి సమాధులు కూడా చాలావరకు దొంగలబారిని, కళాత్మక వస్తువులు ప్రోగు చేయువారి బారినిపడి ధ్వంసమైనవి. అందువల్ల ఈనాటికి కూడా మనకీ ఈజిప్షియన్ చిత్రకళ గురించి తెలియని విషయము లనేకము లున్నవి.

— క. దివ్యజ్ఞాన సరోజినీదేవి

ఈజిప్షియన్ చిత్రకళ ముఖ్యముగా సాంకేతిక చిత్రకళ. మామూలుగా కనపడే వారి వేటచిత్రములు కూడా ఆధ్యాత్మికము లైన అర్థములే కలిగియుండును. ఆ చిత్రకారులు ఆత్మను స్వేచ్ఛగా విహరించు పక్షిగాను, చెడును క్రూర మృగముగాను చిత్రించెడివారు. వారు తమ చిత్రములందు హావభావముల కన్నను అర్థమునకే ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చిరి. ఆ చిత్రములను మనము పూర్తిగా అర్థము చేసుకొనవలయు

నన్ను, మొదట వారి మతమును గురించి మనము తెలుసుకొనవలసి యున్నది. ఈజిప్షియనులకు మృత్యువు పిమ్మట జీవితము గురించి అనేక నమ్మకము లుండెడివి. వారికి మృత్యువు తరువాతకూడ అన్నపానీయములు, వస్త్ర అలంకారములు, పరివారము వుండవలసినదే. సమాధులలో వీటన్నిటిని సమకూర్చుటయే గాక, అవి పూర్తియైన మరల క్రొత్తవి సమకూర్చబడుటకై వారీ చిత్రములను చిత్రించెడివారు. ఆ మృతి చెందిన వారికి వ్యవసాయము, వేటలకు సంబంధించిన చిత్రములు అన్నపానీయములను, నృత్య గానాదులు చేయు స్త్రీ చిత్రములు, విందు చిత్రములు వినోదమును, యిటుక రాళ్ళు తయారు చేయుచున్న వారి చిత్రములు, సౌధములను, కంసాలుర చిత్రములు నగలను, కుమ్మరివారి చిత్రములు పాత్రలను, సేవకుల చిత్రములు సేవను సతతము లభింపచేయునని వారు గాఢముగా నమ్మియుండిరి.

వీరు తమ దేవతా ప్రతిమలను మానవ రూపములోనే చేసెడివారు. కొన్ని దేవతలకు మాత్రము మృగముల తలలను చిత్రించెడివారు.

ఈ చిత్రకళ కున్న మరియొక ప్రత్యేకత వారి సాంకేతిక లిపి (Hieroglyphs). వీరీ చిత్రములను సాంకేతిక లిపికి వుపయోగించుటయే గాక, ఒక ప్రదేశమునో, వస్తువునో అలంకరించుటకు ఈ లిపి చిత్రములనే మరింత పెద్దవి చేసి, వివరముగాను, సవిస్తరముగాను చిత్రించెడివారు

ఈజిప్షియన్ చిత్రకారులు శిల్పులు కేవలము మానవ పశుపక్ష్యాదుల ప్రతిమలతోనే గాక అనేకరకములైన రేఖలతో కూడ తమ సమాధులనేమి, దేవాలయములనేమి, గృహములనేమి, వస్తుసామాగ్రినేమి చక్కగా అలంకరించెడివారు. ఇవి వివిధ రీతులలో వుండి నేటికిని మనలను ఆకర్షించును.

ఈజిప్షియన్ చిత్రకళలో శిల్పముకన్నను చిత్రలేఖనమునకే ఎక్కువ ప్రాముఖ్యత కలదు. ఇందుకు వారికి వర్ణములందుగల ప్రీతియే కారణమేమో ! వారు శిల్పములు చెక్కునప్పుడు సైతము వాటి కుపయోగించు సున్నపు రాయి, నల్లరాయి, యిసుకరాయి మొదలగు రాళ్ళపై వారు చెక్కదలచు కొన్న చిత్రపు ఆకారములను మొదట చిత్తుగా రంగుతో గీసెడివారు. శిల్పి వీటిని చెక్కిన పిమ్మట మరల చిత్రకారుడు తన కుంచెలతో ఆ శిల్పములకు వన్నెలు దిద్దెడివాడు. రాజాధిరాజులు కుడ్యచిత్రములతో సమాధుల నలంకరించగా సామాన్యులు తమ గృహములను పలు వర్ణముల రెల్లుగడ్డి చాపలతో నలంకరించెడివారు. కడకు వారు, వారి గృహోపకరణములనుకూడా ధనవంతులైన రత్నములతోను, సామాన్యులైన వర్ణములతోను అలంకరించుకొనెడివారు. వారికి ఇహపరములందు కూడ వర్ణములు, చిత్రలేఖనము ఒక ముఖ్య అవసరముగా గోచరించెడిది. తమ దేవాలయములను సైతము బంగారురేకులతోను, సాంకేతిక లిపిని వైఢూర్యములతోను నీటిలో కలపబడిన రంగు గాజు పొడితోను అలంకరించెడివారు వర్ణవిహీనమైన యేవస్తువును సుందరముగా నుండదనియు, ఆనందానుభూతి కలుగచేయదనియు నమ్మియుండిరి. కడకు వారు వారి నగలను సైతము అనేక వర్ణముల రత్నములతోను, రంగు అద్దముల పొడితోను అలంకరించెడివారు. కాని వారీ వర్ణములను యిష్టము వచ్చినట్లు వాడెడువారు కాదు. కొన్ని వస్తువులను కొన్ని వర్ణములలో చిత్రించిననే వాటికి అందము, భావము, సహజత్వము మంత్రసంబంధమైన శక్తియు కలుగునని వారు గాఢముగా విశ్వసించెడివారు ఎట్టి పరిస్థితులలోను వీరీ వర్ణములను మార్చెడివారు కాదు. ఈ వర్ణములను వాడిన రీతి కూడ మిగుల ప్రశంసనీయమైనది. వర్ణములన్నియు నొండొంటితో నొకటొకటి చక్కగా కలసి, చూచు వారికి ఆనందానుభూతికలుగచేయునవిగా నుండును.

ఈజిప్టులో చిత్రకళ మృణ్మయపాత్రలతో ప్రారంభమైనదని చెప్పవచ్చును. ఈ చిత్రకారులు మొట్ట మొదట స్వేతపాటల వర్ణములుగల మృణ్మయ పాత్రలపై మానవ జంతు ప్రతిమలను, వృక్షాదులను చిత్రించెడివారు.

ఈజిప్షియన్ చిత్రకారు లెప్పుడును తమ చిత్రములందలి మానవ ప్రతిమల ముఖములను, కాళ్ళను, పార్శ్వము నుండియు, ఊర్ధ్వ భాగమును ఎదుటి నుండియు, తుంటిని కొద్దిగా ప్రక్క నుండియు చిత్రించెడివారు వారు పార్శ్వ ముఖముననే చిత్రించినను, నేత్రములను పూర్తిగా చిత్రించెడివారు. బహుశః దీనికి వారు ముఖమునకు నేత్రములే జీవకళ నివ్వగలవని నమ్మియుండుటయే కారణము కావచ్చును. స్త్రీ శరీరముల నెల్లప్పుడు పాటల ఛాయగల పసుపు వర్ణములోను ('హాతుర్' దేవతా శరీరము మాత్రము ముదురు ఛాయలో చిత్రించెడివారు) పురుషుల శరీరమును ఎరుపు ఛాయగల మట్టి వర్ణములోను చిత్రించెడివారు. చిత్తరువు వెనుక భాగము సాధారణముగా తెలుపులోను, కొన్ని చోట్ల మాత్రము పసుపు వర్ణములోను వుండెడిది.

ఈ ప్రాచీన చిత్రకారులు తమ చిత్రములను కేవలము రేఖలతోనే చిత్రించినప్పటికిని అక్కడక్కడ ఛాయలను కూడ ఉపయోగించి యున్నారు. సాధారణ చిత్రములందు (సాంకేతిక చిత్రములు కానివి) ప్రకృతిని

పశుపక్ష్యాదులను ఎంతో సహజముగా చిత్రించియున్నారు. సాంకేతిక చిత్రములు కూడ సహజముగానే వున్నప్పటికిని, వాటిలో సహజత్వముకన్నను, భావమునకే అందులోను అర్థమునకే ఎక్కువ ప్రాముఖ్యత యివ్వబడినది.

కుడ్యచిత్రములు చిత్రించునప్పుడు మొదట ఆ గోడనురెండు సె.మీ. మందముగల మట్టిపొరతో కప్పెడివారు. అది ఆరిన పిమ్మట దానిపై మందముగా, ఒకవిధమైన సీమసున్నపు (gypsum) పొర కప్పెడివారు. దీనిపై మరల తెల్లసున్నము పూసెడివారు. ఈ విధముగా తయారు చేయబడిన ప్రదేశముపై ఆ చిత్రకారులు ఎరుపు వర్ణముతో చిత్తుగా చిత్రమును సరైన పాళ్ళలో వుండునట్లు చిత్రించెడివారు. అటుపిమ్మట దానిపై, తెలుపు, నలుపు, పసుపు, పచ్చ, నీలి వర్ణముతో మనోహరముగా చిత్రించెడివారు. వీరు సాధారణముగా శాతిపై చెక్కడపు పనిమాత్రమే చేసెడివారు. కాని ఒక్కొక్కప్పుడు ఆ రాయి ఎగుడు దిగుడుగా వుండి చెక్కుటకు వీలులేనియెడల లోగడ చెప్పబడిన విధముగా తాపటము (Plaster) చేసి పలువిధవర్ణములతో దానిపై చిత్రించెడివారు.

ఈజిప్షియన్ చిత్రకారులు తమ చిత్రముల నెప్పుడును గోడలపై అడ్డముగా 12 నుండి 18 అంగుళముల ఎత్తులో చిత్రించెడివారు. ఒక గోడమీద ఒక చిత్రమేగాక, అడ్డముగా చిత్రింపబడిన చిత్రములు ఒక దానిక్రింద మరొకటి లైన్లవారీగా నున్నవి.

ఆ నాటికే ఈ చిత్రకారులు వర్ణముల తయారీయందు నేర్పు గడించి యుండిరి, పసుపు, పచ్చ, ఎఱ్ఱ ఛాయలను ఒకవిధమైన లోహయుతమైన ఎఱ్ఱరిమన్ను నుండియు తెలుపుసున్నము, సీమసున్నమునుండియు నలుపు వర్ణము మసినుండియు, పచ్చ నీలములు కాల్చిన భస్మము (Calcined) చేయబడిన మిశ్రమముల నుండియు తయారు చేసెడివారు. ఈ విధముగా తయారు చేయబడిన వర్ణములలో వారు నీటిని, బాగుగ అంటుకొనుటకై జిగురును, కొన్ని సమయములందు గ్రుడ్డులోని పసుపు భాగమును కూడ కలిపి వాడెడివారు.

ఈజిప్షియనులు శిల్పవిద్యయందు కూడ నేర్పరులే. వీరీ శిల్పములను సున్నపురాయి చంద్రకాంతపురాయితోనే గాక, కఠినశిలయైన నల్లరాతితోకూడ చేయుట వారికి ఆ విద్యయందుండే నేర్పరితనమును చెప్పకయే చెప్పుచున్నది. వీరు మానవ ప్రతిమలను మలచునప్పుడు ప్రతిమ నంతటినీ సహజముగానే చెక్కినను, ముఖమును మాత్రము మరింత సహజముగా మలచెడివారు. దీనికి కారణము వారు ముఖమునకిచ్చిన ప్రాముఖ్యతేగాని, మిగిలిన దేహముకూడ అతి సహజముగా మలచుట తెలియక పోవుట మాత్రముకాదు. వారు ముఖమునందును నేత్రములకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చెడివారు. రాగితో చేయబడిన ఈ నేత్రములందు కంటిపాప భాగమందు సాల గ్రామశిలను, మిగతాభాగమున తెల్లసున్నపురాతిని పొదిగెడివారు. ఒకొక్క సారీ శిల్పములందలి ముఖములు ఆ మనుష్యుల ముఖములకు ప్రతిరూపములుగా (potraits) వుండెడివి, దీనివలన ఆ నాటివారికి శిల్పములను సహజముగా మలచుట తెలియుననియు, కాని వీరు సహజత్వము కన్నను భావమునకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చుటచే కొన్ని శిల్పములు అంత సహజముగా లేవనియు మనము గ్రహింపవచ్చును. వీరు సాధారణముగా దేవతాప్రతిమలను, రాజవంశీయుల ప్రతిమలనే చెక్కెడివారు. అంగవైకల్యుల, వృద్ధుల ప్రతిమల జోలికి పోయెడివారుకాదు. నిలుచున్న ప్రతిమలెప్పుడును ఒక కాలు ముందుంచి నిలుచుని యున్నట్లు చిత్రింపబడెడివి. వస్త్రములు అతి పలుచనివై శరీరమునకు చుట్టుకొని పోయినట్లు చిత్రించబడెడివి. ఆ నాటి చిత్రకారులు ఈ శిల్పములకు వర్ణములు కూడ పూసెడివారు. వస్త్రములకు శ్వేత వర్ణమును, జుట్టుకు నలుపు వర్ణమును, శరీరములకు యిదివరకు పేర్కొనబడిన వర్ణములను పూసెడివారు. వీరు మట్టితోను, దంతముతోను కూడ చిన్నచిన్న విగ్రహములు చేసెడివారు.

ఈ శిల్పులు మానవ ప్రతిమలనే గాక

న్యూ ఎంపైర్‌కు చెందిన (క్రీ. పూ. 1400 సం॥ నాటి) 'కారనాక'లో ఒక హాలు



సింహము, కోతి, పీటి గుణ్ణము మొదలగు జంతువుల ప్రతిమలను, రేఖా చిత్రములను కూడ చెక్కెడివారు.

ఈజిప్షియనులకు వాస్తుశాస్త్రమందుండిన జ్ఞానము మనలను సంభ్రమాశ్చర్యములలో ముంచును. వీరు తమ స్వగృహములను చెక్క, మట్టితోను, నైలునది ఒడ్డున దొరకు రెల్లుగడ్డి కాడలతోను, తాళవృక్ష బోదెలతోను కట్టినను, తమ దేవాలయములను, సమాధులను, అంతఃపురములను మాత్రము అంతకన్నను దృఢతరమైన ఎండబెట్టిన యిటుకలతోను, సున్నపురాయి, యిసుక రాయి, నల్లరాయి మొదలగు రాళ్ళతోను కట్టెడివారు.

వీరి కట్టడములందు సమాధులు ప్రపంచ ప్రఖ్యాతములు. ఈ సమాధులను (రాజ వంశీయులవి) భూమికి లోపలి భాగమున అనేక గదుల రూపములో కట్టెడివారు. ఇందు ప్రధాన గది లోపలి ప్రక్క గోడకు రాయి ఉపయోగించెడివారు. ఈ రాతి గోడను మట్టితో కట్టెడివారు. ఈ గోడ ఎంత కట్టుదిట్టముగా వుండెడిదన్న ఆ రాళ్ళ మధ్య సూది దూరునంతటి స్థలము కూడ వుండెడిది కాదట. ఈ ప్రధాన గదియందే రాజు శవ పేటిక, అతని విలువైన వస్తువులు వుంచబడెడివి. ఈ గదులపై వారు చెక్క పలకలతో కప్పు నేర్పరచి, దానిపై రాళ్ళు, రప్పలు పోసి ఆ గదులను పూడ్చి వేసెడివారు. దీనిపై, అనగా భూమి పైభాగమునకు వుండునట్లు యిటికతో ఒక కట్టడము కట్టెడివారు. దీనిని వారు 'మస్‌లౌబ' (అరుగు) అని పిలచెడివారు. (ఇటువంటి అరుగులే చిన్నవి వారి స్వగృహములందు వెలుపలి భాగమున వుండెడివి) ఈ కట్టడమందుకూడ గదులు వుండెడివి. వీటిలో తక్కువ విలువగల వస్తు సముదాయములను ఉంచెడివారు. ఈ కట్టడము పైన కూడ చెక్క పలకలతోను, రాళ్ల రప్పలతోను కప్పు నేర్పరిచెడివారు. ఇది దూరమునుండి చూచుటకు ఒక పెద్ద దిబ్బవలె నుండును. దీని చుట్టు వారు ప్రహరీ గోడను కట్టెడివారు.

ఈ 'మస్‌లౌబ' సమకోణ చతురస్ర ఆకారములో వుండెడిది. దీని వెలుపలి గోడలను ఈజిప్షియనులు తమ గృహముల యొక్కయు, అంతఃపురముల యొక్కయు వెలుపలి గోడలను పోలి యుండునట్లు కట్టెడివారు. అంతేగాకుండ ఈ గోడలపై పలువిధవర్ణములతో తమ గృహముల వెలుపలి గోడల నుండు రెల్లుగడ్డి చాపలను చిత్రించెడివారు. ఈ సమాధిలోని ప్రధాన గది గోడలను వర్ణ చిత్రముల తోను, పలు వర్ణముల రెల్లుగడ్డి చాపలతోను అలంకరించెడి వారు. ఈ గది గచ్చును రాతితోను, కొన్నిచోట్ల చెక్కతోను కూడ చేసెడివారు. కొన్ని సమాధులందు మెట్లుండెడివి. ఈ మెట్లను, ద్వారబంధములను కూడ వీరు రాతితో నిర్మించెడివారు.

కొంత కాలము పిమ్మట అనగా క్రీ. పూ. 2600 సంవత్సరముల నాటికి ఈ సమాధుల పై భాగమున నిర్మింపబడిన 'మస్‌లౌబ'ల స్థానే రాతితో నిర్మింపబడిన సూచ్యగ్ర స్తంభ ఆకారములు (Pyramids) లేచినవి. వీటన్నిటిలో పెద్దది 480 అడుగుల ఎత్తుంది. 13 ఎకరముల స్థలమాక్రమించు కొన్నదన్న ఆనాటివారికి వాస్తు శాస్త్రమునందలి గల నేర్పుకు మన మాశ్చర్యపడవలసినదే. ఈజిప్టుని క్రీ. పూ. 450 వ సంవత్సరమున దర్శించిన గ్రీకు చరిత్ర కారుడు 'హెరోడొటస్' ఈ పిరమిడ్ 20 సంవత్సరముల కాలము, లక్షమ్మందిచే సంవత్సమున మూడు నెలల లెక్కన నిర్మింపబడినదని నుడివియున్నాడు. ఈ పిరమిడ్ ఆకృతి సాంకేతిక మైనదనియు, సూర్యభగవానుని కిరణములు భూమిపై ప్రసరించుటనే యిది సూచించు ననియు కొందరు అభిప్రాయపడుచున్నారు. పిరమిడ్‌లేగాక ప్రకృతిసిద్ధమైన గుహనుండి తొలచబడిన ఈజిప్షియన్ స్ఫ్వింగ్స్' (Spinx) కూడ ప్రపంచ ప్రసిద్ధముచెందినదే. ఇది మానవ శిరస్సుగల సింహాకృతిలో మలచబడినది.

ఈజిప్షియనులు తమ దేవాలయములను మొదట మానుతో కట్టినను, ఆటు పిమ్మట రాతితోను, యిటుకతోను కట్టసాగిరి. ఈ దేవాలయములు దీర్ఘ చతురస్ర ఆకారములలో నిర్మింపబడెడివి. ఈ కట్టడములందు గల పెద్ద స్తంభములే వాటి ప్రత్యేకత. 'కార్‌నాక్' దేవాలయమునందు ఈ స్తంభములు 69 అడుగుల ఎత్తున, 12 అడుగుల మందమున నిర్మింపబడినవి. ఈ స్తంభములపై సాంకేతికలిపి చిత్రములు మలచబడెడివి. వీటిని ఈజిప్షియనులు వివిధ వర్ణములతో అలంకరించెడివారు. ఈ చిత్రములు దేవతలకు, రాజులకు సంబంధించినవై యుండెడివి. ఈ చిత్రములనేగాక ఆనాటి వారు, ఈ స్తంభముల కొన్నింటిపై తామర పుష్ప ఆకృతులను తాళపత్ర ఆకృతులను కూడ చిత్రించెడివారు. వీరు దేవాలయపు గోడలపై సైతము కనుల పండువుగా అనేక రకములైన చిత్రములు చిత్రించెడివారు.

ఈజిప్షియనులు తమ దేవాలయ, సమాధుల నిర్మాణమునందు వాడిన యిటుకలను సన్నగా తరిగిన ఎండుగడ్డి కలపబడిన (ఒక నిర్ణీత పాలులో) వండ్రుమట్టితో తయారు చేసెడివారు. ఎండుగడ్డి లభ్యముకాని యెడల దాని స్థానే యిసుక కూడ వుపయోగించెడి వారు. కాని ఇది చాలా అరుదుగా జరిగెడిది. ఈ యిటుకలకు ఉపయోగించెడి మట్టి లేత

పసుపునుండి, ముదురు బూడిదరంగు వరకు అనేక ఛాయలలో నుండెడిది. అంతే గాకుండ ఈ యిటుకలు వివిధ పరిమాణములలో కూడ ఉండెడివి. ఇవి 23 × 12 × 7 సె. మీ. నుండి 13.5 × 4.5 × 4.5 సె. మీ. వరకు వివిధ పరిమాణములలో వుండెడివి.

ఈ ఈజిప్షియన్ శిల్పులు, చిత్రకారులు వర్ణములు కలుపుటకై వారు పళ్లెరములను (Palettes) దృఢమైన బలపపురాతితో తాబేలు, ఏనుగు, చేప, నీటిగుఱ్ఱము మొదలగు ఆకృతులలో నెంతో సొంపుగా చెక్కెడివారు. ఈ పళ్లెరములపై కూడ వీరక్కడక్కడ వేట చిత్రములను, రాజుల యుద్ధ చిత్రములను, సాంకేతిక చిత్రములను, సైతము ఎంతో నిపుణత్వముతో చెక్కియున్నారు.

వీరు తమ సమాధులందలి వస్తువులకు కఱ్ఱలేక దంతముతో చేసిన ముద్రలను అంటించెడివారు. ఇవి 1 × 1.2 సె. మీ. నుండి 7.5 × 9 5 సె. మీ. వరకు వివిధ పరిమాణములలో వుండెడివి. వీటిలో కొన్నింటిపై చెక్కడపు పనియు, మరి కొన్నింటిపై ఎరుపు, నలుపు వర్ణముల చిత్రములను గలవు. ఈ చిత్రములన్నియు సాంకేతిక లిపికి సంబంధించినవే.

వీరి మృణ్మయ పాత్రలు వాటిపై చిత్రింపబడిన చిత్రములకేగాక, వాటి వివిధాకృతులకు కూడ ఎంతో ప్రసిద్ధి చెందియున్నవి. కాని మృణ్మయ పాత్రలకన్నను ప్రసిద్ధి చెందినవి వారి రాతి జాడీలు, పాత్రలు. వాటిని వీరు చంద్రకాంతపు రాయి, సున్నపు రాయి, చలువ రాయి, సర్పెన్‌టైన్, స్టియటైట్ మొదలగు రాళ్ళనుండియే గాక, జాస్పర్ (ఒక రకమైన వజ్రము), సాలగ్రామశిల మొదలగు కఠిన శిలల



న్యూఎంపైర్‌కు చెందిన (క్రీ.పూ. 1400 సం॥నాటి) స్త్రీ మూర్తి

నుండియు, అనేక ఆకృతులలో చేసెడివారు. ఈ ఆకృతులు నేడు కూడ యింకను అనుకరింపబడుచున్నవి. కాని వీటినింత సుందరముగా మలుచుటకు వారు వాడిన పరికరముల సంగతి మాత్రము మనకు తెలియకున్నది.

ఈజిప్షియనుల ఆభరణములందు సైతము వారికి గల కళాభిరుచి ద్యోతకమగును. వీరు మొట్టమొదట బంగారుతోను, అటుపిమ్మట కొంతకాలమునకు వెండితోను (దీనిని వీరు తెల్ల బంగారమని పిలచెడివారు) పలురకముల ఆభరణములుచేసి, వాటిని వివిధ వర్ణముల రాళ్ళతోను, కురవిందరత్నము (Carnelian) వైఢూర్యము మొదలగు విలువైన రత్నములతోను పొదిగెడివారు.

వీరు రాగితో పాత్రలను, పనిముట్లను, ఆయుధములను కూడ చేసెడివారు. ఈ రాగి ఆయుధములకు, పనిముట్లకు రాతితో మెరుగు పెట్టెడివారు. వీరు ఎముక, దంతములతో కూడ చిన్నచిన్న ప్రతిమలు, నగలు, ఆయుధముల పిడులేగాక, నిత్య జీవితమున కుపకరించు అనేక చిన్న సామానులను కూడ చేసెడివారు. వారి గృహోపకరణములు సైతము వారికిగల కళాభిరుచినే ప్రతిబింబింపచేయును. కఱ్ఱ, మామూలు రాయి, చంద్రకాంతపురాయి మొదలగు వాటితో చేయబడిన ఈ సామానులను, వారు బంగారు రేకు, రత్నములతోను, రంగు గాజులతోను, దంతము, చంద్రకాంతపురాళ్ళతోను సాధారణ వర్ణములతోను చక్కగా అలంకరించెడివారు.

ఈ విధముగా క్రీ. పూ. మూడు వేల సంవత్సరములనుండి క్రీ.పూ. మూడువందల సంవత్సరముల వరకు అలరారిన ఈ అత్యుత్తమ ప్రాచీన చిత్రకళ ఈ శతాబ్ది ప్రారంభముననే ప్రపంచముయొక్క కనులబడినది. ★

*(ఈ వ్యాసంలోని శిల్పాలకు ప్రతికృతులు శ్రీ శీలా వీర్రాజు)*

# వెలుగు బాటలు

*"ఒక పరిశీలకుడు"*

ప్రజాస్వామిక వికేంద్రీకరణపై శ్రీ బల్వంతరాయ్ మెహతా కమిటీ చేసిన సిఫార్సులను ఆమోదించి రాష్ట్రంలో పంచాయతీ రాజ్ విధానాన్ని ప్రవేశపెట్టిన భారత రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ మొట్ట మొదటిది. అన్ని రాష్ట్రాలలోనూ పంచాయతీ రాజ్ వ్యవస్థను ప్రవేశపెట్టి దేశమంతటా ఒకేవిధమైన పరిపాలనా విధానాన్ని తేవడానికి కృషి జరుగుతున్నది. ఇందువల్ల, గ్రామీణ ప్రాంతాలలో జీవన ప్రమాణాలను పెంపొందించడానికే గాకుండా జాతీయ సమైక్యతను పటిష్ఠం చేయడానికి కూడా వీలవుతుంది. దేశంలో అత్యవసర పరిస్థితిని ప్రకటించిన పిమ్మట గ్రామీణ రక్షణ, వ్యవసాయోత్పత్తులను పెంపొందించే నిమిత్తం గ్రామ ప్రాంతాలలో రక్షణ శ్రామిక బ్యాంకు, గ్రామీణ స్వచ్ఛంద సేవకదళాలను ప్రారంభించారు.

కేంద్ర సమాజాభివృద్ధి, సహకార మంత్రిత్వశాఖ, పంచాయతీ రాజ్ పురోగతిని ముఖ్యంగా దిగువ పేర్కొన్న అంశాల దృష్ట్యా సమీక్షించే నిమిత్తం 1963 ఆగస్టు 6,7,8 వ తేదీలలో హైదరాబాదులో ప్రాంతీయ అధ్యయన శిబిరాన్ని ఏర్పాటు చేసింది :—

(1) గ్రామీణ స్వచ్ఛంద సేవక దళాలు, రక్షణ శ్రామిక బ్యాంకులు.

(2) రాజకీయ ప్రజాస్వామ్యానికి ప్రాతిపదికగా గ్రామ సభ.

(3) సాంఘిక ప్రజాస్వామ్యానికి మూలాధారంగా ఆర్థిక ప్రజాస్వామ్యం.

ఈ శిబిరం, పబ్లిక్ గార్డెన్స్‌లోని జూబిలీ హాలులో మూడు రోజుల పాటు జరిగింది. శ్రీ ఎస్. కె. దే అన్నట్లు ఈ శిబిరంలో పాల్గొన్న ప్రతినిధులు అనేక సందర్భాలలో ప్రముఖ పాత్ర వహించారు. ఆంధ్రప్రదేశ్, మైసూరు, మహారాష్ట్ర, కేరళ, మద్రాసు రాష్ట్రాలకు చెందిన పార్లమెంటు సభ్యులు, శాసన సభ్యులు ఈ శిబిరంలో పాల్గొన్నారు. వారు తమ అభిప్రాయాలను నిష్కర్షగా వెల్లడించారు.

ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి డాక్టర్ ఎన్. సంజీవరెడ్డి శిబిరానికి ప్రారంభోత్సవం చేస్తూ అభివృద్ధి కార్యకలాపాలకు ప్రజా సహకారాన్ని పొందడానికి పంచాయతీ రాజ్ పథకం మార్గమని అన్నారు. జాతీయ అత్యవసర పరిస్థితి దృష్ట్యా గ్రామీణ స్వచ్ఛంద సేవకదళం, రక్షణశ్రామిక బ్యాంకులను ప్రారంభించారనీ, ఇవి ద్వితీయ రక్షణశ్రేణిని పటిష్ఠంచేయడానికి సహాయపడతాయనీ ఇవి పటిష్ఠంగా లేనిదే అద్భుతమైన ఫలితాలను సాధించడం దుస్సాధ్యమని ఆయన అన్నారు. గ్రామీణ స్వచ్ఛంద సేవకదళం పథకం బాగా ఫలప్రదం కాకపోవడానికి గల కారణాలను పరిశీలించ వలసిందిగా ఆయన ప్రతినిధులకు సూచించారు.

ప్రణాళికా, పంచాయతీ రాజ్ శాఖా మంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి ప్రతినిధులకు స్వాగతం చెబుతూ, సాధ్యమైనంత త్వరలో గ్రామీణ ప్రాంతాలలో జీవన పరిస్థితులను మెరుగుపరచే నిమిత్తం పంచాయతీ రాజ్ సంస్థలకు రాష్ట్ర ప్రభుత్వం ఇతోధికంగా అధికారాలు ఇవ్వదలచిందని వెల్లడించారు. రాష్ట్రంలోని అన్ని పంచాయతీలనుంచి ఎన్నికైన సభ్యులతో ఏర్పడిన రాష్ట్ర పంచాయతీ రాజ్ సంస్థను, ప్రభుత్వం పంచాయతీ రాజ్ విధానానికి సంబంధించిన అంశాలపై సంప్రదిస్తున్నదని ఆయన తెలియ జేశారు.

తమకు ప్రత్యక్షంగా కలుగుతున్న ఇబ్బందులను పరస్పరం తెలుసుకోవడానికే గాకుండా, జాతీయ అత్యవసర పరిస్థితిలో అవసరాలను ఆదుకునేందుకై గ్రామీణ స్వచ్ఛంద సేవకదళం, రక్షణ శ్రామిక బ్యాంకులను పటిష్ఠంగా నిర్వహించడానికి సాధనోపాయాలను పరిశీలించడానికి కూడా ఈ అధ్యయన శిబిరం తోడ్పడగలదని ఆయన ఆశాభావం ప్రకటించారు.

### 5 స్థాయిలలో ప్రభుత్వాలు

కేంద్ర సమాజాభివృద్ధి, సమాచారశాఖల మంత్రి శ్రీ ఎస్. కె. దే శిబిర ప్రతినిధులను ఉద్దేశించి ప్రసంగిస్తూ, దేశంలో కేంద్రం, రాష్ట్రం, జిల్లా, బ్లాకు, గ్రామం ఈ అయిదు స్థాయిలలో ప్రభుత్వాలు వున్నాయన్నారు ఈ పద్ధతిసక్రమంగా అమలుజరిగే పక్షంలో, ఈ సంస్థలన్నింటికీ సముచిత స్థానం కల్పించేందుకూ, పరస్పర సంబంధం గల ప్రజాస్వామిక వ్యవస్థకు సమగ్ర స్వరూపాన్ని చేర్చేందుకూ రాజ్యాంగం సవరించబడుతుందనీ, ప్రజాస్వామిక సామ్యవాదాన్ని ఎలా స్థాపించాలన్నదే నేటి మన ప్రధాన సమస్య అనీ ఆయన అన్నారు. పంచాయతీ రాజ్ వల్ల సిద్ధించగల రాజకీయ ప్రజాస్వామ్యం, ఆర్థిక ప్రజాస్వామ్యం లేనిదే ప్రయోజనకారి కాదనీ, సమాజంలోని ప్రతి వ్యక్తినీ సహకార సమాజం లేదా సామ్య

వాద సమాజ స్థాపనలో అతని వంతు పాత్రను నిర్వర్తింపజేయాలనీ ఆయన అన్నారు. గ్రామీణ స్వచ్ఛంద సేవక దళం, రక్షణ శ్రామిక బ్యాంకులను గూర్చి, రాజకీయ ప్రజాస్వామ్యానికి ప్రాతిపదికగా గ్రామ సభ, సాంఘిక ప్రజాస్వామ్యానికి మూలాధారంగా ఆర్థిక ప్రజాస్వామ్యం అనే విషయాలను గూర్చి ప్రాధాన్యక్రమంలో చర్చించ వలసిందిగా ఆయన శిబిర ప్రతినిధులకు విజ్ఞప్తి చేశారు.

## గ్రామీణ స్వచ్ఛంద సేవక దళం

రక్షణ కృషికై మానవ శక్తినీ, వస్తు సంపదనూ సంపూర్ణంగా సమీకరించడానికి 1963 జనవరి 26వ తేదీన గ్రామీణ స్వచ్ఛంద సేవకదళం పథకాన్ని ప్రారంభించారు. ఈ పథకాన్ని అనుసరించి ప్రతి పంచాయతీ ఒక గ్రామీణ స్వచ్ఛంద సేవక దళాన్ని నిర్వహిస్తుంది. ఈ దళంలో గ్రామంలోని దేహ దార్ఢ్యంగల వయోజనులు సభ్యులుగా వుంటారు. "దళపతి" నాయకత్వాన ఈ దళం పనిచేస్తుంది. ఇది ఉత్పత్తి, జన బాహుళ్యానికి విద్యగరపడం, గ్రామీణ రక్షణ అనే మూడు విధాలైన బాధ్యతలను నిర్వర్తిస్తుంది. కార్యక్రమాలను రూపొందించడం, ఆదేశాలు ఇవ్వడం, సమన్వయ పరచడం పూర్తిగా పంచాయతీ రాజ్ సంస్థల పరంగా జరుగుతుంది. ఇప్పుడు ఈ పథకం అన్ని రాష్ట్రాలలోనూ అమలులోవుంది. ఇప్పటివరకు గ్రామీణ స్వచ్ఛంద సేవక దళంలో 166 లక్షల మంది పురుషులు, 4.8 లక్షల మంది స్త్రీలు నమోదయ్యారు.

## రక్షణ శ్రామిక బ్యాంకులు

రక్షణ శ్రామిక బ్యాంకు గ్రామీణ స్వచ్ఛంద సేవక దళం పథకంలో భాగం. దేహదార్ఢ్యం గల ప్రతి వయోజన వ్యక్తి నుంచీ నెలకు కనీసం ఒక రోజు ఉచితంగా కాయ కష్టం కానీ లేదా దానికి బదులు రొక్కం విరాళం కానీ పొందడం ఈ పథకం క్రింద జరుగుతుంది. సాముదాయిక సంపదలను పెంపొందించడానికి అధికాహారోత్పత్తి ఉద్యమాన్ని తీవ్రతరం చేయడానికీ గ్రామీణ ప్రాంతాలలో లభ్యమయ్యే శ్రామిక శక్తిని వినియోగించడానికి వీలుగా గ్రామ స్థాయిలో ఈ బ్యాంకు దేశ వ్యాప్తంగా యంత్రాంగాన్ని స్థాపించగలుగుతుంది. ఇప్పటివరకు రక్షణ శ్రామిక బ్యాంకుకు 562 లక్షల మేరకు పని రోజులను విరాళంగా ప్రకటించారు వీటిలో 46 లక్షల పని రోజులను వినియోగించుకోవడం జరిగింది. రొక్కం విరాళాల క్రింద రూ॥ 7.78 లక్షల మొత్తం లభించింది

రక్షణ శ్రామిక బ్యాంకు స్వచ్ఛంద విరాళాలపై ఆధారపడి పనిచేస్తుందనీ, ఇది సమాజంలోని బలహీన వర్గాలను స్వార్థ ప్రయోజనాలకు వినియోగించుకోదనీ గ్రామ ప్రజలందరికీ తెలియపరచాలి. రక్షణ శ్రామిక బ్యాంకు పథకం క్రింద చేపట్టబడే పనులు, ఏ ఒక్కరిద్దరికోగాక సమాజం మొత్తానికీ ఉపకరించేవిగా వుంటాయనే విషయాన్ని కూడా తెలియజెప్పాలి.

## రాజకీయ ప్రజాస్వామ్యానికి ప్రాతిపదికగా గ్రామ సభ

గ్రామ స్థాయిలో గ్రామంలోని వయోజన వ్యక్తులందరూ పంచాయతీ చర్చలలో పాల్గొనడంతో పాటుగా వివిధ కార్యక్రమాల అమలులో కార్య నిర్వాహక సంస్థ అయిన గ్రామ పంచాయతీతో పాటు పాల్గొనడానికి వీలుగా అలాంటి ప్రజాస్వామిక వ్యవస్థను స్థాపించడాన్ని పంచాయతీ రాజ్ లక్షిస్తున్నది. గ్రామ పంచాయతీల పటిష్ఠత దాని వ్యవహారాలలో, కార్యకలాపాలలో గ్రామ ప్రజలు శ్రద్ధాసక్తులు తీసుకోవడంపై ఈ విషయాలలో వారు నేర్పు ప్రదర్శించడంపై వారు సహకరించడంపై ఆధారపడి వుంటుంది. గ్రామీణుల అభీష్టానికి నిర్దిష్టమైన స్వరూపాన్నిచ్చే కార్య నిర్వాహక సంస్థగా మాత్రమే పంచాయతీ వ్యవహరించాలి. కాగా గ్రామీణులకు గ్రామ సభ ప్రాతినిధ్యం వహిస్తుంది. గ్రామ వ్యవహారాల నిర్వహణలో ప్రతి గ్రామస్థునికీ ప్రాముఖ్యత కల్పించడం ద్వారా ఇది అతను తన రాజకీయమైన సాంఘికమైన బాధ్యతలను గుర్తించేట్లు చేస్తుంది. పంచాయతీ వ్యవహారాలలో ప్రజలు పాల్గొనడాన్ని ఇది ప్రోత్సహించడమే గాకుండా, స్వార్థపరుల ఆటలు కట్టించడానికి కూడా తోడ్పడుతుంది. అంతేగాక పంచాయతీ, సర్‌పంచ్‌ల బాధ్యతా నిర్వహణను సంస్థాగతం కూడా చేస్తుంది. గ్రామస్థులలో రాజకీయ, సాంఘిక పరిజ్ఞానం కలిగిస్తుంది.

అస్సాం, బీహారు, మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్, గుజరాత్, జమ్మూ – కాశ్మీర్ ఒరిస్సా, పంజాబు, ఉత్తర ప్రదేశ్, పశ్చిమ బెంగాలు, ఢిల్లీ, హిమాచల్‌ప్రదేశ్‌లలో గ్రామసభకు చట్టబద్ధమైన పరిగణన వుంది. మైసూరు, రాజస్థాన్‌లలో గ్రామంలోని అందరు వయోజనులతో సమావేశం జరిపి అందులో గత సంవత్సరపు పరిపాలనా నివేదికను, ఆదాయవ్యయాల వివరాలను ఆ సంవత్సరంలో అమలు పరచదలచిన కార్యక్రమాలను వెల్లడిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లో గ్రామసభల స్థాపనకు ఉద్దేశించిన కొత్త పంచాయతీ బిల్లు శాసనసభముందు వుంది. మద్రాసు, కేరళ రాష్ట్రాలలో గ్రామ సభకు చట్టబద్ధమైన పరిగణనలేదు.

## సాంఘిక ప్రజాస్వామ్యానికి మూలాధారంగా ఆర్థిక ప్రజాస్వామ్యం

గ్రామీణ జీవితంలో సాంఘిక, పౌర,

ఆర్థిక రంగాలలో ప్రగతిని సాధించడం పంచాయతీరాజ్ సంస్థల కర్తవ్యం. ఆర్థికాభివృద్ధిని సాధించడంలో, నిర్దిష్టమైన ఆర్థిక ప్రయోజనాలతో నెలకొల్పబడే ప్రజాస్వామిక సంస్థలు పంచాయతీలకు చేయూతనివ్వాలి. ఇలాంటి సంస్థలు సహకార పద్ధతిలో వుండాలి. ఎందుచేతనంటే సహకార విధానం–అందరికీ సభ్యత్వాన్ని లభింపజేయడం, ప్రతివ్యక్తికీ ఒకఓటు హక్కును సంక్రమింపజేయ్యడం అనే తనసూత్రాలవల్ల కార్యాచరణలో వాస్తవంగా ఆర్థిక ప్రజాస్వామ్యంవంటిది. పంచాయతీరాజ్ సంస్థల వలె సహకార సంఘాలుకూడా స్థానిక నాయకత్వాన్ని పెంపొందించే కేంద్రాలుగా ఉపకరిస్తాయి. ఆర్థిక, సామాజికవ్యయాన్ని కలుగజేయడానికి భారతదేశంలో మిశ్రమ ఆర్థిక విధానం అవలంబించ బడుతున్నది. పరిమితిలేని ప్రైవేటు యాజమాన్యవిధానం వల్ల అధికారం కొందరిచేతుల్లో మాత్రమే కేంద్రీకృతమై వుంటుంది. పోతే పబ్లిక్ రంగాన్ని నిరంతరం విస్తృతీకరించడంవల్ల కూడా రెజిమెంటేషనుకు దారితీయవచ్చు. అందుచేత ప్రైవేటు, పబ్లిక్ రంగాలవల్ల కలిగే లోటుపాట్లను నివారించడానికి భారీ సహకార రంగం అవసరం.

మొదటి రెండు పంచవర్ష ప్రణాళికా కాలాలలో సహకార సంఘాల సంఖ్య 1,81,000 నుంచి 3,32,000 కు పెరిగింది. వీటిసభ్యత్వం 14 మిలియన్ల నుంచి 35మిలియన్లకు హెచ్చింది. ఈ విధంగా ఈ పురోగతి గమనార్హమైనదిగా వుంది. అయితే ఇది దేశంలోని వివిధ ప్రాంతాలలో ఒకే స్థాయిలో లేదు.

శిబిర ప్రతినిధులు పైన పేర్కొన్న మూడు విషయాలను సమగ్రంగా చర్చించారు. గ్రామీణ స్వచ్ఛంద సేవక దళంలో చేరడంలో స్త్రీలు, పురుషులు ప్రథమంలో అమితమైక ఉత్సాహం కనబరిచినట్లు ప్రతినిధులు అభిప్రాయపడ్డారు. 4.8 లక్షల మంది స్త్రీలతో సహా మొత్తం 1.66 కోట్ల మంది ప్రథమంలో ఈ దళంలో చేరడం జరిగింది. గ్రామీణ స్వచ్ఛంద సేవకదళం కార్యక్రమాలను సమర్థంగా అమలు పరచడంలో యువజన క్లబ్బులు, మహిళామండలులు ప్రముఖపాత్ర వహించినట్లు కొందరు ప్రతినిధులు తెలిపారు. రక్షణ శ్రామిక బ్యాంకు ద్వారా అమలుపరిచే పనులు, మొత్తం సమాజానికి ప్రయోజనం చేకూర్చేవిగా వుండాలనే విషయాన్ని ప్రతినిధులు నొక్కి చెప్పారు. గ్రామాలలో మనుష్య శక్తిని చక్కగా వినియోగించుకోవడానికి రక్షణ శ్రామిక బ్యాంకుకుగల శక్తి స్థోమతల విషయమై వారు చర్చించారు. గ్రామ ప్రాంతాలలో ఉద్యోగావకాశాలను పెంపొందించడానికై గ్రామీణాభివృద్ధి కార్యక్రమం రక్షణ శ్రామిక బ్యాంకులను ఒకదాని కొకటి కలపడానికిగల అవకాశాలను కూడా వారు పరిశీలించారు.

ప్రజాస్వామిక వ్యవస్థలో గ్రామ సభల పాత్రపై చర్చలు ఆసక్తికరంగా జరిగాయి. కార్యక్రమాల అమలులో కార్య నిర్వాహక సంస్థతోపాటు ప్రజలు పాల్గొనేట్టి ప్రజాస్వామిక వ్యవస్థలో గ్రామ సభలు వుండటం తప్పనిసరి అనే అభిప్రాయాన్ని సాధారణంగా ప్రతినిధులంతా అంగీకరించారు. ఎందుచేతనంటే దీనివల్ల గ్రామస్థాయిలో ప్రజలకు కేవలం చర్చలలోనే గాకుండా, కార్యక్రమాలను రూపొందించడంలో, వాటిని అమలుపరచడంలో కూడా కార్యనిర్వాహక సంస్థతో అంటే గ్రామ పంచాయతీతో కలిసి పనిచేయడానికి అవకాశం కలుగుతుంది. నిజమైన ప్రజాస్వామిక వ్యవస్థకు గ్రామసభ పటిష్ఠమైన పునాదివంటి దని ప్రతినిధులు అభిప్రాయపడ్డారు.

సాంఘిక ప్రజాస్వామ్యాన్ని సాధించడంలో సహకార విధానానికి గల పాత్రపై చాలా మంది ప్రతినిధులు ప్రసంగించారు. ప్రజలు ఆర్థికంగా పటిష్ఠంగా వున్నప్పుడు మాత్రమే కులతత్వం, ప్రాంతీయతత్వం వంటి దోషాలను నిర్మూలించడానికి సాధ్యమవుతుందనీ, అందుచేత గ్రామీణ ప్రాంతాలలో ప్రజలకు అత్యంతావశ్యకమైన ఆర్థిక సహాయం కల్పించడానికి సహకార రంగాన్ని అభివృద్ధిపరచడం అవసరమనీ ప్రతినిధులు తమ అభిప్రాయాలను వెల్లడించారు.

కేంద్ర ఉపమంత్రులు శ్రీ బి. ఎస్. మూర్తి, శ్రీ ఎస్. డి. మిశ్రా, ప్రణాళికా పంచాయతీ రాజ్ శాఖా మంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, అడిషనల్ డెవలప్మెంటు కమీషనరు శ్రీ సి. నరసింహం, ఇంకా ఇతర ప్రతినిధులు ఈ మూడు రోజులలోను చర్చలలో పాల్గొన్నారు.

శిబిరాన్ని ముగింపజేస్తూ కేంద్ర సమాజాభివృద్ధి, సహకారశాఖలమంత్రి, ఆర్థిక ప్రజాస్వామ్యం లేనిదే సాంఘిక ప్రజాస్వామ్యాన్ని స్థాపించడం దుస్సాధ్యమని అన్నారు. సహకారరంగంలో వికేంద్రీకరణ, కేంద్రీకరణ విధానాలు నేత మాదిరిగా పరస్పర సంబంధంతో అవలంబింపబడాలనీ, తద్వారా ప్రజాస్వామ్యానికి లోపాలను కనుగొని వాటిని సరిదిద్దుకోవడమనే పద్ధతిని ప్రాతిపదికగా రూపొందించాలనీ ఆయన కోరారు.

ప్రతినిధులను జంటనగరాలలోని దర్శనీయమైన స్థలాలకు తీసుకొని వెళ్ళి చూపించారు. కొంతమంది ప్రతినిధులు రాజేంద్రనగర్ శిక్షణ కేంద్రాన్ని సందర్శించారు.



# తెలుగు వెలుగులు

తెలుగులు వెలసిన నేలలురా - ఇవి
వెలుగులు విరిసిన భూములురా !
దేశ దేశముల వాసి కెక్కిన
ధీమంతులు గల భూములురా ! ॥తె॥

నింగిని తాకే కొండలురా !
ఘన మగు నిధులకు అండలురా !
జల జల పారే జలములురా !
జీవనదులు గల నేలలురా !
కాకులు దూరని అడవులురా !
వన్యమృగాలకు నెలవులురా !
ప్రకృతిసంపదకు, ప్రకృతిశోభలకు
ప్రసిద్ధి చెందిన భూములురా ! - ఇవి
కన్నుల విందగు నేలలురా ! - ॥తె॥

పచ్చని పచ్చిక బీడులురా !
పశుసంపద గల వాడలురా !
బలములు నిండిన పొలములురా !
బంగరు పండెడు స్థలములురా !
ఇంపగు పూవుల తోటలురా !
సొంపగు ఫలముల పేటలురా !
పాడిపంటలకు, పూలు ఫలాలకు
ఆటపట్టు లగు భూములురా ! - ఇవి
సిరిసంపదలకు నెలవులురా ! - ॥తె॥

పల్లనాటి ఘనభూములురా ! - ఇవి
పౌరుషాలు గల నేలలురా !
బాలచంద్రుని కదనకౌశలం
నాయకి నాగమ రణప్రతాపం
కన్నమదాసుని ఖడ్గవిక్రమం
బ్రహ్మనాయని సధర్మసమరం
ఘనీభవించిన వీరరసం బగు
తెలుంగుజాతికి జ్యోతులురా ! - ఇవి
తెలుంగుగడ్డకె శోభలురా ! - ॥తె॥

బొబ్బిలివీరుల కోటలురా ! - ఇవి
తెలుగుపౌరుషపు ఊటలురా !
పాపారాయని చండవిక్రమం
రంగారాయని రణనైపుణ్యం
వెంగళరాయని ఖడ్గపటుత్వం
మల్లమదేవి ఘనవీరత్వం
జడముల కైనను జీవంపోసే
మరపుకు రాని బోధలురా ! - ఇవి
తెలుంగువీరుల గాథలురా ! - ॥తె॥

మన్యంవీరుల భూములురా ! — ఇవి
స్వేచ్ఛకు పోరిన నేలలురా !
రామరాజు ఘనవీరచరిత్రం !
కోయశ్రామికుల సమరవ్యూహం !
కని విని యెరుగని అపూర్వత్యాగం !
కాలువలై ప్రవహించిన రుధిరం !
పరపాలకులను హడ లెత్తించిన
మరపురాని ఘన గాథలురా ! - ఇవి
స్వతంత్రవీరుల బోధలురా ! - ॥తె॥

ఇంపగు హంపీ శిథిలాలూ
సొంపగు ఎల్లోరా గుహాలూ -
నాగార్జున నగశిల్పాలూ
అమరావతిపుర స్థూపాలూ
శిలలను కరగీ పోతలుపోసిన
తెలుంగుశిల్పుల ఘనతలురా ! - ఇవి
తెలుంగుభూముల వెలుగులురా ! - ॥తె॥

గండపెండెరము లందిన కవులూ
నవరసాలు చిందించెడు కథలూ
మధుర మధురమౌ మధుకావ్యాలూ
కవుల పోషకుల ఘనరాజ్యాలూ
యశోగానములు, కీర్తిచంద్రికలు
కొల్లగ వెలిసిన పురములురా ! - ఇవి
వాణికి అంతఃపురములురా - ॥తె॥

మరలను నడిపే కార్మికులూ
పొలాలు దున్నే కర్షకులూ
నవనవలాడే యువజనులూ
కళకళలాడే బాలకులూ
తెలుంగుప్రగతికి పునాదిరాళ్ళగు
తెలుగు తల్లి మణిపూసలురా ! -మన
తెలుగుజాతి వెన్నెముకలురా ! - ॥తె॥

'సమతారావు'

మన దేశానికి జనాభా పెరుగుదలవల్ల పెద్దయిబ్బంది రాబోతోందని ప్రభుత్వం గుర్తించింది దేశాన్ని యీ యిబ్బంది నుంచి తప్పించాలంటే ప్రభుత్వంచేసే కృషి ఒక్కటేచాలదు. ప్రజలుకూడా ముందుకు రావాలి. సహకరించాలి. కాని సామాన్య మానవుడు యీ మహోపద్రవాన్ని గుర్తించడంలేదు తన యిల్లూ, తన సంసారం, తన భార్యాబిడ్డలను గురించే యోచించుకుంటాడుగాని, బయటి ప్రపంచాన్ని గురించి యోచించడంలేదు. దేశంపై దురాక్రమణ జరిగితే సామాన్య ప్రజానీకంలో వెల్లివిరిసిన చైతన్యం అపూర్వం. అయితే రానున్న జనాభాపెరుగుదల ఉపద్రవాన్నుండి మన దేశాన్ని రక్షించుకోవాలంటే, యీ నాడు దేశరక్షణకై విరిసిన చైతన్యంకన్న మరింత చైతన్యంరావాలి. కనుక దేశసౌభాగ్యం, సుఖశాంతులు సామాన్య ప్రజానీకం గుర్తింపుపై ఆధారపడివున్నాయి. నానాటికీ దేశంలో పెరిగిపోతున్న జనాభా – తత్ఫలితంగా ఉత్పన్నమయ్యే సమస్యల్ని ప్రతి పౌరుడూ గుర్తించాలి. అది గుర్తెరగక పోతే మహోపద్రవం తప్పదు.

ఒకప్పుడు సంతానంలేని యిల్లాలు సంఘీయులచే గొడ్రాల పించుకోవలసిన స్థితికి ఎంతగానో దురపిల్లేది. అలాంటి యిల్లాళ్ళు యీనాటికీ ఒక నడిరూమునలేచి ఎముకలు కొరికే చలిలో కాలవల్లో స్నానాలాచరించి, చెట్లకూ పుట్టకూ పూజలుచేసి సంతానప్రాప్తి కొరకు పడరానిపాట్లు పడటంచూస్తూనే వున్నాం. ఒకప్పుడు 'సంతానంచాలు' అని నోటితోవెల్లడిస్తే పెద్దలు చీవాట్లుపెడతారని భయపడేవారు. కాని 'పెద్దలనడానికేంలే, సంతానం సరిపెట్టుకుంటాం' అని యీనాడు కొంతమంది ముందుకొస్తున్నారు.

కాని అందరం కళ్ళు తెరవవలసిన తరుణం ఆసన్నమైంది. కనుకనే ప్రభుత్వం కుటుంబ నియంత్రణను ప్రవేశపెట్టింది. ప్రజలు కుటుంబ నియంత్రణను పాటించేందుకు ఎన్నో సౌకర్యాలను కల్పిస్తోంది. విరివిగా కుటుంబ నియంత్రణావశ్యకతను గూర్చి ప్రచారంచేయ సంకల్పించింది. అలా ప్రభుత్వమే పూనుకొని చేయవలసిన అగత్యమే మొచ్చిందో? అలా ప్రభుత్వాన్ని మేల్కొల్పిన పరిస్థితు లేమిటో మన మందరం మననం చేసుకోవాలి. మన కర్తవ్యాన్ని గుర్తించి, ప్రభుత్వ పూనికను ఫలప్రదం చేయవలసిన బాధ్యత గైకొనాలి.



"పొట్లూరి"

శతాబ్దంన్నర క్రితమే మాల్థస్ అనే ఆర్థిక శాస్త్రవేత్త ఉత్పత్తి పెరుగుదలకు ఎన్నోరెట్లుగాజనాభా పెరుగుదలవుందనీ,సంక్షోభం తప్పదని హెచ్చరించాడు. ఆయన హెచ్చరించినట్లే యీ నాడు ప్రపంచ జనాభాలో దాదాపు సగంమంది సరైన పోషణలేని స్థితిగతుల్లో వున్నారు. అసలు ఏదేశంలోనైనా జనాభా పెరుగుదల – ఆ దేశంలోని జనన మరణాల లెక్కలననుసరించి పరిగణించడం జరుగుతుంది. ఇక జనాభా పెరుగుదల నరికట్టే సాధారణమైన మార్గాలేవంటే, కరువులు, యుద్ధాలు, మరణాలు.

జనాభా పెరుగుదల సాధారణమైన విషయం. కాని గత 30ఏండ్లలో విపరీతంగా పెరిగింది. వైద్యరంగంలో జరిగిన అభివృద్ధియే ప్రధాన కారణం. 'యాంటీ బయాటిక్సు' కనిపెట్టడంవల్ల ఎన్నో రకాల వ్యాధుల్ని అరికట్టడం జరిగింది. అలాగే ఆరోగ్య శాఖ వారు తీసుకొనే మరికొన్ని యితర చర్యలు కారణంగా మరణించే వారిసంఖ్య తగ్గించడం జరిగింది.

ఇక జనన లెక్కల్ని పరిశీలిస్తే ప్రపంచంలో ప్రథమస్థానం చైనా, ద్వితీయస్థానం భారతదేశమూ వస్తాయి. ప్రపంచంలో ప్రతి నిమిషానికి 200 మందిపిల్లలు జన్మిస్తున్నారు అందులో చైనాలో 50 మంది, భారతదేశంలో 34 గురున్నూ. ఈ దృష్ట్యా చూస్తే మనదేశంలో సంతానోత్పత్తిని గురించి భయపడినంతగా అణుశక్తిని గురించికూడా భయపడనక్కరలేదు. మన దేశంలో ప్రతి వెయ్యి జనాభాకూ 46 గురు జన్మిస్తోంటే మరణితుల సంఖ్యలో మార్పు వచ్చింది. యిదివరకు వెయ్యిమందికి 44 గురు మరణిస్తే యిప్పుడు 27 గురే మరణించడం జరుగుతోంది. వచ్చే అయిదేండ్లలో యీ సంఖ్య 21 కు తగ్గిపోతుంది. యీ విధంగా జన్మించేవారిసంఖ్య పెరుగుతూ మరణితుల సంఖ్య తగ్గడంద్వారా, జనాభాసంఖ్య విషమ పరిస్థితికి దారితీస్తోంది. జనన మరణాల సంఖ్య ఒకటికన్నా ఎక్కువయినట్లయితే

అది దేశంయొక్క ఆర్థికస్థితిలో ఎంతో మార్పు గొనివస్తుంది. ప్రస్తుతం మన దేశ జనాభాలో వృద్ధి ఒకటికి మించడమేకాదు. 2-1 వరకూ వున్నది. జనాభా పెరుగుదల సృష్టించే సమస్యలు సామాన్యులకు తెలియవు. అవి వారికే ముఖ్యంగా తెలియాలి. సామాన్యుడు తన కుటుంబంలో తన ఆర్థిక స్థితికి మించిన పిల్లలు వుండేపక్షంలో అతడు పడే అవస్థలు వర్ణనాతీతం. పిల్లలకు తిండి సౌకర్యం, బట్టసౌకర్యం, విద్య, ఆరోగ్యం, నివాసవసతి — యివన్నీ చూచుకోవాలి. పెరిగేవారికి పెళ్ళిళ్ళు చేయాలి. ఉపాధికి మార్గం చూపాలి. అలాంటి సౌకర్యాలన్నీ కల్గించాలంటే తనకు అందుబాటులో మరెన్నో సదుపాయాలుండాలి. ఇలా ఒక్కకుటుంబంవిషయంలోనే సామాన్యుడు ఎన్నో యిక్కట్లకు గురి అవుతున్నాడే! అన్ని కుటుంబాల విషయమూ ఆలోచించి అందరికీ అన్ని సదుపాయాలూ కల్గించ వలసిన ప్రభుత్వం ఎంత కష్టపడాలో ఆలోచించాలిగదా. ఒకవ్యక్తి తన కుటుంబ విషయాలన్నీ తనొక్కడే చూసుకోవలసివస్తే చిరాకు పడిపోతాడు. "సంసారం మహా నరకం. ! ఏనాడో పాపం చేసుకునివుంటే యిలాంటి సంసారంలో పడ్డామో" అని దురపిల్లే సన్నివేశాలు, సందర్భాలూ కొల్లలు. తన కుటుంబ సభ్యులు యజమానికి సహకరిస్తే ఆ కుటుంబ సమస్యల పరిష్కారం యజమానికి కొంత తేలికనిపిస్తుంది. అలాగే కుటుంబాలన్నీ కలసి ఏర్పాటు చేసుకున్న తమ యజమాని అయిన ప్రభుత్వానికి పరిష్కారం కావలసిన సమస్య తేలిక పరచాలంటే కుటుంబాలన్నీ సహకరించవలసి వుంటుంది. లేనట్లయితే కొత్తగా విడుదలయ్యే చిత్రానికి సినిమాహాలులో తొలి రోజున తొలిఆటకు వెళ్ళి చూచేటప్పుడు చోటుదొరక గాని, లేక ఊపిరాడక చెమట పట్టి జనాభాతొక్కిడిలో కూర్చొని చిత్రం చూడటంలో పడేఅవస్థ కొన్నిలక్షలరెట్లు మెరుగనిపిస్తుంది - జనాభా పెరుగుదలవల్ల ఉత్పన్నమయ్యే స్థితికన్నా.

సామాన్య ప్రజానీకం యొక్క పరిస్థితుల్ని మెరుగుపరచాలని కోటాను కోట్లు డబ్బువెచ్చించి ఎన్నో ప్రయత్నాలు సాగిస్తోంది ప్రభుత్వం. కాని సామాన్య మానవుడు లవలేశంగానైనా సౌకర్యం పొందగల్గాలని తృప్తి పడలేక పోతున్నాడు. ప్రభుత్వం ఖర్చు పెట్టేదంతా వృధా అయిపోతోందనే భావన కూడా పడుతున్నాడు. కాని కోటాను కోట్లు డబ్బు అలా అవిరై పోతోందనిపించడానికి అసలు కారణ మేమిటో యోచించుదాం.

20 వ శతబ్దారంభంలో మనదేశ జనాభా 23 కోట్లు. అది 1930 నాటికి 4 కోట్లు పెరిగింది కానిఅతరువాత30సంవత్సరాలలో అంటే 1960 నాటికి మరో 16 కోట్లు పెరిగింది. యీపెరుగుదల యిలాగే కొనసాగితే 1975 నాటికి జనాభా రెట్టింపవుతుంది. ముంచుకొస్తున్న యీ మహోపద్రవాన్ని భారత ప్రభుత్వం గుర్తెరిగింది. ఈ సంక్షోభం వల్లనే - అధికాహారోత్పత్తికీ పారిశ్రామికాభివృద్ధికీ, సామాన్యుని జీవిత ప్రమాణాన్ని మెరుగు పరచ డానికి పంచవర్ష ప్రణాళికల ద్వారా ఎంత కృషి చేసినప్పటికీ, ఆశించిన ఫలితాలు కన్పించడంలేదు. ఎంత తీవ్రంగా అత్యున్నత స్థాయిలో కృషి చేస్తున్నప్పటికీ, జీవన ప్రమాణ స్థాయిలో పెరుగుదల కనిపించనీయని స్థాయిలో సాగుతోందన్న మాట జనాభా పెరుగుదల.

ఈ ప్రమాదాన్ని ప్రభుత్వం స్పష్టంగా గుర్తించింది. అందుచేతనే మొదటి పంచవర్ష ప్రణాళికలో కుటుంబనియంత్రణ పద్ధతిక్రింద ఖర్చుపెట్టింది 65 లక్షలయితే యీ మూడో పంచవర్ష ప్రణాళికా కాలంలో 25 కోట్లు. అంతేకాదు అవసరమైతే మరో 25 కోట్లు ఖర్చు పెట్టేటందుకుకూడ సిద్ధపడుతోంది. 1959 లో ఢిల్లీలో జరిగిన గణాంక శాస్త్రవేత్తల సమావేశంలో ఒకరు మనదేశ జనాభాను గురించి గట్టిగా అరికట్టవలసిన అవసరాన్ని గురించి హెచ్చరించారు. యీ జనాభా పెరుగుదలను వచ్చే 20 సంవత్సరాలలో అది, ఎన్ని యితర దేశాలు ఎంత సహాయంచేసినా, మన దేశానికి ముక్తి కలకగ, మహాసంక్షోభంలో పడిపోవడం తథ్యమంటూ భయపెట్టడంకూడా జరిగింది. నిజంగా అలాంటి దుస్థితి ఏర్పడకుండా వుండాలంటే ప్రభుత్వంచేసే ప్రస్తుత కృషి సరిపోదేమో ననిపిస్తోంది. యీ నాడు చైనా దురాక్రమణ నెదుర్కొనడానికి చైతన్యవంతమై, మాతృభూమి రక్షణకై ప్రతి భారతీయుడు ఎలా ఉవ్విళ్ళూరుతున్నాడో అంతకన్న ఎక్కువగా జనాభా పెరుగుదలవల్ల రానున్న సంక్షోభాన్నెదుర్కొనేందుకు ప్రతిఒక్కడూ సమాయత్తం కావాలి. లేనట్లయితే జనాభా పెరుగుదల సంక్షోభాన్నెదుర్కొనలేక సామ్రాజ్య విస్తరణ కాంక్షతో మనదేశంపై దురాక్రమణ చేసిన చైనా మాదిరిగానే యిరుగు పొరుగుదేశాన్ని కబళించ వలసిన పరిస్థితు లేర్పడతాయి.

జనాభా బరువుభారాలన్నీ ప్రభుత్వానివి అధికోత్పత్తికి ఎంత కృషిచేసినా అవి జనాభాపెరుగుతున్న రీతికి సాటిరాదు. పంట పండే భూమిలో ఎన్ని ఎరువులువేసినా యిరవై బస్తాలు పండేవి పాతికబస్తాలు పండవచ్చు. కాని రెట్టింపు పంటపండదు. కాని జనాభాచూస్తే రెట్లకు రెట్లు పెరిగిపోతున్నారు. ఒక ఉమ్మడి కుటుంబంలో జనాభా

తల్లిదండ్రులు..పిల్లలు..మనుమలు, మనుమరాండ్రు...యిలా ఎంతగానో పెరిగిపోతూ వుంటుంది. కాని వారి ఆస్థిపాస్తులు మాత్రం పెరిగేఅవకాశం లేదు. సరికదా క్రమేణా తగ్గిపోతూవుంటుంది ఒక్క విషయం పరిశీలిస్తే తెలిసిపోతుంది; భారతదేశం జనాభా కోట్లకొలదీ పెరిగిపోతూ వుంటే దాని విస్తీర్ణం యథాప్రకారంగా వున్నది. పెరుగుతున్న జనాభాకు మనం పండించే భూముల్లో పంటచాలదు. పంటపండే భూములు మరెన్నోకావాలి. కనుకనే ప్రక్కవారి పొలాలు కల్పుకోవాలనే తాపత్రయానికి తలొగ్గకతప్పదు. యిదే యీనాడు చైనా భారతదేశంపై దురాక్రమణ చేయడంలో దాగిన పరమసత్యం కనుక అలాంటి మహోపద్రవం మనకు, మనవలన యితరులకు కలగకుండా అవసరమైన నివారణచర్యలను తక్షణమే అన్వేషించాలి అందుకొక్కటేమార్గం జనాభా పెరుగుదల నరికట్టడమే తరుణోపాయం. అయితే ఎలా ? అందుకు మనకు రెండే రెండు మార్గాలున్నాయి. 1 మరణించేవారి సంఖ్య ఎక్కువచేయడం లేదా 2 జనన సంఖ్యలో తగ్గుదలవచ్చేటట్లు చూడడం. యీ రెంటిలో మనకేది ఆచరణసాధ్యమో చూద్దాం నాగరికతా ప్రపంచలో అనారోగ్యంపై ఆధునిక వైద్య సౌకర్యాలను యితోధికం చేసుకుంటూ పోరాటంజరుపుతూవున్న మనం, సాటిప్రజ రోగాలతో, రొప్పులతో, క్షామంతో మరణించడాన్ని అంగీకరించలేము. కనుక మొదటిమార్గం మనం అవలంబించలేము. ఇక మిగినమార్గం జనాభాను పరిమితం చేయడం ఒక్కటే. అయితే జనాభాలో ఎవరిని పరిమితం చేయాలి. యీ ప్రశ్నకు దొరికే సమాధానమే చాలా ముఖ్యమైనది. జనాభా వారి వారి ఆర్థిక స్థితిగతులనుబట్టి మూడురకాలుగా విభజించవచ్చు. 1. ధనికులు, 2 మధ్యతరగతివారు, 3. పేదలు.

జనాభాలో ధనికులుచాలా తక్కువ శాతంలో వున్నారు. ఆ తక్కువ శాతంలోని కొందరికి అసలే పిల్లలు లేకపోవడంకూడా కద్దు. మిగతావారికి సంతానం ఎక్కువవున్నా వాళ్ళ ఆర్థికస్తోమతుకేమీ భంగం లేదుగనుక వాళ్ళు కుటుంబ నియంత్రణను అమలు పరచేందుకు ముందుకు రాకపోవచ్చు అయినా వారిసంఖ్య అమలు పరచవలసిన వారి సంఖ్యతో పోలిస్తే అసలు గణనకేరాదు

మధ్య తరగతివారిలో ఆర్జించే దొకరైతే అనుభవించేది పదిమంది ఆర్థికస్థితి చితికిపోయినా అనాదిగా వస్తున్న ఆచారాలను చితికిపోనివ్వకూడదనేమనస్తత్వంకలవారు, సంసారాలు పెరిగిపోయి జరుగుబాటుకే కష్టపడుతున్నా అదివరకు వున్న హోదా, 'పరువు ప్రతిష్టలు' గౌరవమర్యాదలు, అందర్నీ కష్టపడి పనిచేసుకోనీయకుండా అడ్డుపడుతున్నాయి. అందువల్ల మధ్య తరగతివారిపని త్రిశంకుస్వర్గంలో వున్నట్లు తయారైంది అయితే యిప్పుడిప్పుడే, తమ జీవన ప్రమాణం చితికిపోకుండా వుండే మార్గం ఏమిటా అని యోచించి కుటుంబాన్ని పరిమితం చేసుకోడానికి ముందు కొస్తున్నారు. నేడు కుటుంబ నియంత్రణ అమలుజరిగేదిఎక్కువమధ్యతరగతివారిలోనే. దేశశ్రేయస్సు, సమాజ శ్రేయస్సులనాలోచించి కాకపోయినా కనీసం తమవ్యక్తిగత శ్రేయస్సును పురస్కరించుకొనే, సంతాన నిరోధానికి పూనుకుంటున్నారు. కారణం ఏదైనా చేరేగమ్యం ఒకటే గనుక సూక్ష్మంలో మోక్షం సాధిస్తున్నారు పోతే జనాభాలో అత్యధిక సంఖ్యాకులైన ప్రజలు పేదవారు.

రానున్న మహోపద్రవాన్నుండి దేశాన్ని రక్షించవలసింది పేదలే. పేదల కుటుంబాలలో పిల్లల దగ్గరనుంచి వృద్ధాప్యం ముంచుకొచ్చిన ముదుసలుల వరకూ, కాయకష్టం చేసి, కుటుంబాన్ని పోషించు కుంటారు. సంసారం ఎంత పెద్దదైతే, తమ కుటుంబానికంత ఆదాయం ఎక్కువని వాళ్ళ విశ్వాసం. పిల్లలే వారికి ఆస్తిగా పరిగణిస్తుంటారు. జరుగుబాటులోతృప్తి పడుతుంటారు. అంతేగాని తమ జీవన ప్రమాణస్థాయిలో పెరుగుదల ఆలోచన వాళ్ళ కక్కర్లేదు. సామాన్యులు శ్రీమంతులు కావాలని అందుకు కుటుంబాన్ని పరిమితం చేసుకో వలసిందని సలహా యిచ్చినా, తమ ఆదాయం తగ్గిపోతుందని ఆ సలహాను నిరాకరిస్తున్నారు. వాళ్ళ ఆలోచనలంత వరకే కాని ఆలోచించగల మనం వాళ్ళ భావాల నలాగే కొనసాగనిస్తే వర్గతారతమ్యాలు, వర్గ వైషమ్యాలిలాగే నిలచివుంటాయి. కనుక కలకాలం 'యింతకన్న మాకేంకావాలి?'అని భీష్మించుక్కూర్చునేవాళ్ళ భావాల్ని మార్పు చేయాలి వాళ్ళ జీవన ప్రమాణ స్థాయిలో పెరుగుదల తీసుకురావాలి. గంపెడు సంసారాలతోకాలం గడపాలనేవారి మనస్తత్వంలో మార్పు తేవాలి. అందుకు వారిని 'విద్యావంతుల్ని' చేయాలి తద్వారా కంటకావృతమైన సమస్యగా రూపొందుతున్న జనాభా పెరుగుదల నివారణకు వారంతటవారే పూనుకొనేటట్లు చేయవలసివుంది. కాబట్టే, నిర్బంధ విద్యా విధానాన్ని మన ప్రభుత్వం అమలు పరుస్తున్నది. భారీఎత్తున ప్రచారంకూడా సాగించడం జరుగుతున్నది. కుటుంబనియంత్రణ కథావస్తువుగా తీసే చలన చిత్రాలను నిర్మించే నిర్మాతలకు 20,000 లు. దర్శకునకు 5,000 ల రూపాయల నగదు బహూక

రించి ప్రోత్సహించాలని నిర్ణయించిన కేంద్ర ప్రభుత్వమును అభినందించాలి. జనాభా పెరుగుదలను అరికట్టడానికి ఒక్క సంతాననిరోధంవినా మరోమార్గం లేదు.

సంప్రయోగ సమయంలో పురుషుని వీర్యంలోని జీవకణాలలోని ఏ వొక్కటి స్త్రీ గర్భకోశంలో వెలువడే గ్రుడ్డుతో ఐక్యంచెందినా గర్భంవస్తుంది. కనుక గర్భం రాకుండా వుండుటకు వీర్యంలోని జీవకణాలు గర్భకోశంలో గ్రుడ్డుతో కలియకుండా వుండేట్లుచేస్తే సరిపోతుంది. అలా విరోధించ గలగడానికి పురుషులు స్త్రీలు రబ్బరు సాధనాలను వినియోగించవచ్చు. ఆయా సాధనాల వివరాలు కేంద్ర ప్రభుత్వం ప్రచురించిన ఫామిలీప్లానింగు అన్న పుస్తకంలోవున్నాయి. లేదా ఏ డాక్టరునడిగినా చెపుతారు. ఆ సాధనాలు ఖరీదుకు ప్రతి మెడికల్ స్టోర్సులోనూ లభ్యమౌతాయి.

స్త్రీ పురుషులలో ఎవరో ఒకరు ఆపరేషన్ చేయించుకోవడమే నమ్మకమైన విధానం. సంప్రయోగ సమయంలో పురుష వీర్యంలోని జీవకణాలు స్త్రీ గర్భాశయం లోచి గ్రుడ్డుతో సంయోగం చెందనట్లయితే గర్భధారణ జరగదు. కనుక ఆ గ్రుడ్డుకు వీర్యంలోని జీవకణాలు అందకుండా చేయాలి. అంటే ఆ జీవకణాలు ప్రయాణించే నాళంలో చివరకాస్త ముక్కను ఆపరేషన్ ద్వారా తొలగించినట్లయితే జీవకణాలు గర్భాశయంలోకి ప్రయాణంచేసే వీలు పోతుంది.

ఇలా చేయడంవల్ల శరీరంలో ఏ వొక్కగ్రంధీ తొలిగించ బడటంలేదు. అవయవాలన్నీ వాటి వాటి విధి నిర్వహణలను యధా విధిగానే కొనసాగిస్తాయి.

స్త్రీలకు సాధారణ సమయంలో ఆపరేషన్ చేయడం చాలా పెద్దపని. దానికి డాక్టర్లు, నర్సులు, యితర పరికరాలెన్నో అవసరం. ప్రసవించిన స్త్రీలకయితే ప్రసవించిన మూడోరోజున ఆపరేషను చేయడం మంచిది. సులభంకూడా. తద్వారా ఆమె హాస్పిటల్లో ప్రసవించిన కారణంగా కొన్ని రోజులపాటు మంచంమీదనే వుంటుంది. గనుక పురుడుపోసే టైముకు ఆపరేషన్ చేసినప్పటికీ అది మానిపోయి మామూలుగానే యింటికి వెళ్ళిపోవచ్చును. మామూలు స్త్రీలకు ఆపరేషన్ చాలా జాగ్రత్తగా చేయవలసి వుంటుంది. లేనిచో ప్రమాదం కూడా. ఆదే పురుషుని విషయంలో చాలా సులభం. ఆపరేషను పదిహేను యిరవై నిముషాల కన్న ఎక్కువపట్టదు. చేయించుకున్న వ్యక్తి వెంటనే యింటికి వెళ్ళిపోవచ్చును. అందువల్ల ఏర్పడేచిక్కులేమీ వుండవు. కాకపోతే ఆపరేషన్ చేయించుకున్న వ్యక్తి తరువాత మూడు మాసాలవరకూ సంప్రయోగానికి పూనుకోకుండావుండాలి. అది విధిగా పాటించాలి. యీ ఆపరేషనుకు అయ్యేఖర్చు చాలా తక్కువ. ఆపరేషను పరికరాలను ఒకచోటనుంచీ మరొకచోటికి తేలికగా తీసుకువెళ్ళవచ్చు. ఒక అరడజను మందికి సరిపడే సరంజామాఅంతా ఒక చిన్న సంచిలో పెట్టుకొని తీసుకువెళ్తూ ఏ పల్లెటూర్లోనైనా — ఆపరేషన్ థియేటరు అవసరం లేకుండానే ఆరుబయట - తగు జాగ్రత్తలతో ఆపరేషన్ చెయ్యవచ్చు. అలా ఒకసారి ఆపరేషన్ చేయించుకున్న వ్యక్తికి యిక పిల్లలు కలగడమనే సమస్యేలేదు. యిలాచేసిన ప్రయోగాలు చక్కని ఫలితాలిచ్చాయి. కుటుంబ నియంత్రణకిది ఉత్తమోత్తమ పద్ధతిగా నిరూపితమైనది.

ఇలా చేయడంపట్ల కొందరికి రెండు రకాలైన సందేహాలు కలుగుతున్నాయి.

1. మనిషి దుర్బలుడయి పోతాడనేది
2. ఆపరేషను జరగకముందు మాదిరిగా, జరిగాక లైంగికానందం పొందలేమనేమోననేది. అసలీ అనుమానాలకే తావులేదు. ఎందుచేతనంటే శరీరంలో ఏగ్రంధినీతొలగించడంలేదు. ఒకవేళ అలాంటి భయమేదైనా కల్గితే దానికి ఆవ్యక్తియొక్క మానసికదౌర్బల్యమే కారణం యీ విషయంలో తమచే చికిత్స చేయించుకొన్న వారందరికీ డాక్టరు ప్రశ్నావళిపంపితే కొందరు స్వయంగా వచ్చి కొందరు వ్రాతపూర్వకంగా సమాధానాలు పంపడం జరిగింది. వాటిని పరిశీలిస్తే 75.4% తమలో ఎలాంటిమార్పు రాలేదనీ 24.5% మంది తమ ఆరోగ్యం అది వరకటికన్నా మెరుగు పడిందనీ పేర్కొన్నారు. కనుకదీన్ని బట్టి ఆపరేషనువల్ల శరీరదౌర్బల్యం ఏర్పడుతుందనేందుకు ఆధారమేలేదు. ఇక రెండవ అభ్యంతరం : ఆపరేషను తర్వాత పూర్వం మాదిరి లైంగికానందాన్ని పొందలేమేమోనన్నది. ఇదెంతవరకూ నిజమో పరిశీలించగా 80.3% మంది ఎలాంటిమార్పు లేదనీ, 11.7% మంది అదివరకటికన్న తామెక్కువ ఆనందం పొందుతున్నామనీ పేర్కొన్నారు. పోతే మిగతా 7 9% మంది మాత్రం లైంగిక ఆనందంలో అదివరకటి అభిరుచీ, ఆతృప్తీలేవని పేర్కొనడం జరిగింది. ఇలా పేర్కొన్నవారిలో కొందరు తమ బంధువుల వొత్తిడికివొంగి వెలిబుచ్చినవారూ లేకపోలేదు. ఏమైనా కుటుంబ నియంత్రణకు ఆపరేషను ఒక్కటే సరైన మార్గమని అందరూ అంగీకరించారు.

1959 లో జనాభా లెక్కల సమావేశంలో వెల్లడైన సమాచారాన్ని పురస్కరించుకొని ఒకానొక తెగలో ప్రతి 1000 మందికి 180 మంది దంపతులు పిల్లల్ని

(తరువాయి 24 వ పేజీలో)

# ప్రాచీనతమ ద్రావిడభాష



లకంసాని చక్రధరరావు

(గత సంచిక తరువాయి)

తెనుగులోని డ, ల, ర, అలు ఆదిగాగల శబ్దములు వర్ణవ్యత్యయము (Metathesis) వలన ఏర్పడిన అర్వాచీనరూపములు. ఈ రూపములనే శ్రీ లక్ష్మణరావుగారు ప్రాచీనము లనిరి.

| తమిళము | కన్నడము | తెలుగు |
| --- | --- | --- |
| ఇళ | ఎళ | లేత (ఎల) |
| ఉరల్ | ఒరల్ | రోలు |
| ఇఱకు | - | ఱెక్క (ఎఱక) |
| ఇఱప్పై | ఱెప్పె | ఱెప్ప |

ఇచట లక్ష్మణరావుగారు తెలుగు రూపములే మొదటి వనియు తమిళాది భాషల యందు అజాదిత్వము (Prothesis) కలిగిన దనియు వాదింతురు. ఈ వాదము అప్రమాణిక మైనది కావున దీనిని విమర్శింప పనిలేదు.

తెలుగు కన్నడములందు తమిళ మళయాళములకంటె కొన్ని ప్రాచీనరూపములు గలవు. ఈ విషయము నిరూపింపబడును.

ఉదాహరణములు :

| | మూలద్రావిడము | తమిళము | మలయాళము | కన్నడము | తెలుగు | అర్థము |
| --- | --- | --- | --- | --- | --- | --- |
| (A) | * ఇటి | > ఇటి | —ఇటిక | — ఇది | — ఇడియు | = పగులు |
| | * ఇటు | > ఇటు | —ఇటుక | — ఇడు | —ఇడు | = ఇచ్చు |
| | * తెళ | > తెళ | —తెళియుక | —తెళ | —తెలియు | = తెలియు |
| | * కెటు | > కెటు | —కెటుక | — కెడు | —చెడు | =నశించు. |
| (B) | ?* ఇణ/ఎణ | > ఇణయ్ | —ఇణయిక | —ఎణె | —ఎనయు | = అంగీకరించు |
| | ?* చుట్ట/చొట్ట | > చుఱా | — చుఱా | —చొఱ | — చొఱ/సోర | = చేపలలోఒకటి. |

"హ$_1$ అ$^1$ హ$^2$ అ$^2$ (హ = హల్లు; అ = అచ్చు)

ఈ రూపము గల పదముల వ్యుత్పత్తిని వీక్షించునపుడు హ$^2$ అ$^2$ మధ్య వ్యుత్పత్తి పద సీమ (Etymological boundary) ఉండును. ఈ వ్యుత్పత్తిపదసీమకు ముందున్నది ధాతుగతము తర్వాతిది ప్రత్యయగతము. అ$^1$ అనునది అ, ఇ, ఉ, ఎ, ఒ లలో ఏదేనొకటి కావచును అ$_2$ ఇఉఅలో ఎదేనొకటియై ఉండును.

(A) *అ$^2$ ఇ, ఉ, ం లలో ఏదోనొకటైనప్పుడు తమిళ, మలయాళాంధ్ర కన్నడ భాషలలో మూలద్రావిడ భాషాగతము లయిన ఇ ఎ ఉ ఒ లు అ$^1$ లో మార్పులేక సమానముగా ఉండినను.*

(B) *అ$^2$ 'అ' అయినపుడు తమిళ మలయాళములలో ఇ ఉ లు గాను తెలుగు కన్నడములలో క్రమముగా ఎ ఓ లు గానూ అ$^1$ మారును.*

ఈ ఉదాహరణముల బట్టి అ2 'అ' అయినప్పుడు మూలద్రావిడ *ఇ* ఎ లు తమిళ మలయాళములలో 'ఎ' గాను మారినట్లును; ఇట్లే మూలద్రావిడ *ఉ* ఒ లు తమిళ మలయాళములలో 'ఉ' గాను మారినట్లు, తెలుగు కన్నడములలో ఒ గాను మారినట్లు తెలియును మూలద్రావిడ భాషలోని ఇ, ఎ లు *A వర్ణముగా మూలదక్షిణ ద్రావిడభాషలోను, ఉ, ఒలు *B వర్ణముగాను మాఱినట్లు భావింపుడు. తమిళ మలయాళములలో *A =ఇ, *B = ఉ; తెలుగు, కన్నడములలో *A = ఎ, *B = ఒ. *A *B ల అసలువిలువయేమి ? మూలద్రావిడ గతాచ్చుల నెట్లు కనుగొనగలము ?

మూలద్రావిడ గతాజ్లక్షణములను తెలిసికొనుటకు అనాగరక భాషలధికముగ తోడ్పడును. అనాగరక భాషలలో పదాద్యచ్చులు అంతగా మాఱవు.

| మూలద్రావిడము | తెలుగు | కన్నడం | తమిళం | కుఇ |
| --- | --- | --- | --- | --- |
| *ఎ | తెఱచు | తెఱ | తిఱ | త్రేప్ప |
| *ఒ | పొగడు | పొగళ్ | పుగళ్ | పోగ్జ |

ఇప్పట్టున తెలుగు కన్నడములందే మూలద్రావిడ భాషాపదాది గతాచ్చు నిలిచినది.

*A — *B లను కనుగొను పద్ధతి.

I. (*a*) *ఇహ — [ఇ, ఉ > ఈ

(*b*) *ఇహ — [అ > ఏ

(*c*) *ఎహ — [ఇ ఉ అ > ఏ

II. (*a*) *ఉహ [ఇ, ఉ > ఊ

(b) *ఉహ [అ > ఓ

(c) *ఒహ [ఇ ఉ అ > ఓ

ధాతుగతహల్లు ప్రత్యయ గతాచ్చులు కలసి సంకుచిత మగునపుడు, ధాతుగతహల్లును ప్రత్యయ గతాచ్చును లోపించుటయు అ[1] దీర్ఘ మగుటయు సంభవించును. ఈ విధముగా మార్పు నొందునపుడు *ఎ* ఒ లలో మార్పులేకుండ దీర్ఘతను బొందును. *ఇ *ఉ లకు 'అ' పరముగా ఉన్నప్పుడు *ఎ* ఒ లకు వలెనే క్రమముగా మార్పు నొందును. అనగా 'అ' పరముగా ఉన్నప్పుడు *ఇ* ఎ లు 'ఏ' గాను *ఉ *ఒ లు 'ఓ' గాను మారును. ఈ మార్పు అన్ని దక్షిణ ద్రావిడ భాషలకును సమానమే.

ఉదాహరణ:

I. (a) *నివు > నీ

తెలుగు=నివుఋ > నీఋ=బూడిద

తమి = నీఋ

గోండి = నీర్

(b) *తియ > తె

తమి=తీయమ్; తెలుగు_తీయము= తీపి

తమి. తేమ్; తెలుగు. తేనె > తేనె,

(c) *కెయ > కే

తమి. చెమ్పు > చేమ్పై

తెలుగు. చేమ.

II. (a) *ఉయి > ఊ

తమి : ఉయిర్ = ఊపిరిపీల్చు

తెలుగు : ఊర్చు

(b) *పుక > పో

తమి.పుక > పో = వెడలు

తెలుగు — పో

(c) *తొక > తో

తమి : తుకల్ > తోల్ = చర్మము

తెలుగు. తొవలు > తోలు = చర్మము.

'అ' కు పూర్వము గాగల మూలద్రావిడ *ఇ *ఉ లుపై రీతి సంకుచిత మగుటకు పూర్వము ఎ, ఒలుగా మారినట్లు తెలియును. ఈ మార్పన్ని దక్షిణ ద్రావిడ భాషలకు సమానముగావున మూలదక్షిణ ద్రావిడ భాషలోనే యిట్లు మూలద్రావిడ *ఇ *ఎలు *ఎ గాను *ఉ *ఒ లు *ఒ గాను మారినట్లు భావించుట విజ్ఞత. అనగా *A = *ఎ, *B = *ఒ. ఈ విషయమున తెలుగు కన్నడములే ప్రాచీనస్థితిని నిలుపుకొనిన వగుట విజ్ఞత[12].

మూలద్రావిడమున దీర్ఘాచ్చులుగా ఉన్న వానిని తెలుగట్లే నిలుపుకొనగా తమిళాది యితరభాషలలో ఆ దీర్ఘాచ్చులు హ్రస్వము లయ్యెను.[13]

తెలుగు_తమి_మళ_అర్థము

*వాట్:వాడు వటిజ్కు వటి ఉపయోగించు

*వాన్:వాను వనై మనయుక తయారుచేయు

పదాది మూలద్రావిడ *క వర్ణము ఇ, ఈ, ఎ, ఏ_ల గూడినప్పుడు చకారముగా తమిళ మలయాళాంధ్రములలో మారును. కన్నడమున ఈ *క వర్ణము నిల్చినది. కావున ఈ విషయమున కన్నడమే ప్రాచీన స్థితిని నిలుపుకొనినది.

| కన్నడము | తమి | మల | తెలుగు |
|---|---|---|---|
| కెదఋ | చిదఋ | చితర్ | చెదరు |
| కిఋ | సెఋ | చెఋ | చిఋ |
| కెయ్ | సెయ్ | చేయి | చెయ్యి |

మూర్ధన్యాక్షరములు పరముగా ఉన్నప్పుడు తమిళమున పదాది *క వర్ణము ఇ,ఈ, ఎ, ఏ లగూడినప్పుడు చవర్ణముగా మారదు. తెలుగున సర్వత్ర పదాది *క వర్ణము ఇ, ఈ, ఎ, ఏ ల గూడినప్పుడు చకారముగా మారును.

మూలద్రావిడము. కన్న. తమి. తెలుగు

*కెటు < కెడు — కెటు — చెడు

*కిఴ < కిఴ — కిఴ — చిలు (క)

వాఙ్మయ శూన్య భాషాసమూహములో కొన్ని ప్రాచీన లక్షణములు నిలిచియున్నను వాని ప్రాచీనతను తెలుపు ఆధారములుండవు. కావట్టి తులనాత్మక భాషాపరిశీలన సందర్భమున ఈ భాషలు మన మొనర్చుకొను సిద్ధాంతములను సరిచూచుకొనుటకు బాగుగా ఉపయోగించును. టటిల్ మొదలగువారు అనాగరక భాషల కత్యంత ప్రాముఖ్య మిచ్చి తమిళాది నాగరకభాషలను తక్కువగా లెక్కించిరి. తమిళభాష తదితర ద్రావిడ భాషలకంటె అత్యంత పూర్వకాలముననే వాఙ్మయ స్థితి నందినది. కావున ఆ భాషా పరిశీలనము వలన అనేక సంశయములు విచ్ఛిన్న మగును.

తెలుగు పదములందు పదాది సరళధ్వను లున్నను తమిళమున పదాదిని పరుషధ్వనులే కాని సరళధ్వనులు లేకుండుటయు "తొల్కాపియనార్" కాలమున పదాది సరళోచ్చారణము సదసత్సంశయ హేతుభూత మగుటయు చూడగా మూలద్రావిడమున సరళాక్షరములు లేవని తమిళ సహాయ్యమున నిశ్చయింప వచ్చును. ఇక అనాగరక భాషల లోను ప్రాచీన భాషాలక్షణములు కొన్ని నిలిచియున్నవనుటకు ప్రబల ప్రమాణములు గలవు. మూలద్రావిడములోని ' పదాది

12. "Alternations i/e and U/o in South Dravidian" (Bh. Krishna Murty Garu) (Language Vol. 34 No. 4. October - December - 1958) అను వ్యాస మీ వాదమున కాధారము).

13. "There are number of cases where Te. Preserves the long grade while Ta etc., show the shortened one". (Telugu Verbal Bases - 122)

*చకారము తెలుగు, తమిళ, కన్నడ, మల యాలాది భాషలలో లోపించెను. పర్జి భాషలో ఈ పదాది చకార మన్లే యున్నది.

| పర్జి | తమి | మల | కన్న | తెలుగు |
|---|---|---|---|---|
| చీ | ఈ | - | ఈ | ఈ (ఇచ్చు) |
| చుప్ | ఇప్పు | ఉప్పు | ఉప్పు | ఉప్పు |
| చిల | ఇల్లై | ఇల్ల | ఇల్ల | లేదు (*ఇలదు) |
| చర్ర్ > చర్ | - | — | — | అఱు |
| చాకొల్ | — | — | — | ఆకలి |
| చీన్ద్ | ఈన్తు | — | — | ఈత |
| చేదిర్ | — | — | ఏదు | ఏదు(పంది) |
| చేన్దు | ఇన్దు | — | — | ఏను(ఐదు) |

ప్రాచీన ద్రావిడ భాషాలక్షణము నీ విషయ మున నిలుపుకొన్నది పర్జియే కాని తమిళము కాదు.

'వాన్టు' వంటిరూపములు ప్రాచీనాంధ్ర శిలాశాసనముల గలవు. వాన్టు రూపమే తర్వాత వాడుగా మారెను. నేటికిని కొండ దొర భాషయందు జనులు వాన్టువంటి రూప ముల నుచ్చరించుచున్నారు.

కొండదొరభాష:

పన్టి పంది
నేన్టు
వాన్టు

మధ్యోత్తర ద్రావిడభాషల యందు 'క' బహువచన ప్రత్యయము కాగా 'లు' వర్ణ మాంధ్రాది భాషలయందు బహువచన ప్రత్య యము. 'క' 'లు' ల సమాహారస్వరూపమే తమిళ భాషాగత 'కళ్' ప్రత్యయా విర్భావ మునకు కారణమైనది. తొల్కాప్పియనార్ ఈ 'కళ్' ప్రత్యయమును అమహత్తులపై వైకల్పికముగా విధించెను.

| భాషపేరు | ఏకవచనము | బహువచనము | అర్థము |
|---|---|---|---|
| కుఇ | స్రాస్ | స్రాస్కా | పాము |
| కువి | మ్రహ్నా | మ్రహ్కా | చెట్టు |
| కువి | పుల్లి | పుల్లిక్ | పులి |
| బ్రాహుఈ | బా | బాక్ | నోరు |
| బ్రాహుఈ | ఖన్ | ఖన్కా | కన్ను |

'లు' వర్ణకమాంధ్రమున బహువచన ప్రత్యయమనుట నిర్వివాదముగదా! 'క''లు' వర్ణములుకలిపి 'కళ్'గా ఏర్పడెననగా ఈ విషయమున తమిళార్వాచీనత స్పష్టమేగదా!

మిగిలిన ద్రావిడ భాషలకంటెను అరవ మున *ఱ కారము చిరకాలము నిలిచిన దను టకు ప్రమాణములున్నవి. తమిళ వర్ణ సమామ్నాయమున ఱకారము పేర్కొన బడి నది. ఆంధ్ర శబ్ద చింతామణిలో ఈ ఱకా రమునకు స్థానములేదు. కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు తమ బాలవ్యాకరణోద్ద్యోతమున ఈ ఱకా రమునకు ఆంధ్రమున స్థానము కల్పించుట వింత! ఱకారవిషయమున తమిళమే ప్రాచీన స్థితిని నిల్పుకొనిన దనుట సిద్ధాంతము.

కావున నాగరక, అనాగరక భాషలన్నిటిని సమదృష్టితో పరిశీలించి చూచి మూలద్రావిడ భాషాలక్షణములు వేనియందున్నవో గమ నించితిమి. ప్రతిభాషయందు ఏదో ఒక విశేషముండుట సంభవించినది. తమిళమున పలుప్రాచీన లక్షణములు లభించుటకు కార ణము ఆభాషపూర్వమే వాఙ్మయస్థితి నందుట కాని వేఱుగాదు14. కావున ద్రావిడభాష లన్నియు సోదరభాషలనియు ఇందుదేనికిని అగ్రజత్వమును అంటగట్టుట తగదనియు స్పష్టము. ద్రావిడ భాషలలో దేనిని 'ప్రాచీ నతమ'మని భావింప తగదనుట సిద్ధాంతము*

14. పూజ్యులు శ్రీ రామకృష్ణయ్యగారు భాషా చారిత్రక వ్యాసములలో ఈ యభిప్రాయమును ప్రకటించిరి. ఆ గ్రంథము ప్రకటిత మయి చాల కాలమయినది. ఈ మధ్యకాలమున భాషాశాస్త్రమున తడు అభివృద్ధి జరిగినది. ఆ అభివృద్ధి ఆధారముగా ఈ వ్యాసమా విర్భవించెను.

(21 వ పేజీ తరువాయి)

కనే వయసులో వున్నారనీ అందులో 70 మంది దంపతులు 25-34 సం॥ ల మధ్య వయసులో వున్నట్లూ వెల్లడయింది అందరూ కుటుంబ నియంత్రణకు సహక రించాలంటే కనీసం 7 కుటుంబాలయినా కుటుంబ నియంత్రణాన్ని అమలుపరచ వలసి వుంటుంది.

కనుక ప్రతితెగలోనూ ప్రతివెయ్యిమంది జనాభాకు ఏటా కనీసం అయిదు కుటుంబా లయినా సంతాన నిరోధాన్ని అమలు జరప వలసి వుంటుంది. యీ విషయంలో గర్భ స్రావాలవల్లనైతేనేమి, మరోపద్ధతివల్ల నైతేనేమి జనాభా పెరుగుదలను సగానికి అరికట్టడం జరిగింది. ప్రతి వెయ్యిమంది జనాభాకూ 12 కుటుంబాలు యీ పద్ధతిని అమలు పరిచాయి.

ఆంధ్రప్రదేశ్ జనాభా 3½ కోట్లకు పైగా వున్నారు. మనజనాభా పెరుగుదలను అరికట్టుకోవాలంటే వచ్చే పదేండ్లలోనూ ఏటా దాదాపు రెండు లక్షలమంది యీ కుటుంబ నియంత్రణ పథకాన్ని అమలు జరప వలసివుంటుంది. రెండు లక్ష లనే సరికి "అమ్మో! ఆంతమందే" అనిపిస్తుంది. కాని సాధించడం ఏమంతంకష్టమైన విషయ మేమీ కాదు. మనం పంచాయతీరాజ్యం అమలు జరుపుకుంటున్నాము. ప్రతి పంచా యతీ సమితిలోనూ 60,70 వేల జనాభా వుంటుంది. ప్రతి సమితిలోనూ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలుంటాయి. పైనపేర్కొన్న లెక్కలవివరాల్ని పురస్కరించుకొని ప్రతి ప్రాథమిక ఆరోగ్యకేంద్రంలోనూ వారానికి 8 నుంచి 10 వరకూ కుటుంబ నియంత్రణ పథకాన్ని అమలు జరిగేట్టు మనం సహక రించినప్పుడు యిది చాలా సులభం. ముక్కగావున్న యీ సమస్యను మానుగాక మునుపే కత్తిరించడం అత్యవసరం. యీ ప్రమాదం కేవలం కొందరికేకాదు, అందరి దీను. యీ సమస్యమొత్తం దేశానిదే. కనుక సంకుచితవైఖరితోగాని ప్రాచీన భావాల ప్రభావాలకులోనైగాని సృష్టికి వ్యతిరేకచర్య పాపభూయిష్టమనే ఛాందసభావాలకు లోనై గాని వ్యవహరించగూడదు. యిది ప్రభుత్వ మొక్కటే ఎదుర్కొని సాధించేసమస్యగాదు. ప్రజలుకూడా ముందుకురావాలి. అప్పుడే మన ప్రణాళికలకు సార్థకత లభిస్తుంది. ప్రగతికి మార్గం సుగమమవుతుంది: ★

# విద్యుదుత్పత్తి పెరుగుదల

మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో మన రాష్ట్రంలో స్థాపిత విద్యుదుత్పాదకశక్తి 43,100 కిలోవాట్లు వుంది. దరిమిలా తొలి ప్రణాళికా కాలంలో స్థాపిత విద్యుదుత్పాదక శక్తిని మరో 55,800 కిలోవాట్లకు పెంచారు. దీనితో మొత్తం విద్యుదుత్పాదక శక్తి 98,900 కిలోవాట్లకు పెరిగింది. పిమ్మట రెండవ ప్రణాళికా కాలంలో ఈశక్తి 213,000 కిలోవాట్లకు పెంచారు. పోతే మూడవ ప్రణాళిక విద్యుదుత్పాదన లక్ష్యాలు ఈ విధంగా వున్నాయి:

| | |
|---|---|
| 1. తుంగభద్ర హైడ్రోస్టేషను | 28,800 కి.వా.లు (ఆంధ్ర వాటా) |
| 2. నెల్లూరు థర్మల్ స్టేషను | 30,000 కి.వా.లు |
| 3. ఎగువ సీలేరు తొలిదశ | 120,000 కి.వా.లు |
| 4. రామగుండం విస్తరణ పథకం | 60,000 కి.వా.లు |
| 5. కొత్తగూడెం తొలిదశ | 120,000 కి.వా.లు |
| 6. గ్యాస్ టర్బో సెట్లు | 20,000 కి.వా.లు. |
| మొత్తం .. | 378,800 కి.వా.లు. |

ఈ క్రింద పేర్కొన్న భారీ పథకాలను అమలు పరచారు:—

## మాచ్‌ఖండ్ జలవిద్యుత్ పథకం

ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సా ప్రభుత్వాలు సంయుక్తంగా ఈ పథకాన్ని చేపట్టాయి ఈ రెండు రాష్ట్రాలు 70:30 నిష్పత్తిలో వ్యయాన్ని భరిస్తాయి. విద్యుచ్ఛక్తి సరఫరాలను కూడా ఈ రాష్ట్రాలు అదే నిష్పత్తిలో పొందుతాయి. గోదావరి ఉపనది అయిన మాచ్‌ఖండ్ నదీ జలాలను ఈ పథకానికి వినియోగిస్తారు. మాచ్‌ఖండ్ విద్యుత్కేంద్రంలో మొదటి ప్రణాళికా కాలంలో ఒక్కొక్కటి 17,000 కి. వా. ల శక్తిగల మొదటి రెండు యూనిట్లనూ నెలకొల్పారు. తరువాత రెండవ ప్రణాళికా కాలంలో 17,000 కి. వా. ల శక్తిగల 3వ యూనిటునూ, ఒక్కొక్కటి 21,250 కి. వా. ల శక్తిగల 4,5,6 వ యూనిట్లనూ ఈ విద్యుత్కేంద్రంలో స్థాపించారు. దీనితో ఈ కేంద్రాన్ని అభివృద్ధిపరచే పని పూర్తిగా ముగిసింది. మాచ్‌ఖండ్ జలవిద్యుత్ పథకాన్ని 1946 వ సం. లో యుద్ధానంతర అభివృద్ధి పథకంగా చేపట్టడం జరిగింది.

## తుంగభద్ర జలవిద్యుత్ పథకం

1953 అక్టోబరు మొదటి తేదీన ఆంధ్ర రాష్ట్రం ఏర్పడడంతో ఈ పథకం ఆంధ్ర, మైసూరు రాష్ట్రాల సంయుక్త నిర్వహణ క్రిందికి వచ్చింది. ఈ పథకానికి అయ్యే ఖర్చును ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలు 80:20 నిష్పత్తిలో భరిస్తాయి. ఆనకట్ట వద్ద, హంపివద్దగల విద్యుత్కేంద్రాలు ఉత్పత్తిచేసే విద్యుచ్ఛక్తిని కూడా ఈ రెండు రాష్ట్రాలు ఇదే నిష్పత్తిలో పొందుతాయి. ఈ పథకం క్రింద, ఆనకట్ట దిగువనా, ఆనకట్టకు 14మైళ్ళు దూరంలో నున్న హంపివద్దా - రెండు స్థలాలలో - విద్యుదుత్పాదన జరుగుతుంది. ఈ పథకం మొదటి దశ పనులను అంటే ఆనకట్ట విద్యుత్కేంద్రంలో ఒక్కొక్కటి 9,000 కి. వా. ల శక్తిగల రెండు యూనిట్లనూ, హంపి విద్యుత్కేంద్రంలో ఇంతేశక్తిగల మూడు యూనిట్లనూ నెలకొల్పే పనులను-1950 వ సం. లో ప్రారంభించారు. ప్రథమ ప్రణాళికా కాలంలో ఈ పనులు శీఘ్రగతిని అమలు జరిగాయి. రెండవ ప్రణాళికా కాలంలో రెండు విద్యుత్కేంద్రాల తొలిదశ అభివృద్ధి పనులను పాక్షికంగా ముగించారు. ఈ కాలంలో ఆనకట్ట విద్యుత్కేంద్రం, హంపి విద్యుత్కేంద్రాలలో అయిదు యూనిట్లను నెలకొల్పవలసి వుండగా ఒక్కొక్కటి 9,000 కి. వా. ల శక్తిగల నాలుగు యూనిట్లను – ఒక్కొక్క కేంద్రంలో రెండు యూనిట్ల చొప్పున- స్థాపించారు.

## తుంగభద్ర - నెల్లూరు హైడ్రో థర్మల్ పథకం

ఈ పథకం క్రింద ఒక్కొక్కటి 9,000 కి.వా.ల శక్తిగల 3 హైడ్రో యూనిట్లను- తుంగభద్ర ఆనకట్ట విద్యుత్కేంద్రంవద్ద రెండు, హంపి విద్యుత్కేంద్రం వద్ద ఒకటి—నెలకొల్పుతారు. వాటి స్థాపనతో ఈ రెండు విద్యుత్కేంద్రాల సమగ్ర అభివృద్ధి కార్యక్రమం పూర్తవుతుంది.

ఇంతేగాక తుంగభద్ర విద్యుత్కేంద్రాలకు సహాయకారిగా వుండేందుకై నెల్లూరువద్ద, 30 మె. వా.ల థర్మల్ యూనిటును నెలకొల్పుతారు. ఈ పథకాన్ని రెండవ ప్రణాళికలోనే చేర్చినప్పటికీ, దీనికి కేంద్ర ప్రభుత్వం అనుమతి ఆలస్యంగా లభించినందువల్లా, దీనికి అవసరమైన విదేశమారక ద్రవ్యం విడుదల కానందువల్లా ఈ పథకం పనులు సాగలేదు.

## ఎగువ సీలేరు జలవిద్యుత్ పథకం

ఈ పథకాన్ననుసరించి ఎగువసీలేరు

జలవిద్యుత్ కేంద్రంలో 60,000 కి.వా.ల శక్తిగల రెండు యూనిట్లను నెలకొల్పుతారు. ఈ రెండు యూనిట్లకు నీటి సరఫరాను క్రమబద్ధం చేసేనిమిత్తం గుంటవాడవద్ద ఒక 'వీర్'ను మాత్రమే నిర్మించవలసి వుంటుంది. ప్రణాళికా సంఘం రూ. 50 లక్షల స్వల్ప కేటాయింపును మాత్రమే ఆమోదించింది. కాబట్టి రెండవ ప్రణాళికా కాలంలో ప్రారంభ పనులను మాత్రమే చేపట్టడం జరిగింది.

## శ్రీశైలం - నాగార్జునసాగర్ జలవిద్యుత్ పథకం

శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టు, నాగార్జున సాగర్ జలవిద్యుత్ కేంద్రాల క్రింద దిగువ కృష్ణా బేసిన్ సమీకృత అభివృద్ధి తలపెట్టబడింది. పై రెండు పథకాలను అనుసరించి శ్రీశైలంవద్ద, నాగార్జునసాగర్ ఆనకట్ట స్థలంవద్ద ఒక్కొక్కటి చొప్పున రెండు విద్యుత్కేంద్రాలను నెలకొల్పుతారు. ఒక్కొక్కటి 110,000 కి వా. ల శక్తిగల నాలుగు యూనిట్లను శ్రీశైలం విద్యుత్కేంద్రంలోనూ, ఒక్కొక్కటి 50,000 కి. వా.ల శక్తిగల రెండు యూనిట్లను నాగార్జున సాగర్ విద్యుత్కేంద్రంలోనూ స్థాపిస్తారు

## నిజాంసాగర్ జలవిద్యుత్ పథకం

నిజాం సాగర్ విద్యుత్కేంద్రంలో మొదటి ప్రణాళికా కాలంలో 5,000 కి. వా. ల శక్తిగల మూడు యూనిట్లను నెలకొల్పారు. ఇక్కడ విద్యుదుత్పాదన నిజాంసాగర్ జలాశయంనుంచి సేద్యానికి విడుదల చేసే నీటిపై ఆధారపడి జరుగుతుంది కాబట్టి ఈ కేంద్రాన్ని హుస్సేన్ సాగర్ థర్మల్ కేంద్రంతో కలిపి నిర్వహించడం జరుగుతున్నది. ఇందువల్ల హుస్సేన్‌సాగర్ విద్యుత్కేంద్రంలో బొగ్గువాడకం తగ్గుతుంది

## రామగుండం థర్మల్ కేంద్రం

ఒక్కొక్కటి 12,500 కి. వా.ల శక్తి గల 3 యూనిట్లను నెలకొల్పడం రెండవ ప్రణాళిక తొలి సంవత్సరంలో పూర్తయింది. మొదటి ప్రణాళికాంతం నాటికి ఈ పనులు శీఘ్రగతిని అమలులోనున్నవి. రామగుండం విస్తరణ పథకంక్రింద 60,000 కి. వా.ల శక్తిగల ఒక థర్మల్ యూనిటును నెలకొల్పి ప్రస్తుత థర్మల్ కేంద్రాన్ని విస్తృత పరుస్తారు. డి. ఎల్. ఎఫ్. క్రింద దీనివ్యయాన్ని భరిస్తున్నారు. భారత ప్రభుత్వం 60,000 కి. వా.ల శక్తిగల టర్బో ఆల్టర్‌నేటర్ కొరకు ఆర్డరు చేసింది. డి. ఎల్.ఎఫ్, షరతుల ప్రకారం సలహాదార్ల నియామకం జరిగింది 1965-66వ సం. లో ఈ యూనిటు బహుశా వినియోగంలోకి వస్తుంది.

## కొత్తగూడెం థర్మల్ పథకం - మొదటిదశ

ఈ పథకంక్రింద ఒక్కొక్కటి 60,000 కి. వా.ల శక్తిగల రెండుథర్మల్ యూనిట్లను కొత్తగూడెంలో నెలకొల్పుతారు. ఇది పిట్ హెడ్ స్టేషను. ఒకలక్ష కిలోవాట్ల కేంద్రంగా దీనిని అభివృద్ధి పరిచే అవకాశం వుంది. ప్రపంచ బ్యాంకు నుంచి ఈ పథకానికి ఋణసహాయం లభిస్తున్నది. సలహాదార్ల నియామకం జరిగింది. ప్రస్తుత అంచనాలనుబట్టి రెండు యూనిట్లూ 1965-66వ సం.లో బహుశా వినియోగంలోకి వస్తాయి.

## హైదరాబాదులో గ్యాస్ టర్బో సెట్ల స్థాపన

రాజధానీనగరంలోనూ, ఆ చుట్టుప్రక్కల ప్రదేశాలలోనూ వున్న విద్యుచ్ఛక్తి కొరతను కొంతవరకు తీర్చే నిమిత్తం హైదరాబాదులో ఒక్కొక్కటి 10 కి. వా. ల శక్తిగల 2 గ్యాస్‌టర్బో సెట్లను నెల కొల్పుతున్నారు.

## తెలంగాణా హైడ్రో థర్మల్ పథకం

ట్రాన్స్‌మిషన్ లైన్లద్వారా, సబ్ స్టేషన్లద్వారా తెలంగాణా ప్రాంతంలోని ప్రస్తుత విద్యుత్కేంద్రాలను ఒకదానికొకటి కలిపి సమన్వయ విధానంలో వాటిని నిర్వహించడానికి ఈ పథకాన్ని రూపొందించారు. రామగుండం విద్యుత్కేంద్రంలో 150,000 Lb/hr శక్తిగల బాయిలర్‌నూ, హుస్సేన్‌సాగర్ విద్యుత్కేంద్రంలో 75,000 Lbs/hr శక్తిగల మరో బాయిలర్‌నూ - ఈ రెండు కేంద్రాల విద్యుదుత్పాదక శక్తిని పెంపొందించే నిమిత్తం- నెలకొల్పడాన్ని కూడా ఈ పథకం లక్షిస్తున్నది. బాయిలర్ల కొరకు ఆర్డరు చేశారు. 1964 వ సం. లో బహుశా వాటిని వినియోగంలోకి తెస్తారు.

## గ్రామాలకు విద్యుత్ సౌకర్యాల విస్తరణ

మొదటి పంచవర్ష ప్రణాళిక ముగింపులో విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలసంఖ్య 205 వుండగా ప్రణాళికాంతంనాటికి వాటిసంఖ్య 685 కు పెరిగింది.

రెండవ ప్రణాళికా కాలంలో మరో 2553 పట్టణాలకు, గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలు కల్పించారు. వీటితో కలుపుకొని ఈ ప్రణాళికాంతంనాటికి విద్యుత్ సౌకర్యాలు పొందిన పట్టణాలు, గ్రామాల సంఖ్య 3,238 కి హెచ్చింది.

మూడవ ప్రణాళికా కాలంలో మరో 1468 గ్రామాలకు విద్యుచ్ఛక్తి లభింపజేయడానికి తలపెట్టారు. ఇది జరగడంతో విద్యుత్ సౌకర్యాలు పొందిన గ్రామాల సంఖ్య 4706 అవుతుంది. కాగా వీటిలో 1077 గ్రామాలకు ఈ ప్రణాళిక తొలి రెండు సంవత్సరాలలోనే విద్యుత్ సౌకర్యాలను కల్పించడం జరిగింది.

విద్యుదుత్పాదన, ప్రసారం, పంపిణీ పథకాలకు ప్రథమ ప్రణాళికాకాలంలో రూ. 28.5 కోట్లు, ద్వితీయ ప్రణాళికా కాలంలో రూ. 38 53 కోట్లు ఖర్చు చేశారు.



# హితోక్తి

ఎ. రామచంద్రరావు

భారతభూమిలో ప్రభవ మందిన
        బుద్ధుని ధర్మమార్గమున్
కూరిమిమీరగా మదిని గొల్చి
        తరించుచునుంటిరే గదా!
వైర మదేల మా పయిని వైరుల
        మా పరికించి చూడుమా
ఘోరకృతఘ్నతల్ సలుప
        గూడునె తెల్పుము, చైన సోదరా!

*

గురునకు పంగనామములు
        గొప్పగ పెట్టితి వౌర మూర్ఖతన్
వరుసను తిన్న యింటికడ
        వాసములన్ గణియించినావురా!
పరమకృతఘ్నతామతిని
        పచ్చని యింటికి నిప్పుపెట్టెదే?
జరుపకు మిట్టి కార్యములు
        జాల్మడవై యికనైన సోదరా!

*

అరయంజాలవు 'పంచశీలము'ను
        నాపై విశ్వకల్యాణమున్
సరకుంజేయగ వైతి; 'శాంతి'
        వసుధన్ సంహారమున్ జేసెదే?
    సరిసరి 'సామ్యవాదమును'
        చక్కగ జాటితి వెల్లదేశముల్
పరువు ప్రతిష్ఠలన్ జలము
        పాలొనరించకు వెఱ్ఱితమ్ముడా!

*

బుద్ధి యొకింత లేక యిటు
        పూరికినై జగడంబు సేయుదే?
హద్దులు పూర్వు లేర్పరచి
        నట్టివి యేటికి పాలుమాలెదో?
హద్దులు మీరి వచ్చెదవొకో;
        యికసైపము; మీకు గట్టిగా
బుద్ధులు నేర్పి పంపెదము
        పొమ్మికనైనను పిచ్చి తమ్ముడా!

*

నల్వది నాల్గు కోటు లగు
        నాదు సహోదరు లేకమైనచో
నల్వయు నిల్వలేదు: విను,
        నాశనమౌ రణరంగమందునన్
తుల్వలు మీరు లెక్క? మిము
        త్రుంచెద మొక్క నిమేషమందునన్
బల్వడి క్రొవ్వు వీడి, యిక
        పర్వము వచ్చిన త్రోవ సోదరా!

*

నెత్తిన కుచ్చుటోపి బలు
        నేర్పుగ బెట్టితి వా'టిబెట్టు'కున్
తొత్తుల చేసుకొంటి విక
        దొఱ్ఱవు నీ వయినావు వారికిన్
నెత్తురుకూడు నీ బ్రతుకు,
        నీల్గెద వెప్పుడో యల్పజీవివై
నెత్తిన గుడ్డవేసికొని
        నేరుపుగా దయసేయు సోదరా!

*

దుందుడుకొప్ప నీ వికను
        తొందర బూనకురా దురాత్మకా!
మ్రందుట నిక్కువమ్మకట!
        మాపయి నీ విటు లెత్తివచ్చినన్
యెందుకు మానిపొమ్మికను
        నేర్పడ ప్రాణము మీది తీపితో,
చిందులు మాను మింక మిము
        చీల్చెద మోయి వృథా, సహోదరా!

*

ధర్మ మొకింత లేక పర
        ధారుణి మ్రింగను జూచె దేలకో!
నిర్మల జీవితాలపయి
        నిప్పులు రాల్చెదవేల ధూర్తుడా
కర్మము మూడి; నీ విటుల
        కయ్యము సేయగ కాలు దువ్వెదో,
నిర్మమతన్ జయించి మిము
        నిల్పెద మంతకు చెంత, సోదరా!

*

భారతదేశ ముక్తికయి
        ప్రాణము లర్పణ జేయ సిద్ధమే.
వీరుల గన్న గడ్డ యిది,
        వేలకు వేల యుగాలనుండియున్
భారత కింతలోటు నెటు
        జూచిన కానగరాదు, యీ ధరన్
భారతదేశమున్ గెలువ
        బంతులయాటనుకొంటె సోదరా!



# ప్రాచీన భారతదేశంలో కార్మికవర్గం

పెమ్మరాజు వెంకటరావు

ప్రాచీన భారతదేశంలోని కార్మిక సమస్యలను గురించి తెలుసుకోవడానికి వేదాలనూ, గౌతముడు, అపస్తంభుడు, వశిష్ఠుడు ప్రభృతుల ధర్మశాస్త్రాలనూ, కౌటిల్యుని 'అర్థశాస్త్రాన్నీ', పరాశరుడు, నారదుడు, విష్ణువు, యాజ్ఞవల్క్యుడు, బృహస్పతి, కాత్యాయనుడు, మనువు తదితరుల స్మృతులనూ, జాతకాలనూ, శుక్రాచార్యుని నీతి శాస్త్రాన్నీ అధ్యయనం చేయవలసి వుంటుంది. కాబట్టి ఈ సమస్యల పరిశీలన ఇబ్బందితో కూడుకున్నది. ప్రాచీన కాలంలోని కార్మికుల పరిస్థితులను గూర్చి కానీ, యజమానులు, కార్మికుల మధ్య సత్సంబంధాల విషయంలో తీసుకున్న అనేక చర్యలను గూర్చి కానీ సమగ్రమైన పరిశీలన ఇప్పటివరకూ జరగలేదు. అయితే డాక్టర్ రాధా కుముద్ ముఖర్జీ, డాక్టర్ బి.జి. గోఖలే, హెచ్. సి. చక్రధర్, ముజుమ్దార్, రాయ్ చౌదరీ దత్తా, వి. ఏ. స్మిత్, రైస్ డేవిడ్, కె. ఎం. పనిక్కర్, మైనే మొదలైన ప్రఖ్యాత పండితులు భారతదేశ ప్రాచీన చరిత్రనూ, ఆ కాలంనాటి రాజకీయ, ఆర్థిక, సాంఘిక సమస్యలనూ పరిశీలించారు. వీరి గ్రంథాలలో ప్రాచీన భారతదేశంలోని కార్మిక సమస్యలు, ఆకాలంనాటి రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులను గూర్చి వ్రాయబడింది. డాక్టర్ కృష్ణకుమార్ శరణ్ ఇటీవల ప్రాచీనకాలం నాటి భారత కార్మిక పరిస్థితులపై ఒక పుస్తకం వ్రాశారు. పైన పేర్కొన్న పండితులు తమ గ్రంథాలలో వేదకాలంనుంచి దాదాపు క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దం వరకు అంటే సుమారు నాలుగు వేల సంవత్సరాలలోని పరిస్థితులను ప్రస్తావించారు. వారు పేర్కొన్న విషయాలు ఈ వ్యాస రచనలో నాకు చాలా తోడ్పడ్డాయి.

వేదాలు, ఉపనిషత్తుల మధ్య కాలం బహుశా క్రీ. పూ. 3000 సంవత్సరాలు మొదలు క్రీ. పూ. 400 సంవత్సరాల వరకు వుంటుంది. కాగా ధర్మ శాస్త్రాలు, ఉపనిషత్తుల మధ్య కాలం క్రీ. పూ. 600 సంవత్సరాల నుంచి క్రీ. పూ. 400 సంవత్సరాల వరకు వుంటుంది. కౌటిల్యుని అర్థశాస్త్రం క్రీ. పూ. 320–200 సంవత్సరాల మధ్య కాలంలో రచించబడినట్లు భావించబడుతున్నది. మిగతా స్మృతులు తరువాతి కాలంలో క్రీ. శ. 100–650 సంవత్సరాల మధ్య కాలంలో రచించబడినవి. పోతే శుక్ర నీతి క్రీ. శ. 750–850 సంవత్సరాల మధ్య కాలంలో రచించబడినట్లు తలంచబడుతున్నది. అందుచేత వాటిని పరిశీలించడం వల్ల 1000 సంవత్సరాల క్రితం నుంచి ఇప్పటివరకు వున్న కార్మిక పరిస్థితులు, వాటిని చక్కబరచడానికి చేసిన శాసనాలను గురించిన సంగతులే మనకు తెలుస్తాయి. ఏదైనా ఒక ప్రత్యేకమైన కాలంలో ప్రత్యేక వర్గానికి చెందిన కార్మిక తరగతుల స్థితిగతులను గురించి, తెలుసుకోవడం కానీ, ఆ కాలాలనాటి కార్మిక శాసన పరిణామ దశలను కనుగోవడం కానీ దుస్సాధ్యం.

ప్రాచీన కాలంలో భారతీయులు తమ జీవితంలో, తమ సమయంలో హెచ్చు భాగాన్ని ఆధ్యాత్మిక విషయాలకు వెచ్చించినప్పటికీ భౌతిక విషయాలపట్ల కూడా వారు శ్రద్ధ చూపారు. వారు వ్యవసాయం, పరిశ్రమలు, వర్తక వ్యాపారాలు మొదలైనవాటిని తగువిధంగా అభివృద్ధిపరిచారు. అంతేగాక లలిత కళలను కూడా పెంపొందించారు.

మొహంజదారో, హరప్పా, కౌశాంబీ శిధిలాలలో బయల్పడిన అమూల్య వస్తు సంచయం ఆనాటి సాంస్కృతిక ఔన్నత్యాన్ని వెల్లడిస్తాయి. కమ్మరులు, కుమ్మరులు, వడ్రంగులు, నేతపనివారలు, శిల్పులు, తాపీపనివారు తదితరులు తమ తమ వృత్తి పనులలో నిపుణతను సంపాదించుకున్నారు. సామర్థ్యాన్ని పెంచుకున్నారు. వృత్తి పనివారలు, కళాకారులు సంఘాల నేర్పరుచుకొని తమ నిపుణతను పెంపొందించుకోవడానికీ, తమ ప్రయోజనాలను పరిరక్షించుకోవడానికి పూనుకున్నారు.

## ప్రాచీనకాలంలో వృత్తులు

ప్రాచీన భారతదేశంలో సమాజం, పూజారులు, యుద్ధరంగ యోధులు, వ్యవసాయదార్లు, వర్తకులు, కార్మికులు అనే కొన్ని వర్గాల క్రింద వారి వారి వృత్తుల ప్రాతిపదికపై విభజించ బడిందనే విషయం అందరికీ తెలిసిందే. ఈవిధంగా విభజన జరిగినప్పుడు కులాలు, తరగతులు అనేవి లేవనీ, వివిధ పనులు చేయడానికి జన్మ కారణభూతం కాదనీ విశ్వసించబడుతున్నది. ప్రజలందరూ జన్మతః సమానులే కాబట్టి వారు ఏ వృత్తిని చేపట్టడానికి కానీ ఎట్టి ఆంక్షలు, నిర్బంధాలు వుండరాదనీ అయితే అతడు స్వీకరించగోరే పనికి అతడు అర్హుడైతే చాలు ననీ, సమాజంలో ఏ వ్యక్తి అంతస్థు నైనా అతని పుట్టుకనుబట్టి గాక అతని చేష్టలను, ప్రవర్తనను బట్టి నిర్ణయించాలనీ చెప్పబడింది.

మన దేశంపై అనేక విదేశ దండయాత్రలు జరిగిన ఫలితంగా క్రమేపీ విశాల ప్రాతిపదికపై జరిగిన ఈ విభజన వెర్రితలలు వేసింది. వ్యక్తుల వృత్తి విషయాన్ని నిర్ణయించడానికి వారి పుట్టుకను పరిగణించాలనే వాదన ప్రబలరూపం దాల్చింది. దీనికి ఉన్నత తరగతుల వారి సంకుచిత దృక్పథమే కారణమైనట్లు పరిగణించబడుతున్నది.

ఈ ధోరణి క్రమంగా పుట్టుక ప్రాతిపదికపై కులాల ఏర్పాటుకు మార్గాన్ని ఏర్పరిచింది. శతాబ్దాల తరబడిగా ఈ పరిస్థితి చాలా అధ్వాన్న స్థితికి దిగజారుతూ పోయింది. శూద్రులను చదువడం, వ్రాయడం అభ్యసించనివ్వకుండా ముఖ్యంగా వేదాలు మొదలైన వాటిని పఠించనివ్వకుండా అమానుషంగా వారిపట్ల ప్రవర్తించడం జరిగింది. అంతేగాక వారిని కష్టతరమైన జీవితం గడుపుటకు ఆదేశించబడింది.

ఆ కాలంలో వైశ్యులు వర్తకం, వ్యవసాయం కూడా చేసుకునేవారు. కాని తరువాత తరువాత వర్తకంవల్ల వచ్చే లాభాలు వారి దృష్టి నాకర్షించాయి. అందుచేత వారా వృత్తిపై తమ దృష్టిని కేంద్రీకరింపజేసి తమ భూములను శూద్రులచేత, సేవకులచేత సేద్యం చేయించారు. తమ పశువులనుకూడా వారిచేతనే కాయించారు. శూద్రులు వ్యవసాయ క్షేత్రాలలో, ఇండ్లలో పని పాటలు చేయడానికి మాత్రమే నియోగించబడినప్పటికీ యాజ్ఞవల్క్యుడు, తన స్మృతిలో, వారు వడ్రంగం, శిల్పాలు చెక్కడం, నృత్యాలు, సంగీతం వంటి వృత్తులను చేపట్టినట్లు పేర్కొన్నాడు. జాతకాలను బట్టి శూద్రులు బట్టలు నేయడం, భవన నిర్మాణాలు జరపడంతో పాటుగా చాకలి, కుమ్మరి, మంగలి పనులు చేసినట్లూ, ఊడ్పు పని చేసినట్లూ, ఇండ్లలో సేవకులుగా పని చేసినట్లు కూడా తెలుస్తున్నది. ప్రభుత్వానికీ, పారిశ్రామిక, వ్యాపార సంస్థలకూ, ఇంటి పనులకూ కాయకష్టం చేసేవారి అవసరం కలిగింది. ప్రభుత్వం శూద్రులను ఊడ్పు పనులు మొదలు, సిపాయి ఉద్యోగాల వరకు వివిధ పనులలో నియోగించింది. పారిశ్రామిక, వ్యాపార సంస్థలు నిపుణతలు గల పనివారలను, నిపుణత లేని పనివారలను వినియోగించుకొన నారంభించాయి. ప్రజల నాగరిక జీవితంవల్ల శూద్రులు అనేకమైన వృత్తులు అవలంబించ నారంభించారు. ఆ యా ప్రత్యేకమైన వృత్తి పనులు చేసే వారంతా ఒక ప్రత్యేక కులం వారుగా ఏర్పడ్డారు. వారు చేసే పని వంశ పారంపర్యంగా వారి వృత్తిగా రూపొందింది. ఆర్యులు, అనార్యుల మధ్య గల విభేదాలు క్రమంగా సమసిపోయాయి. అనార్యులు ఆర్యులుగా మారడానికి ఎట్టి నిర్బంధాలు లేకుండా పోయాయి. శ్రీ కె. ఎం. ఫణిక్కర్, "భారతదేశ చరిత్ర పరిశీలన" అనే తమ గ్రంథంలో, ఈ మార్పుకు అనుసరించాల్సిన విధానం సామవేదంలో "వ్రత్యస్థోమ"లో ఉదహరించ బడినదని వ్రాశారు.

నిపుణత గలవారూ, నిపుణత లేనివారూ అనేకమంది కార్మికులు తయారవ్వడం వలనా, వీరంతా కొన్నికొన్ని షరతులతోనూ నిబంధనల తోనూ వృత్తి రీత్యా ఒక ప్రత్యేకమైన కులానికి చెందడం వలనా, ఈ కార్మికులు యజమానులచేత పీడింపబడడం వలనా యీ సమస్యను సంఘ శ్రేయస్సు దృష్ట్యా పరిష్కరించి, కార్మికులకు యజమానులకు మధ్య సామరస్యాన్ని కలిగించవలసిన అవసరం ఎంతయినా వున్నది. ఎంతోమంది న్యాయశాస్త్ర కారులు, ఆర్థిక శాస్త్రవేత్తలు యీ సమస్యను విపులంగా పరిశీలించి యజమానులకు, కార్మికులకు సంబంధించిన అన్ని విషయాలమీదా కొన్ని కొన్ని షరతులనూ నిబంధనలనూ ఏర్పరచారు. అట్టి వారిలో 'అర్థ శాస్త్ర' కర్త కౌటిల్యుడు, 'నీతి శాస్త్ర' రచయిత శుక్రాచార్యుడు ముఖ్యమయిన వారు.

కార్మికులకు సంబంధించిన వివిధ విషయాలపై పూర్వకాలంలోని ఋషులు, విజ్ఞులు ఏర్పరచిన ఆయా సిద్ధాంతాలను గూర్చి ప్రస్తుతం నేను చెప్పడానికి ప్రయత్నిస్తాను. స్థలాభావంవల్ల పద్యాలను, ప్రకరణాలను యిక్కడ నేను ఉదహరించడంలేదు. ఇది కార్మిక సమస్యలను గూర్చి క్షుణ్ణంగా తెలుసుకోవడానికీ, పూర్వకాలంలో భారతదేశంలోని కార్మికుల స్థితిగతులను పరిశీలించి ప్రస్తుత కాలంలో కార్మిక సమస్యలపై ఒక దృక్పథాన్ని ఏర్పరచుకోవడానికీ ఉపయోగపడగలదని నేను నమ్ముతున్నాను. నిజానికి ప్రస్తుతం మనం చూస్తూవున్న

కాంట్రాక్టు పనులు, వేతనాల నిర్ణయం, జీతాల బట్వాడా, కుటుంబ సౌకర్యం, అదనపు సౌకర్యాలూ, పింఛనులూ, స్త్రీ, బాల కార్మికులూ, ప్రావిడెంటు ఫండ్, కార్మిక సమాఖ్యలు మొదలయిన కార్మిక సమస్యలన్నింటినీ పూర్వకాలపు న్యాయశాస్త్ర కర్తలూ, ఆర్థిక శాస్త్రజ్ఞులూ పరిశీలించారు.

## పని ఒప్పందం, వేతనాల నిర్ణయం

అధికారికి, సేవకునికి మధ్యగల ఒప్పందాన్ని గూర్చి కార్మికులు తెలుసుకోవలసి వుంటుందని కౌటిల్యుని అర్థశాస్త్రం తెలియజేస్తున్నది.

యాజ్ఞవల్క్యుడు కూడా పని ఒప్పందం సిద్ధాంతాన్ని అంగీకరించాడు. ఇరువర్గాలవారూ బేరమాడుకున్న తర్వాత వేతనం నిర్ణయింపబడాలని యీయన చెప్పాడు. అంతేగాక, ముందుగా వేతనాన్ని నిర్ణయించకుండా కార్మికుడిచేత పని చేయించే యజమానిని శిక్షించాలని కూడా అన్నాడు

ఒక కార్మికుడు పనిలో చేరడానికి ముందుగానే అతని వేతనం నిర్ణయింపబడాలనీ యాజ్ఞవల్క్యుని అభిప్రాయంతో నారదుడుకూడా అంగీకరించాడు. ముందుగా వేతనం నిర్ణయించకుండానే యజమాని కార్మికుడిని పనిలో పెట్టుకుంటే, ఆ కార్మికుడికి యజమాని ఆదాయంలో పదవ వంతు భాగాన్ని యివ్వవలసి వుంటుందని నారదుడి అభిప్రాయం.

బృహస్పతికూడా వేతనాల నిర్ణయంలో ముందుగా ఒప్పందం జరగాలని అంగీకరించాడు. వేతనాలను ప్రతి రోజూ, ప్రతి వారం, ప్రతి పక్షం, ప్రతి నెలా, ప్రతి త్రైమాసిక కాలానికీ, ప్రతి అర్ధ సంవత్సరం, ప్రతి సంవత్సరం చెల్లించాలనీ, అలా కాకపోయినా చివరకు పని పూర్తి అయిన అనంతరమన్నా చెల్లించాలనీ తెలియజేశాడు. వేతనాలు నిర్ణయించబడకుండానే పని చేసే కార్మికులకు యజమానుల ఆదాయంలో కొంత భాగాన్ని యివ్వాలనే అభిప్రాయాన్ని మాత్రం బృహస్పతి అంగీకరించలేదు. కార్మికునకు మూడవ వంతు భాగాన్నిగాని, అయిదవవంతు భాగాన్నిగాని యివ్వాలని ఆయన అన్నాడు. కార్మికుడికి తిండీ బట్టా యిస్తూవుంటే, యజమాని లాభాల్లో అయిదవ వంతు భాగాన్ని అతనికి యివ్వాలనీ, అవి యివ్వకపోతే మూడోవంతు భాగాన్ని యివ్వాలనీ ఆయన తెలియజేశాడు.

వేతనాలు ముందుగా నిర్ణయించబడలేదు గనుక, చేసిన పనిని బట్టీ, ఆ పనిని చేయడానికి పట్టిన సమయాన్ని బట్టీ, అప్పుడు వుండే రేటును బట్టీ వేతనం నిర్ణయించబడాలని కౌటిల్యుడు ప్రవచించాడు. వృత్తి పనులవారు, సంగీత ప్రవీణులు, వైద్యులు, హాస్యగాళ్ళు, వంట మనుషులు, మిగతా పనివారు తమంత తాముగా పనిచేస్తే, అట్టి వారికి మిగతా ప్రాంతాలలో ఎంత లభిస్తుందో అంతగానీ, నిపుణులు నిర్ణయించినంత గానీ చెల్లించవలసి వుంటుందని కౌటిల్యుడు తెలియజేశాడు.

శూద్రుని వేతనం నిర్ణయించేటప్పుడు అతని గుణాన్నీ, అతను చేయవలసిన పనినీ, అతనిమీద ఆధారపడిన వారి సంఖ్యనూ దృష్టిలో వుంచుకోవాలని మనువు సూక్తీకరించాడు.

పనివారిని బద్ధకస్తులు, మామూలువారు, ఉత్సాహవంతులు — అని మూడువర్గాలుగా విభజించాలన్నాడు శుక్రాచార్యుడు. బద్ధకస్తునికి పూర్తిగాతిండికి సరిపోనంత తక్కువ వేతనాన్ని యివ్వాలని, మామూలు పనివాడికి కటాకటిగా తిండీబట్టలకు సరిపడే వేతనం యివ్వాలని, ఉత్సాహవంతుడికి తిండీబట్టకు సరిపడగా యింకా మిగిలేట్టుగా ఎక్కువ వేతనం యివ్వాలని శుక్రాచార్యుడు వ్యక్తంచేశాడు.

వేతనాలలో కొంత కాలపరిమితికి యిచ్చే వేతనం, పనినిబట్టి యిచ్చే వేతనమని రెండు విధాలుగా వుంటుందని కూడా ఆయన వ్యక్తీకరించాడు. నియమితకాలంలో చేసిన పని ప్రాతిపదికగా కూడా వేతనం యిస్తారని ఆయన అభిప్రాయపడ్డారు.

కార్మికుల అవసరాలకు అనుగుణంగానూ, వారికి తృప్తి కలిగే విధంగానూ సాధారణంగా వేతనాలు నిర్ణయించబడ్తాయని శుక్రాచార్యుడు అన్నాడు.

అవసరాల ప్రాతిపదికగా వేతనాలు నిర్ణయించబడనిచో కార్మికుడు అసంతృప్తి చెందుతాడనీ, తత్ఫలితంగా యజమానికి శత్రువుగామారి, అవకాశవాదిగానూ, బాధ్యతారహితుడుగానూ తయారవుతాడని బృహస్పతి నుడివాడు.

స్వర్ణకారులు, రజకులు ఇతరవృత్తి పనివారలవంటి కొన్ని వర్గాలకు చెల్లించాల్సిన వేతనాలను అర్థశాస్త్రంలో నిర్ణయించడం జరిగినదని కౌటిల్యుడు అన్నాడు.

అయితే పనివాడు తనకుతానుగా పనిలోకి వచ్చినప్పుడు, అతను పనిలో నియమించబడకపోయినా వేతనం చెల్లించబడుతుందని ప్రాచీన న్యాయనిర్ణేతలు అన్నారు. అయితే తనకుతానుగా పనిలోకివచ్చిన వ్యక్తికి పని చూపలేక పోయినప్పుడు వేతనం చెల్లించాల్సిన అవసరంలేదని కౌటిల్యుడు నుడివాడు. అంతేగాక యజమాని నిర్దేశించిన స్థలంలో నిర్ణయించిన సమయంలో ప్రతి కార్మికుడు పనిచేయాలనీ, లేనిచో వేతనాలు ఇవ్వాల్సిన అవసరంలేదని కూడా ఆయన అన్నారు.

చేసిన పనినిబట్టి వేతనం ఇవ్వాలని యాజ్ఞవల్క్యుడు నిర్దేశించాడు.

ఎన్నడైనా ఒకరోజు యజమానికోర్కెపై ఒప్పందంతో నిమిత్తం లేకుండా అదనంగా పని చేసినచో ఆ పనిపై అదనపు వేతనం చెల్లించాల్సిన అవసరంలేదని కౌటిల్యుడు అన్నాడు. అయితే సెలవు రోజులలో ప్రత్యేక వేతనంపై కార్మికులను పనిచేయమని అడగ వచ్చునని ఆయన పేర్కొన్నారు.

*అలస్యంగా పనిలోకి రావడం:*

ఆలస్యంగా పనిలోకి వచ్చిన కార్మికుల వేతనంలో ¼శాతం మొత్తాన్ని తగ్గించవచ్చు. అంతేగాక యీ తగ్గింపుకు రెండింతలు జరిమానాకూడా వేయవచ్చుననీ, అయితే అతనికి అలవికాని కారణాలవల్ల పనిలోకి ఆలస్యంగా వచ్చేట్లయితే అటువంటి తగ్గింపులేమీ వుండవనీ కౌటిల్యుడు అన్నాడు.

*శలవుతో వేతనం — అనారోగ్యం:*

ఒక కార్మికుడు అనారోగ్య కారణంగా తనపనిని పూర్తిచేయక, ఆరోగ్యవంతుడైనాక తిరిగి ఆ పనిని పూర్తి చేసినట్లయితే అతని వేతనాన్ని పూర్తిగా చెల్లించాలనీ, ఆరోగ్యవంతుడైన తర్వాత కూడా ఆ పనిని పూర్తి ఛేయనట్లయితే వేతనం చెల్లించనవసరం లేదని మనువు అన్నాడు.

ఒకవేళ కార్మికుడు అనారోగ్యం, క్లిష్ట పరిస్థితులు, శారీరక బలహీనతల స్థితిలో ఉన్న, అతను పనిలోనికి రాకుండా సెలవు తీసుకో వచ్చుననీ, ఇతర కారణాలవల్ల పనిలోనికి రాలేనిచో అతని స్థానే పనిచేయడానికి మరో వ్యక్తిని తనకు మారుగా ఏర్పాటు చేయాలనీ కౌటిల్యుడు అన్నాడు.

శారీరకంగా అర్హుడు కాని వ్యక్తిని పనిలోకి రమ్మని నిర్బంధించకూడదని బృహస్పతికూడా నుడివాడు.

కార్మికునిఉద్యోగసేవ ఆధారంగా అతను అస్వస్థతగాఉన్న కాలంలో వేతనంతోకూడిన సెలవు ఇవ్వాలనీ, వారంరోజులకు తక్కువగా అస్వస్థతగాఉన్న కార్మికుని వేతనం నుంచి తగ్గింపులు చేయరాదనేది, శుక్రనీతి. వారం రోజులకన్నాఎక్కువకాలం అస్వస్థతగా ఉన్నచో అతని వేతనంలో ½ శాతం చెల్లించాలనీ, అయితే 5 సంవత్సరాలు పనిచేసిన వారికే ఇది వర్తిస్తుందనీ అన్నారు. కాని ఎట్టి పరిస్థితులలోనూ యీ అనారోగ్య పరిహారం ఆరునెలలకన్నా మించకూడదని ఆయన అన్నారు.

*పర్వదిన సెలవులు:*

రాత్రి, పగలు సమయాలలో కార్మికులకు తగినంత విరామసమయాన్ని ఇవ్వాలనీ, అత్యవసరమైన పని ఉంటే మినహా పండుగ దినాలలో వేతనంతో కూడిన సెలవు ఇవ్వాలనీ శుక్రాచార్యుడు నిర్దేశించాడు.

*సెలవు హక్కు:*

కార్మికునికి అనారోగ్యం సెలవుకుతోడు సంవత్సరానికి వేతనంతోసహా 15 రోజుల సెలవు ఇవ్వాలని శుక్రాచార్యుడు అన్నాడు.

*సమ్మెలు:*

కార్మికుడు వేతనం తీసుకున్న తర్వాత కూడా పనిచేయడానికి నిరాకరిస్తే అతనికి 12 పానాల జరిమానా విధించాలని కౌటిల్యుడు అన్నాడు.

కార్మికుడు అనారోగ్య కారణాలుగా మినహా తన విధి నిర్వహణకు నిరాకరిస్తే వేతనం కోల్పోవడమేకాక 4 గుంజాల జరిమానాకూడా చెల్లించాలని మనువుఅన్నాడు.

(సశేషం)

*సవరణ:* గత జూన్–జులై–ఆగస్టు నెలల 'ఆంధ్రప్రదేశ్' సంచికలలో ప్రకటించిన యీ సింగరేణి బొగ్గు గనులకు సంబంధించిన ప్రకటనలో టెలిఫోన్ నెంబర్లు 32766, 32271, 34775. తుది రెండు నెంబర్లకు మారుగా 32766, 44776 అని నెంబర్లు పొరపాటున పడినవి. ఈ సవరణకు పాఠకులు గమనించ గోరెదము.

—ఎడిటర్

# ఆధునికాంధ్ర నిర్మాతలు

—కె. ఈశ్వరదత్



కాంగ్రెసు సంస్థ పూజ్యశ్రీ దాదాభాయ్ నౌరోజీ నాయకత్వంలో "స్వరాజ్య" సంపాదనకు దీక్షబూనిన నలభై ఏండ్ల తరువాత 1947 వ సంవత్సరంలో భారతావని స్వాతంత్ర్యం పొందినట్లే, 1913 వ సంవత్సరంలో శ్రీ బి. ఎన్. శర్మ నాయకత్వాన బాపట్లలో ప్రథమంగా ఆంధ్రరాష్ట్ర స్థాపనకు ఉద్యమించిన నలభై సంవత్సరాల పిమ్మట ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం—మొట్టమొదటి భాషా ప్రయుక్త రాష్ట్రంగా—అవతరించింది. తమ ప్రీతిపాత్రమైన స్వరాష్ట్ర వాంఛ సిద్ధికై ఆంధ్రులు సాగించిన దీర్ఘకాల పోరాటంలో, నిరాడంబరులైన శ్రీ పొట్టి శ్రీరాములు ఆత్మార్పణం సమోజ్జ్వలమైన చరమఘట్టం. పిమ్మట 1953 వ సంవత్సరంలో ఆంధ్ర ప్రజా జీవితంలో ఇతర ప్రముఖులు ప్రధాన భూమిక వహించారు.

ఒక దశాబ్దానికంటే తక్కువ ప్రాయపుదైన ఇప్పటి ఆంధ్రప్రదేశ్ కన్న ఆధునిక ఆంధ్రదేశం చాలా పురాతనమైనది. కేవలం ఒక భావనగా ఇది ఒకప్పుడు ఉదాత్తమైనదిగా, ఎంతో గణనీయమైనదిగా వుంది. దీని 'నిర్మాతలు' ఆంధ్రరాష్ట్ర నిర్మాతలమని చెప్పుకునే వారివలె రాజకీయవాదుల కోవకు మాత్రమే చెందిన వారుకారు. వారు తమ జీవితంలో ఎంతో విస్తృతమైన ప్రయోజనాలను ఆశించారు. నిజానికి, తమ మాటల ద్వారా వర్తమాన తరంవారిని ప్రభావితులను జేయగలిగినవారు మాత్రమే వాస్తవంగా మహోన్నతమైన 'నిర్మాతల' కోవకు జెందుతారు.

## వీరేశలింగం - వెంకటరత్నం

'సంఘ సంస్కరణోద్యమపిత' శ్రీ రామమోహన్ రాయ్ స్థూలంగా భారత దేశానికి ఎలాంటి వారో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆంధ్రావనికి అలాంటి వారు. శ్రీ వీరేశలింగంగారు 1848 వ సంవత్సరంలో జన్మించారు. ఆయన ఎంతమాత్రం రాజకీయవాదికారు. అయినప్పటికీ ఆయన కాలంనాటి రాజకీయవాదులుకానీ లేదా ఆ తరువాతి వారు కానీ ఎవ్వరూ కూడా సాహిత్యంలో నైతేనేమి, జీవిత పథంలో నైతేనేమి మార్గగామిగా ఆయనతో సాటిరారు. సాహితీ ద్రష్టగా, సంఘ సంస్కర్తగా శ్రీ వీరేశలింగం గారు జరిపిన మార్గదర్శకమైన కృషికి ఆంధ్రావని ఋణపడివుంది. సంఘ సంస్కర్తగా స్త్రీ జనోద్ధరణకూ, హరిజనోద్ధరణకూ పాటుపడ్డారు. వితంతు స్త్రీలకు పునర్వివాహాలు జరిపించారు. శ్రీ వీరేశలింగంగారు జన్మతః సంస్కర్త. సంస్కరణోద్యమాలలో ఆయనకు తోడునీడగా వుంది ఆయన స్థిర సంకల్పం, ఆయన ఆత్మవిశ్వాసం మాత్రమే.

ఆంధ్ర దేశంలో సాంఘికంగా చైతన్యం కలిగించిన వారిలో శ్రీ వీరేశలింగం తరువాతివారు శ్రీరఘుపతి వెంకటరత్నం నాయుడుగారు. ఆయన "నాయుడుగారు"గా సుప్రసిద్ధులు. శ్రీ నాయుడుగారు శ్రీ వీరేశలింగంగారి సన్నిహిత సహచరులు. వీరేశలింగంపంతులుగారు తెలుగు పండితులైతే వెంకటరత్నంనాయుడుగారు ఆంగ్ల భాషాకోవిదులు. పంతులుగారు గోల్డ్‌స్మిత్‌వలె గొప్ప రచయితే గాని వక్తకారు. శ్రీ వెంకటరత్నంనాయుడిగారి ఆంగ్లభాషాశైలి మధురమైనది. వారు గొప్ప వక్తకూడా. వాక్చాతుర్యంలోనూ, మానవత్వంలోనూ, అంతేగాక పోలికలో కూడా ఆయన డాక్టర్ జాన్సన్‌ను స్ఫురింపజేసేవారు. ఆయన ఆజన్మాంతం సంస్కర్తగా సేవచేశారు. విద్యావేత్తగా మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షత వంటి ఉన్నత పదవుల నలంకరించారు. కొంతకాలం మద్రాసు శాసనమండలి సభ్యులుగాకూడా వున్నారు. అయితే ఈ సభ్యత్వంవల్ల ఆయనేమంత ప్రయోజనకరమైన పాత్ర

వహించ లేకపోయారు. ఆయన తమ జీవితాన్ని సేవా ధర్మానికి అర్పితం చేశారు. ఆయన ఒక తరంవారి నైతిక ప్రమాణాలను పెంపొందించి శాశ్వత యశస్సు నార్జించారు

'దక్షిణ రాష్ట్రంలోని మాకు శ్రీ వీరేశలింగం, శ్రీ వెంకటరత్నం గారల జీవితాలు (వారి సన్నిహిత మిత్రుడు వర్ణించినట్లుగా) దేదీప్యమానంగా వెలుగొందుతున్న ఒకే గోళంలోని రెండు భాగాలవంటివి. వీరేశలింగంగారు ధీరోదాత్తులు. వెంకట రత్నం గారు మహాజ్ఞాని. ఒకరు తమ పరిశుద్ధమైన ఆదర్శంతో, కార్యాచరణ కాంక్షతో, మరొకరు సాధుత్వమైన తమ ఆదర్శంతో, ఆరాధనా ధ్యేయంతో కృషిచేస్తున్నారు. ఒకరు ప్రజాశక్తిని నడిపించడానికి ప్రయత్నిస్తుంటే వేరొకరు కాంక్షలను మలచడానికి పరిశ్రమిస్తున్నారు. ఈ నక్షత్రద్వయం దక్షిణ దిజ్మండలాన్ని ఉగ్రూత లూగించాయి. ఇంకా చాల కాలం వరకూ ఆ ప్రకారం చేస్తూవుంటాయి.'

## సుబ్బారావు పంతులు, రామచంద్రరావు

ఆంధ్ర ప్రజా జీవితంలో న్యాపతి సుబ్బారావు పంతులుగారిని మించిన ప్రధానవ్యక్తి లేరు ఆంధ్రదేశంలోన్యాయవాదిగా ఖ్యాతిగడించిన వారిలో ఆయన ఒకరు. తమ 22వ ఏటనే ఆయన మరోముగ్గురితో కలిసి "హిందూ"ను స్థాపించారు. 1898 వ సం. లో మద్రాసులో జరిగిన కాంగ్రెసు మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా వున్నారు. 1913 వ సం. నుంచి 1917 వ సం. వరకు కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. కాంగ్రెసులో ఆయన ఎప్పుడూ అగ్రనాయకులుగానే వున్నారు. అయితే ఆ సంస్థ అధ్యక్షపీఠాన్ని మాత్రం అలంకరించలేకపోయారు. మంట్ ఫోర్డ్ శకానికి పూర్వం వున్న నలుగురు ప్రఖ్యాత శాసన కర్తలలో వీరుఒకరు. వెనుకటి ఇంపీరియల్ శాసన మండలిలోని ప్రముఖులలో ఒకరు ఆంధ్రోద్యమ సారధులలోకూడా శ్రీ సుబ్బారావుగారు ఒకరు. ఎంతో అనుభవశాలులు. ఆయన ఉత్తరోత్తరా మార్పుజెంది కాలపరిమాణాల కనుగుణ్యంగా సంచరించారు. ఆంధ్రదేశ ప్రముఖులుగా తమ స్థానాన్ని సుస్థిరం చేసుకున్నారు.

శ్రీ సుబ్బారావుగారి తరువాతి సమకాలికులలో మన ప్రజాజీవితంలో మోచర్లరామచంద్రరావుగారంత అధికంగా మరెవ్వరూ గౌరవ పాత్రులు కాలేదు. అయితే శ్రీ రామచంద్రరావుగారికి సత్కారాలు అందకుండా పోయాయి. అందుకు వారి లోపమేమీలేదు. శ్రీ బి. యన్. శర్మ, కూర్మా వెంకటరెడ్డిగారలు వాటిని పొందారు. కేవలం పరిగణన అంటూ లభించనంత మాత్రాన శ్రీ రామచంద్రరావుగారి గౌరవానికి ఏమీ భంగం వాటిల్లలేదు. ఆయన వినయ భూషణుడు. హుందాగలవ్యక్తి. వ్యక్తిగత జీవితంలోగానీ, రాజకీయ జీవితంలోగానీ ఆయనకు శత్రువు అంటూ ఎవ్వరూలేరు. ప్రజ్ఞాపాటవంలో అద్వితీయమైన వ్యక్తి. దక్షిణాపథంలోనేగాక సమస్తభారతదేశంలోనే ఆయన ప్రఖ్యాత శాసనకర్త. మాలవియా, జిన్నాలవలె పరస్పర వ్యతిరేకులైన నాయకులకు ఉభయులకుకూడా ఒకేవిధంగా ఇష్టుడైన వ్యక్తి ఆయన.

శ్రీ రామచంద్రరావుగారి పేరు, ఆయన ప్రదర్శించిన అద్భుత ప్రతిభా విశేషాలవలన కలకాలం నిలిచి వుంటుంది.

## పానగల్ రాజా

భారత జాతీయతావాదం వికాసంపై బ్రాహ్మణ వ్యతిరేకోద్యమం ప్రభావం (అయితే దుష్ప్రభావాలే అనుకోండి) ఎలా వున్నప్పటికీ దక్షిణ భారతంలో మాత్రం ఈ ఉద్యమం ప్రభావం వుండటంలో చారిత్రికంగా ఔచిత్యం కనిపిస్తుంది. జస్టిస్ పార్టీ సంస్థాపకులు శ్రీత్యాగరాయచెట్టి. శ్రీ కూర్మా వెంకటరెడ్డి ఈపార్టీ ముఖ్యులు. కాని వీరిలో ఎవ్వరికీ కూడా పానగల్ రాజా అంతటి వ్యక్తిత్వం లేదు. రాజనీతిజ్ఞుడుగా కూడా పానగల్ రాజా గణుతికెక్కారు. ఆయన ప్రతిభాశాలుడైన ముఖ్యమంత్రి. పంజాబు ముఖ్యమంత్రి అయిన ఫజ్లీ హుస్సేన్ తరువాత పేర్కొనదగినవారు. ఆయన బ్రాహ్మణ వ్యతిరేకి, అయినప్పటికీ బ్రిటిషు ప్రయోజనాలకు విరుద్ధంగా భారతీయుల ప్రయోజనాలను పరిరక్షించడానికి ఆయన ఎప్పుడూ వెనుదీయలేదనేది సుప్రసిద్ధమే. దక్షిణ భారత జనాభాలో సుమారు 97 శాతం మంది ప్రజలు తమ సంఖ్యాబలం ఆధారంగా అనాదిగా బ్రాహ్మణులు అనుభవిస్తున్న ఆధిక్యతను సవాలుచేసి సఫలం కెందారంటే ఆ ఘనత పానగల్ రాజావారిదే.

## హనుమంతరావు, గోపాలకృష్ణయ్య

తమకాలంనాటి సంఘ జీవితంపై చెరగని ముద్రవేసిన ఆంధ్రదేశపు ప్రముఖ ఆదర్శ పురుషులు హనుమంతరావు, గోపాల కృష్ణయ్యగారలు. వీరు సుగుణ భూషణులు, ప్రజ్ఞా దురంధరులు. దురదృష్టవశాత్తు వీ రుభయులూకూడా అకాల మృత్యువు వాత బడ్డారు. వీరు విద్యావంతులు. అయితే వీరిద్దరివలె పరస్పర భిన్నులైన వ్యక్తులు మరొకరుండరు.

శ్రీ కోపల్లి హనుమంతరావు ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపకులు. ప్రిన్సిపాల్ కూడా. ఆయన జాతీయ విద్యావిధానంవ్యాప్తికి ఒరవడి పెట్టిన ఘనుడు. ఆంధ్రలో నవ్య జీవనానికి దోహదం చేసిన మహానుభావుడు.

శ్రీ హన్మంతరావుగారు నిరాడంబరులు, ప్రవక్త.

శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గొప్ప విప్లవవాది. ప్రజానీకంలో చైతన్యాన్ని కలిగించి బ్రహ్మాండమైన తిరుగుబాటు జరిపారు. శ్రీ గోపాలకృష్ణయ్య సుందర స్వరూపులు. గొప్ప ప్రజోద్యమాలలో ఒక దానికి చిహ్నప్రాయంగా ఒకప్పుడు ఆయన గెడ్డం పెంచారు. ఆయన దృక్కులలో మెరుపు గోచరమయ్యేది. ' ప్రతిధ్వనించే ఆయన కంఠనాదం విన్నప్పుడు ప్రజావాహిని, ఉప్పెనలా సాగివచ్చేది. ఆంధ్రదేశ ఐతిహాసక పురుషులలో ఆయన ఒకరు

శ్రీయుతులు హనుమంతరావు, గోపాలకృష్ణయ్య గారలలో ఒకరు ఆదర్శ వాదానికి ప్రాముఖ్యత నివ్వగా మరొకరు ఉద్వేగానికి ప్రాధాన్యత నిచ్చారు.

## వెంకటప్పయ్య, నాగేశ్వరరావు

దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు వీరుభయులకంటే ప్రసిద్ధులు సుబ్బారావుపంతులు తరువాత పేర్కొనదగిన వారు 1920 వ సం లో శ్రీ సుబ్బారావు పంతులు, శ్రీ రామచంద్రరావుగారలు కాంగ్రెసు సంస్థను వీడిపోయారు. శ్రీ బి. ఎన్. శర్మ విక్టరీ ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యులు అయ్యారు. శ్రీ పట్టాభి సీతారామయ్య ఇంకా గాంధేయ కార్యక్రమాల అధ్యయన, పరిశీలనలోనే వున్నారు శ్రీ ప్రకాశం ఇంకా ఖ్యాతిలోకి రాలేదు. ఆ కాలంలో భారత జాతీయోద్యమ బావుటాను అలరారింప జేసినది శ్రీ వెంకటప్పయ్య పంతులుగారే. ఆంధ్రదేశంలో ఆయన ప్రప్రథమ గాంధీవాది. ఆయనకు త్యాగంచేయడం కొత్తఏమీకాదు.న్యాయస్థానాలను బహిష్కరించడానికి పిలుపురావడానికి చాలాకాలం పూర్వమే ఆయన తన న్యాయవాద వృత్తిని త్యజించి ప్రజోద్యమానికి పూర్తికాలాన్ని వినియోగించారు. ఎన్నో సత్కార్యాలు చేయడంతోపాటు "కృష్ణా పత్రిక"ను స్థాపించారు. అయితే ఆయన సృజనాత్మకమైన మేధావికారు. శ్రీ వెంకటప్పయ్య అకలంకమైన ప్రజాసేవకుడు. ఆయన గాంధీజీకి ప్రేమపాత్రుడైన ఆంధ్ర కాంగ్రెసు నాయకుడు. ప్రజల గౌరవాభిమానాలను మిక్కిలిగా చూరగొన్న నాయక శిఖామణి ఆయన.

దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు సర్వజనుల ప్రేమాభిమానాలను బడసిన ఆంధ్ర నాయకులలో అగ్రగణ్యులు. కేవలంస్వీయప్రతిభతో ఉన్నతికి వచ్చిన ప్రతిభాశాలి. ఆయనకు ఐశ్వర్యం ఎప్పుడూ గర్వకారణం కాలేదు దాతృత్వానికి ఆయన ఏప్పుడూ వెనుదీయలేదు ఆయన ఔదార్యం సద్భావం అన్ని వర్గాలవారికీ, అన్ని అంతస్థులవారికీ ప్రీతిపాత్రుణ్ణి చేశాయి. ఆయన శ్రీమంతులకు మిత్రుడు కావడంతో పాటుగా మందభాగ్యులకు బాంధవుడుకూడా అయ్యారు. సాహిత్యం, కళల అభివృద్ధికి ఆయన ఎంతగానో చేయూతనిచ్చారు ఎన్నోసంస్థలు. ఎందరో వ్యక్తులు ఆయన సహాయం పొందారు. మహాత్మునిపట్లా కాంగ్రెసు సంస్థపట్లా ఆయన అకుంఠితమైన భక్తి విశ్వాసాలు ప్రదర్శించడంవల్లనే, ప్రజాసేవకులపట్ల ఔదార్యం చూపడంవల్లనే ఆంధ్రదేశం స్వరాజ్యోద్యమంలో అంతటి ప్రముఖపాత్ర వహించ గలిగింది. నిర్మాణాత్మకమైన కృషిలో అంతటి పురోగతిని సాధించ గలిగింది. ప్రజా శ్రేయస్సుకు ఎన్నో మేటికార్యాలు చేసిన త్యాగధనుడుగా ఆయనపేరు ఎల్లకాలం నిలిచి వుంటుంది.

## పట్టాభి, ప్రకాశం

ఆంధ్ర కాంగ్రెసులో డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య, శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారలను మించిన మహానాయకులు లేరు. వారుభయుల లక్ష్యాలు, ధ్యేయాలు ఒక్కటే అయినప్పటికీ వారు రాజకీయంగా సహచరులుగా కంటే వైరులుగానే వ్యవహరించారు. వీరిద్దరిలో ప్రకాశం పంతులు వృద్ధులు. కాని రాజకీయంగా శ్రీ పట్టాభి ప్రథములు.

శ్రీ ప్రకాశం ప్రజాజీవితంలో ప్రవేశించే టప్పటికే, ప్రత్యేకాంధ్ర రాష్ట్రనిర్మాణోద్యమ నాయకుడుగా శ్రీ పట్టాభి ప్రసిద్ధిజెందారు. 1917 వ సంవత్సరంలో ఆయన డాక్టర్ బీసెంట్‌తో జరిపిన చర్చలు చరిత్రాత్మకమైనవి. అప్పుడే ఆయన కాంగ్రెసు పటంలో ఆంధ్రను మద్రాసు నుంచి విడగొట్టడానికి నాంది వేశారు డాక్టర్ పట్టాభి దేశంలోని మేధావంతులలో గణనీయులు. ఆయన వాగ్ధోరణి అనర్గళమైనది అనేక ప్రసిద్ధ సంస్థల ఆవిర్భవానికి ఆయన కారకులు. ఒక్క చేతిమీదుగా ఆయన ఇంగ్లీషులో వారపత్రిక నడపడం నుంచి వాణిజ్య బ్యాంకును నిర్వహించడం వరకు ఎన్నో గొప్పకార్యాలు చేయగలిగారు ఆయన జ్ఞాపకశక్తి అత్యద్భుతమైనది. పెక్కు సంఘటనలను, సంఖ్యావివరాలను తడుముకోకుండా తేలికగా చెప్పగలిగే వారు ఆయన కాంగ్రెసు చరిత్రకారుడు గాంధీతత్వానికి భాష్యకారుడు కూడా. స్వతంత్ర భారతావనిలో కాంగ్రెసు అధ్యక్షపీఠాన్నలంకరించిన ప్రథమ నాయకులు ఆయన. సంస్థానాలలో నవచైతన్యాన్ని తెచ్చిన వారిలో, ప్రజామండలాలలో కాంగ్రెసు పతాకాన్ని ప్రతిష్ఠింపజేసిన వారిలో ఆయన అగ్రగాములు. గవర్నరుగా ఆయన రిటైరయ్యారు: ఆయన ప్రతిభాసామర్థ్యాలకు ఆయన అదృష్టం దీటురాలేదు

ప్రకాశం రాజకీయాలలోకి ఆలస్యంగా ప్రవేశించారు. మద్రాసు న్యాయవాదులలో

ఆయన ప్రముఖులు. కాని అల్లాడి కృష్ణ స్వామి అంతగా ఆయన ఆవృత్తిలో రాణించలేదు. "స్వరాజ్య" అనే పత్రికను స్థాపించి సుమారు ఒక దశాబ్దం పాటు దానికి సంపాదకత్వం వహించారు. దాని నిర్వహణకు సర్వస్వాన్నీ ఒడ్డారు. కాని శ్రీ ప్రకాశం జర్నలిస్టుగా చింతామణితో సాటిరారు. మోతీలాల్ నెహ్రూ హయాములో ఆయన కేంద్ర అసెంబ్లీ సభ్యులుగా వున్నారు కాని తనకు పూర్వపువాడైన మోచర్ల రామచంద్రరావుకన్న ఆయన మిన్న కారు. మద్రాసు ముఖ్యమంత్రిగా ఆయన తనకు పూర్వం ఆ పదవిని నిర్వహించిన రాజాజీవలె ప్రసిద్ధి గాంచలేదు. ప్రకాశం అసాధారణమైన ప్రజ్ఞా దురంధరుడు కారు. ఆయన రాజకీయ చతురత పరిమితమైనది. అయినప్పటికీ ఆయన పరాజయాలు కానీ, పరిమితమైన ఆయన శక్తిసామర్థ్యాలు కానీ ఏవీ కూడా ఆయన ఘనతకు అడ్డంకులు కాలేదు. వ్యక్తిగత త్యాగంలో ఆయనతో పోల్చదగిన వారు ఒక్క చిత్తరంజన్ దాసు మాత్రమే. ధైర్య ప్రదర్శనలో ఆయన శ్రద్ధానంద స్వామిని తలపింపజేస్తారు. అజేయమైన శక్తి సంపదలో ఆయన సుభాస్ చంద్ర బోసుకు సాటివస్తారు. గంభీరమైన ఆయన వ్యక్తిత్వమే ఆయనకు ఒకగొప్ప సంపద. ఆయనది కేసరివంటి హృదయం. సహజంగానే ఆయనఆంధ్ర రాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రి అయ్యారు.సుమారు నాలుగు దశాబ్దాలపాటు ఆంధ్ర దేశానికి నాయకాగ్రేసరుడుగా భాసిల్లారు. ఆంధ్రదేశ చరిత్రలో కాంగ్రెసు సంస్థను గడగడలాడించిన ధీశాలుడుగా శ్రీ ప్రకాశం కీర్తించ బడతారు.

## సి. ఆర్. రెడ్డి

ఆంధ్రదేశ చరిత్రలో శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి వంటి మేధాసంపన్నులు అరుదు. ఆయన తన కార్యరంగాలలో ఎల్లప్పుడూ అందరి మద్దతునూ,ఉత్సాహాన్నీ పొందలేక పోయారు. రాజకీయంగా ఆయన చాలా వ్యక్తిత్వం వున్నవారు.విద్యారంగంలో స్వేచ్ఛావర్తనుడు. ఆయనతో ఏ వేదిక పై కూడా ఎవ్వరూ నెగ్గుకొని వచ్చేవారుకారు. కేంబ్రిడ్జిలో చదువుకుంటున్న రోజుల్లోనే శ్రీ రెడ్డి గోఖలేదృష్టిని ఆకర్షించారు. "బర్క్ వంటి వాక్పటుత్వము, బుద్ధికుశలతలు గల" భారతీయునిగా సర్ జాన్ సైక్స్వర్ ప్రశంసలను కూడా ఆయన పొందారు. ఆయన సాధించిన విజయాలు ఏవిధంగా కూడా ఉపేక్షించదగ్గవి కాకపోయినప్పటికీ అవి ఆయన సామర్థ్యానికి తగ్గట్టుగా లేవు. శ్రీ రామలింగారెడ్డి తెలుగులో సుప్రసిద్ధ పండితులు. విమర్శకులు. ఇంగ్లీషులో మంచివక్త.

## చింతామణి, రాఘవేంద్రరావు, పున్నయ్య

ఆంధ్రదేశం వెలుపల, తాము స్థిరపడిన రాష్ట్రాల ప్రజా జీవితంలో ప్రముఖపాత్ర వహించి, ఆ రాష్ట్రాల నిర్మాతలలో ప్రఖ్యాతి గాంచిన ముగ్గురు ఆంధ్ర ప్రముఖులను గురించి తెలుసు కుందాము. వీరిలో ఒకరైన శ్రీ సి. వై. చింతామణి యు. పి. లో, మరొకరైన శ్రీ ఇ. రాఘవేంద్రరావు సి. పి. లో మూడవవారైన శ్రీ కె. పున్నయ్య సింధ్‌లో ప్రజా సేవ, దేశ సేవ చేశారు.

అలహాబాద్‌నుంచి వెలువడే "లీడర్" అనే పత్రికకు శ్రీ చింతామణి 30 సంవత్సరాలపాటు ప్రధాన సంపాదకులుగా వున్నారు. ఆయన జ్ఞాపకశక్తి అద్భుతమైనది. సేవా పరాయణత అకుంఠితమైనది ఆయన న్యాయ తత్పరత,స్వాతంత్ర్యాభినివేశం మహోన్నతమైనవి కనుకనేసామ్యుయెల్ హోరే రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులో చింతామణికంటే మరెవరైనా కాంగ్రెసు అతివాది వుండదాన్ని వాంఛించాడు. మంట్ ఫోర్డ్ హయాములో యు. పి. మంత్రిగా ఆయన చరిత్రను సృష్టించారు, యు. పి. లో ప్రజాజీవితాన్ని తీర్చిదిద్దిన ప్రముఖులలో పండిత మాలవ్య తరువాత పేర్కొనదగినవారు శ్రీ చింతామణి మాత్రమే.

శ్రీ రాఘవేంద్రరావు వృత్తిరీత్యా బారిస్టరు. సహజ స్వభావరీత్యా రాజకీయ వాది ఆయన మేధాసంపన్నుడు. చాలాకాలం పాటు సి. పి. రాజకీయాలలో కీలకపాత్ర వహించారు. ఆయన ఒకప్పుడు కాంగ్రెసు సంస్థలో వున్నారు. తరువాత దానిని వీడారు. ఆయన ఆ సంస్థలోవున్నా లేకపోయినా ఆయనశక్తి అప్రతిహతమైనది. కాంగ్రెసు వాదిగా మంత్రిత్వాన్ని నిర్వహించగా ఆ సంస్థలో లేకుండా గవర్నరు పదవి నధిష్ఠించారు. సి. పి ప్రభుత్వ భవనంపై బ్రిటిషు వారి బావుటా రెపరెప లాడుతుండగా తన గాంధీటోపీని తీసివేయకుండా అలాగే వాడిన తొలి భారతీయ గవర్నరుగా శ్రీ రాఘవేంద్ర రావు చరిత్రకెక్కారు. వైస్రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యుడుగా ఆయన క్రిప్సును ఎదిరించి చరిత్ర సృష్టించారు. ఆయన అకాలమృత్యువు వాతబడ్డారు. యు. పి. లో చింతామణి వలెనే సి పి. లో ఆయన దివ్యస్మృతులను వదిలివెళ్లారు.

కోటంరాజు సోదరులలో శ్రీ పున్నయ్య అగ్రజుడు. ఆయన కరాచీలో పాత్రికేయుడుగా ఖ్యాతి జెందారు. పశ్చిమోత్తర ప్రాంతంలో ఆయనపట్ల అత్యంత గౌరవ భావం వుంది. పాకిస్తాన్ ఏర్పడనిపూర్వం సింధ్‌ను తీర్చిదిద్దిన ప్రముఖులలో ఒకరుగా ఆయన కీర్తిగాంచారు. దేశవిభజనకు బలైనవారిలో ఈయన ఒకరు కావడం విచారకరం.

(మిగతా 37 వ పేజీలో)

# సంగ్రహ ప్రకటనలు

1955 వ సం. పు ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) ఇనాముల (అసెస్మెంట్) చట్టం, 1956 వ సం. పు ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) ఇనాముల (రద్దు, మార్పిడి, రైత్వారీ) చట్టం క్రింద స్థిరీకరించిన శిస్తురేట్ల ప్రకారం అధికరేట్లలో శిస్తులుచెల్లించవలసి వస్తున్న చిన్న ఇనాముల ఇనాందార్లు లేక రైతులు తమకు కలుగుతున్న ఇబ్బందులను గురించి తమ ప్రాంతానికి సంబంధించిన అసిస్టెంట్ సెటిల్మెంట్ ఆఫీసరుకు 1963 ఫిబవరి 28వ తేదీలోగా వ్యక్తిగతంగా, దరఖాస్తులద్వారా విన్నవించుకోవచ్చునని ప్రభుత్వం 1962 డిశంబరు నెలలో విడుదలచేసిన ఒక పత్రికా ప్రకటనలో తెలిపింది. ఆయా ప్రాంతాలలో అమల్లోనున్న సెటిల్మెంటు రేట్లస్థాయికి వారుచెల్లించే అధిక శిస్తురేట్లను తగ్గించే విషయంలో తగు చర్యలు తీసుకోవడానికి వీలుగా ఈ విధంగా పంపుకునే దరఖాస్తులలో ఆయా ఇనాము భూములపూర్తి వివరాలనూ; తమకు కలుగుతున్న ఇబ్బందులు, తాము పొందగోరే సహాయాలను గురించిన వివరాలనూ స్పష్టంగా పేర్కొనాలని కూడా ఆ పత్రికా ప్రకటనలో ప్రభుత్వం కోరింది

దరఖాస్తులను దాఖలు చేయడానికిగాను ఇచ్చిన గడువు చాలదనీ, కాబట్టి 1963 అక్టోబరు 31 వ తేదీ వరకు ఈ గడువును పొడిగించాలనీ కోరుతూ ప్రభుత్వానికి విజ్ఞాపనలు అందాయి. వీటిని పురస్కరించుకొని ప్రభుత్వం, ఇలాంటి దరఖాస్తులను ఆయా అసిస్టెంట్ సెటిల్మెంట్ ఆఫీసర్లకు దాఖలు చేయవలసిన గడువును 1963 అక్టోబరు 31 వ తేదీ వరకు పొడిగించింది. ఈ తేదీ తరువాత మళ్ళీగడువు పొడిగించడం గానీ, నిర్ణీత గడువు తరువాత వచ్చే దరఖాస్తులను పరిశీలించడంగానీ జరగదని రైతులు గమనించవలసిందిగా కోరడ మవుతున్నది.

### ఉప్పుడుబియ్యం ఎగుమతి

1963 వ సం.పు స్వచ్ఛంద ధాన్యసేకరణ పథకంలో పాల్గొన్న మిల్లుయజమానులకూ, వర్తకులకూ, భారత ప్రభుత్వం ఎప్పటికప్పుడు నిర్ణయించే ఎగుమతికోటాల ననుసరించి రాష్ట్రప్రభుత్వం ఎప్పటికప్పుడు అనుమతించగల లేదా అనుమతించిన కోటాల మేరకు ఆంధ్ర ప్రదేశ్‌నుంచి పశ్చిమ బెంగాలుకు ఉప్పుడుబియ్యాన్ని ఎగుమతి చేయడానికిగాను తమ తమ అధికార పరిధులలో పర్మిట్లు జారీ చేసేందుకు తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాల ధాన్యం కొనుగోలు అధికార్లకూ, గుంటూరు, వరంగల్ లధాన్యం కొనుగోలుతహశీల్దార్లకూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధికారం ఇచ్చింది.

### సహకార చక్కెర ఫ్యాక్టరీల కమిటీ

సహకార చక్కెర ఫ్యాక్టరీల కమిటీ సభ్యుడుగా ఆర్థికశాఖ కార్యదర్శి స్థానే ఆర్థిక శాఖ సంయుక్త కార్యదర్శిని నియమిస్తూ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. లోగడ జారీచేసిన ఉత్తర్వులకు సవరణగా ప్రభుత్వం ఇప్పుడు ఈ ఉత్తర్వు చేసింది

సహకార చక్కెర ఫ్యాక్టరీల సాంకేతికాధికారి, ఇకమీదట ఆరు వారాలకు ఒక పర్యాయం ఏదేని సహకార చక్కెర ఫ్యాక్టరీలో ఫ్యాక్టరీల ప్రతినిధులతో మండల సమావేశాలను ఏర్పాటు చేయడానికికూడా ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

సహకార చక్కెర ఫ్యాక్టరీల సంఘం ఇకనుంచి ప్రతినెలా గాక నాలుగు నెలలకు ఒకపర్యాయం సమావేశ మవుతుంది.

### ప్రత్యేక బొట్‌రైట్ గ్రాంట్లు

కరీంనగర్ (దక్షిణ) టెక్కలి, మెదక్, వరంగల్ (తూర్పు) నెల్లూరు (దక్షిణం), కడప (దక్షిణం), చిత్తూరు, కాకినాడ, కడప (ఉత్తరం), నిజామాబాదు (పశ్చిమం) డిప్యూటీ రిజిస్ట్రార్ల సర్కిళ్ళలోని వ్యవసాయ పరపతి సంఘాల స్పెషల్ బేడ్‌డెట్ రిజర్వులకు1963-64సంలో రూ.1,81,888ల మేరకు బొట్‌రైట్ గ్రాంట్లు చెల్లించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది. ఈ మొత్తంలో ఆంధ్ర ప్రాంతానికి రూ. 86,615/-లు తెలంగాణా ప్రాంతానికి రూ. 95,273/-లు మంజూరు చేయబడినవి.

### వృత్తి పనివారల శిక్షణ

వృత్తిపనివారల శిక్షణ వ్యవస్థను సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరు అధీనంలోనుంచి తీసివేసి ఉద్యోగ సాధకశాఖ డైరెక్టరు అధీనంలో వుంచడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. ఉద్యోగ సాధక సర్వీసు, వృత్తిపనివారల శిక్షణా పథకాల మధ్య మంచిగా సమన్వయాన్నిసాధించే తలంపుతో ప్రభుత్వం ఈ నిర్ణయం గైకొన్నది.

ఈ మార్పును 1963 సెప్టెంబరు మొదటి తేదీలోగా అమలు పరచడానికి వీలుగా తగు చర్యలు తీసుకోవలసిందిగా సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరునూ, ఉద్యోగ సాధక శాఖ డైరెక్టరునూ కోరడం జరిగింది.

### ఖరీఫ్ ఉద్యమానికి స్వల్పకాలిక ఋణాలు

1963 ఖరీఫ్ ఉద్యమ సందర్భంలో వ్యవసాయ దార్లకు రూ. 20 లక్షల మేరకు స్వల్పకాలిక ఋణాలు పంపిణీ చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది.

ఈ ఋణం మొత్తాన్ని వివిధ జిల్లాలకు దిగువ విధంగా కేటాయించారు :-

శ్రీకాకుళం రూ. 3.50 లక్షలు; విశాఖ పట్నం రూ. 3 లక్షలు, అనంతపురం రూ. 3 లక్షలు, కడప రూ. 2 లక్షలు, హైద్రాబాదు రూ. 1.50 లక్షలు, నల్గొండ రూ. 2 లక్షలు, ఆదిలాబాదు రూ. 1.50 లక్షలు, మెదక్ రూ. 2 లక్షలు, ఖమ్మం 1.50 లక్షలు.

### క్రీడాకారులకు ప్రయాణ రాయతీలు

పరిగణించబడిన అఖిలభారత క్రీడా సంస్థలు నిర్వహించే జాతీయ ఛాంపియన్ షిప్ టోర్నమెంటులలో పాల్గొనే వారికి ప్రయాణ రాయతీలు ఇచ్చే పద్ధతిని తిరిగి కొనసాగించడానికి రైల్వేబోర్డు నిశ్చయించింది. దేశంలో క్రీడా కార్యకలాపాలను అభివృద్ధిపరిచే ఉద్దేశంతో ఈ నిర్ణయం గైకొన బడింది.

ఈ ప్రయాణ రాయతీలు దిగువపేర్కొన్న క్రీడలకు వర్తిస్తాయి :-

హాకీ, క్రికెట్, ఈత, వాటర్ పోలో, ఎథెలెటెక్స్, వాలీబాల్, బాడ్మింటన్, బాల్ బాడ్మింటన్, కుస్తీలు, (ఒలంపిక్, భారతీయ పద్ధతులు) టెన్నిస్, టేబిల్ టెన్నిస్, బాస్కెట్ బాల్, కబడ్డీ, వెయిట్ లిఫ్టింగ్, అంగసౌష్ఠవపోటీలు, జిమ్నాస్టిక్స్, పోలో, బాక్సింగ్, స్క్వాష్, సైక్లింగ్, గోల్ఫ్, రైఫిల్ షూటింగ్, యాచ్టింగ్.

జాతీయ అత్యవసర పరిస్థితి దృష్ట్యా రైల్వేల ఆదాయాన్ని పెంచేందుకూ, రైళ్లలో రద్దీ ఏర్పడకుండా వుండేందుకూ 1963 జనవరి మొదటి తేదీన రైల్వేబోర్డు క్రీడాకారుల బృందాలకూ, నాటక, సాంస్కృతిక బృందాలకూ వర్తింపులోనున్న అనేక రాయతీలను ఉపసంహరించుకోవడం జరిగింది. ★

# కమ్యూనిటీ రేడియో సెట్లు

ఆంధ్రప్రదేశ్ లో దిగువ తెల్పిన గ్రామాలలో సంస్థలలో 1963 జూన్ నెలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పడం జరిగింది.

*మహబూబునగర్ జిల్లా*: రాయపాకుల, కమాలొద్దీన్ పురం.

*కడప జిల్లా* : చిన్నంపల్లి, పెండ్లిమర్రి, పొన్నంపల్లి.

*విశాఖపట్నం జిల్లా* : బొండపల్లి, కింద మగ్రహారం, అలుగోలు, గోరపుడి, రాజకోడూరు, జగ్గన్నపేట, తాళ్ళపాలెం, అమీన్‌సాహెబుపేట, తీడ, పెదగోగ డాగ్రహారం, కె. మెట్టపాడు, భీములిపట్నం బేసిక్ రక్షణ పాఠశాల

*శ్రీకాకుళం జిల్లా* : నీలయ్యవలస, అజ్జారం, చుక్కవలస, గంగన్నపాడు, పెదచామనపల్లి, మెట్టవలస, మల్లంపేట (పాత్రేరు సమీపం), గంగిరేవువలస, గొల్లాలములగం, పాలవలస, సోమలింగాపురం, పనసభద్రం, కరసవలస, బలాద, పోత్నూరు, వోని, యల్. లక్ష్మీపురం, బుర్జాల (సింగిడి), పైలాడ, అల్లిన,వొమ్మి, పొత్తంగి, మరువాడ, కొల్లిపాడు, బైపల్లి అక్కుపల్లి.

*తూర్పుగోదావరి జిల్లా* ; కానుపూరు II (రాజనగరం).

*కృష్ణా జిల్లా* : కాంద్రపాడు, ఇబ్రాహీం పట్నం.

*గుంటూరు జిల్లా* : చేబ్రోలు VII, చేబ్రోలు VIII.

*ఖమ్మం జిల్లా* :-ఖమ్మంలోని సమాచార కేంద్రం.

*వరంగల్లు జిల్లా* :. సోమవరం.

*నిజామాబాదు జిల్లా* : చెంగల్లు. ★

---

(35 వ పేజీ తరువాయి)

### డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్

ఇప్పటివరకు నేను పేర్కొన్న (నా అభీష్టానుసారమే అనుకోండి) ప్రముఖులలో సజీవులు ఎవ్వరూలేరు. మన మధ్య వుండి స్వకీయమైనమహోన్నతశిఖరాగ్రంపై నిలిచివున్న మహావ్యక్తి ఒక్కరు మాత్రం వున్నారు. సుదూర ప్రదేశాలలోని విశ్వ విద్యాలయాలకూ, మారుమూల రాజధానులకూ విజ్ఞాన దీపికను గొనిపోయిన విద్యావేత్తగా, ప్రాక్పశ్చిమాలను పరస్పరం అవగాహన చేయడంలో ఆరితేరిన గొప్ప వేదాంతిగా, మహావక్తగా, ప్రపంచాధి నేతలలో అత్యంత గౌరవనీయుడైన రాజనీతిజ్ఞుడుగా, మాధుర్యానికీ, వెలుగుకూ పర్యాయ పదమైనపేరు గల వ్యక్తిగా డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆయనకు ఆయనేసాటి. అన్ని కాలాలకు చెందిన ప్రసిద్ధ భారతీయులలో ఒకరుగా చరిత్రపుటలను అలంకరించగల వారుఒక్కరైనా వుండటం ఆంధ్రకు గర్వ కారణం. ★

# కొండవీరప్ప

రాచకొండ నరసింహమూర్తి

క్రమల నవ్వుపువ్వులు చిమ్ముకొంటూ కొండ వీరప్ప మంచం దగ్గిరికివచ్చి — 'వీరప్ప గారూ, కులాసాగా వున్నారా — గాయా లెలా వున్నాయి ?' అంది.

గాయాలకేమి ? బాగానే వున్నాయి. శత్రువులమీద నిప్పులు కక్కుతున్న కళ్ళ లాగా వున్నాయి. కాని యివి మెల్లమెల్లగా రంగుమారి నలుపుతిరిగి మూసుకుపోతూ చివరికి నీ కాటుక కళ్ళలాగా అయిపోతా యేమోనని భయంగా వుంది అన్నాడు కొండవీరప్ప ముసిముసి నవ్వులు నవ్వుతూ.

గండంలోవుండి గడుసు పోకడలు పోతున్న కొండవీరప్ప మాటలకి కమల సిగ్గుపడబోయి ఆ నల్లని కళ్ళతో నవ్వి ఊరుకుంది. అదిచూచి కొండవీరప్ప తెల్లని వెడదకళ్ళలో ఒక్కమారు వేయినల్లకలువలు విచ్చుకొన్నట్లయింది.

కమల తమాయించుకొని— తాను నరుసు నన్నమాట బాగా జ్ఞాపకం తెచ్చుకొని, కాసిని పాలు తాగుతారా ? అంది నిర్లిప్తంగా. 'పాలా, మా అమ్మ చిన్నప్పుడిచ్చిన పాలు రణరంగంలో వైరులను తరిమి తరిమి కొడుతూ పోరాడుతున్నంత సేపూ త్రేపులు వస్తూనే వున్నాయి. కావి గాయపడి ఈ ఆసుపత్రికి వచ్చాక త్రేపులురాలేదు. మళ్ళీ రెండురోజులనుంచి నిన్ను చూస్తున్నప్పటి ష్నుంచి త్రేపులు రావటం మొదలుపెట్టాయి—' అని కొండవీరప్ప గఖ్ఖున త్రేన్చాడు. కమలకు ఆపుకోలేనంత నవ్వు వచ్చింది. కష్టపడి ఆపుకొంది — కాని లోపలినుంచి శరీరమంతటనుంచి - నవ్వు పగలగొట్టు కొని బయటపడుతుందా అనిపించింది కమలకు సముద్ర తరంగంలాగా కమల సమస్త శరీరంలోపలనుంచీ ఉవ్వెత్తున లేస్తున్న ఆ నవ్వు పొంగు కొండప్ప గుండెల్లో ఉలికి ఊగింది. ఇద్దరూ కొంత సేపు ఊగి దోగిసలాడి కడలిలాగ పొంగి పొరలి చివరికి తమలోతాము యిమిడి సర్దు కొని గంభీరముద్ర ధరించి వుండిపోయారు. కాని గుండెల్లోపలినుంచి ఆ సముద్రపు హోరు వినిపిస్తూనే వుంది వారి చెవులకు. ఆ యిద్దరూ ఆ హోరు ఎంతసేపు వింటూ వున్నారో వారికే తెలియదు.

కమలకు తన కష్ట జీవితమంతా ఒక్క మారు మనస్సులో గిఖ్ఖునతిరిగింది. పడమటి నుంచి హోరున వీచిన సుడిగాడ్పులకు కమల బ్రతుకు తీగ మెలికలు పడిపోయింది. ఆ తీగ ఎంత సరిజేస్తేమాత్రం ఉద్యాన వనంలో పెరిగిన తీగలాగా ఎలావుంటుంది ; మరి — ఇలా మెలికలు పడ్డబ్రతుకు ఇక ఇంతేనా ? అహ, మనిషి మనస్సు అలా మెలికల బ్రతుకు బ్రతకటానికి ఒప్పుకోదు. శరీరం మెలికలు పడిపోతే దాన్ని తీర్చి దిద్దలేకపోవచ్చును గాని— మనసు మెలికలు పడితే వంకలుతీర్చి సరిజేసే వైద్యులకు ఏకాలంలోనూ లోపంలేదు. లేకపోతే - యీ మెలికలు సరిజేసుకోవాలనే తీవ్రకాంక్ష ఒక టుండాలి. వేడిగాడ్పులకువాడి, సుడిగాలిలో పడి, మబ్బులదాకా ఎగిరి, దభీమని నేలమీద పడి, అగాధమైన కొండలోయలోకి దొర్లి పోయి — సొమ్మసిలి — పడి — లేచిన కమలకు ప్రక్కనే మెల్లగా ప్రవహించి పోతున్న చల్లని సెలయేరు — మలయ మారుతంలాగా సోకింది. అమ్మయ్య — ఈ చల్లని - మెల్లని - సెలయేటి నీరుత్రాగి - యీ గుండెల్లో మంటలు చల్లార్చుకొంటా ననుకుంది కమల. వెంటనే ట్రైనింగయి, నరుసుగా చేరింది. ఇంతలో చైనా భారత దేశంమీద తిరికూర్చుని దాడి చేసింది. కమల గుండెల్లో మరఫిరంగులు ప్రేలి పిడుగులు విసిరాయి. అంతే. యుద్ధంలో గాయపడ్డ సైనికులకు సేవచేసి యీ బ్రతుకుతీగలోని మెలికలు సరిజేసుకోవాలనుకుంది కమల. ఇప్పుడు వీరసైనికులకు సేవచేస్తోంది. ఒక్కొక్క సైనికుడు ఒక్కొక్క దేవపురుషుడు లాగా కనిపిస్తాడు కమల కళ్ళకు. మానవ శరీరంతోచే దేవతలను చూడటమేకాక వారికిసేవచేసే అదృష్టం పట్టినందుకు తనకు తానే మెచ్చుకొంటుంది.

సైనికులు - భూలోకంలోని దేవపురుషు లనే భావం మనసుకురాగానే కమలకి ఘత్తు లోంచి మెఱుకువ వచ్చినట్లయింది. ఉలిక్కి పడి కళ్ళువిప్పి కొండవీరప్పకేసి చూచింది. అతడు కునుకుపట్టినట్టు పడుకొని ఉన్నాడు. భూలోకంలోకి వచ్చిన దేవతలుకూడా నిద్ర పోతారు కాబోలు. - అనుకొంది కమల. అవునుపాపం— స్వర్గంలోపుట్టి పెరగటంచేత నిద్రాసుఖమేమిటో ఈ మహనీయులకు తెలియదు. మానవలోకానికివచ్చి మానవ సుఖాలన్నీ అనుభవిస్తేనేగాని పరిపూర్ణత రాదుగామరి— యీ మాట తలపులోకి వచ్చిం దేమో - కమలముఖం కమలంలాగే ఎఱ్ఱ బారింది. సిగ్గుమొగ్గులు నెత్తావులు వెద జిమ్మాయి. కమల - తామరకొలనులాగా ఒక్క నిట్టూర్పు విడిచింది. కొండవీరప్ప కలత నిద్రలోనే మెల్లగా 'అమ్మా' అన్నాడు.

'బెడ్ నెంబరు డెబ్భైరెండు - వీరపుత్ర కొండవీరప్ప జాబువచ్చిందండీ' అంది మరో నరుసువచ్చి. ఏదీ ?- అని ఆతురపడి లేవబోయాడు కొండవీరప్ప. కమల పట్టు కొని పడుకో బెట్టింది. 'ఇదుగో ఉత్తరం - నేను విప్పి యిస్తాను చదువుకోండి' - అంది కమల.

'ఎవరు వ్రాశారు కమలా'

'మీ అమ్మగారు' అని ఉత్తరం చేతి కిచ్చింది నరుసు కమల.

'మా అమ్మ' అంటూ కొండంతగా పొంగిపోయాడు కొండవీరప్ప. అతని కను కొలకులవెంట సెలయేటి ధారలాగా - వెలు గులు చిమ్ముకొంటున్న కన్నీటిధారజారింది. కమల తుడిచింది. 'వద్దు కమలా—ఆ ధారలో ఆనంద కమలంమీద లక్ష్మిలాగా మా అమ్మ కూర్చుంది. కన్నీరు తుడుస్తున్న కమల ఆగిపోయి తన కన్నీరు తుడుచుకుంది. ఒక్క క్షణం ఇద్దరూ మౌనంగా ఉన్నారు.

కొండవీరప్ప మెల్లగా - 'కమలా — మా అమ్మ ఉత్తరం వ్రాసింది. నువ్వు చదివి వినిపించు - బాగుంటుంది. ఇప్పుడు నేను చదివేస్థితిలో లేనుగా' - అన్నాడు.

ఇది నా అదృష్టం - అనుకొంది కమల పెదవుల్లోనే.

కొంచెం ఆగి 'కాస్త పళ్ళరసం పుచ్చు కొంటారా — ఉత్తరం వినిపిస్తాను' — అంది కమల.

'నువ్వు ఉత్తరం వినిపిస్తుంటే నేను పళ్ళరసం త్రాగుతూ వున్నట్టే' - అన్నాడు కొండవీరప్ప. అతని చెక్కిళ్ళమీద చిరు నవ్వులు మెరిసి- కమల బుగ్గలమీద విచ్చు కొన్నాయి. క్షణమాగి ఉత్తరంవినిపించింది కమల.

"భారత వీరపుత్ర కొండవీరప్ప... బాబూ...'భారత వీరపుత్ర —' భారత ప్రభు త్వం నీకీ వీర బిరుదం ఇచ్చింది. భారత ప్రజా మాత కోటికోటి కంఠాలతో నీకు జేజేలుపెట్టి ఈ వీర బిరుదం ప్రసాదించింది. ఆ క్షణం నా బ్రతుకులో ఎంత గొప్పది. నీవు నా గర్భకోశంలో ప్రవేశించిన క్షణమంత



గొప్పది. కొండప్పా" ఇది నిన్ను కన్నతల్లి వ్రాస్తున్న ఉత్తరంకాదు — వీరమాత వ్రాస్తున్న ఉత్తరం. నీ విప్పుడు రణరంగంలో వున్నావు. వైరివీరులతో హోరాహోరిగా విజృంభించి పోరాడుతున్నావు. శత్రువుల గుళ్ళు — నీకు తగులుతాయి. రక్తం చిమ్ముతుంది. రక్తం కారుతుంది. నువ్వు లెక్క చెయ్యవు — రక్తం తుడుచుకొంటూ యుద్ధం చేస్తూనే ఉంటావు. శత్రువులు ఆ నీ భీకరాకారం చూసి భయపడి— గగ్గోలెత్తిపోతారు. రణరంగంలో వీరవిహారం చేస్తూన్న భీముణ్ణి చూచి కౌరవుల్లాగా పారిపోతారు. నీ ఒళ్ళంతా విరిసి విచ్చిపోయిన ముద్దమందారంలాగా వుంటుంది. గులాబితోటవంటి ఆ దృశ్యం [illegible]ళ్ళలో విరిసిపోతూవుంటే నేనిక్కడ [illegible]పోతూ వున్నాను. నా చిన్ననాటి [illegible] పండినిండిన యీనాటి నా అదృష్టం 'భారత వీరపుత్ర' వీరకొండప్ప — నీ తండ్రి మహావీరుడు — రాణాప్రతాప సింహునివంటి స్వాభిమాని. ప్రతాపరుద్రుని [illegible] ధైర్యశాలి. పృథ్వీరాజువంటి మహామూర్తి—

నా తొమ్మిదేళ్ళ వయస్సులో నీవు నా హృదయకోశంలో పడ్డావు. పది సంవత్సరాలు నిన్ను యీ హృదయగర్భంలో [illegible]పేను. ఆ పదేళ్ళలోనే నాలో — వామనమూర్తిలాగా — పుట్టగానే — పెరిగి పెద్దవై దుష్టసంహారం చేశావు — నాకు పద్దెనిమిదేళ్ళు వచ్చేనాటికే మా తలిదండ్రులు గతించిపోయారు. నేను అవివాహితగా ఉండిపోయాను. నేనెన్నడూ వెన్నెలకలలు కనలేదు — అగ్నిగుండాలవంటి కలలు — బ్రద్దలై — విడిపోతున్న అగ్నిపర్వతాల్లాంటి కలలు కన్నాను. ఆ కలల్లో నిన్ను చూస్తూ వుండేదాన్ని. నడివేసవిలో మండిపోతున్న సూర్యబింబంవంటి నీ రూపుచూచి నా కళ్ళల్లో అగ్నిసాగరాలు పొంగుతూండేవి — తండ్రీ, అదొక రుద్రసౌందర్యం. దక్షధ్వరంలో మహారుద్రుడు పెరికి విసరికొట్టిన పింగళాగ్ని జటాసౌందర్యం. వీరభద్రుని రౌద్రసౌందర్యం — నా కన్నెతనపునాటి కలలు విప్పుల [illegible] — నాకు ఎరుపులు విరిసిన కలలు — [illegible] రుద్రసౌందర్య మాధురులు సం[illegible].

ఆనాడు, కన్ను పొడుచుకున్నా [illegible]ని అమావాస్య చీకట్లు — నాకు [illegible] వెలుగుల్లాగా కనిపించేవి. లోకులు నను చూచి భయపడేవారు.—

అలా వుండగా — ఒకనాడు — విప్పులు చెరుగుతున్న వేసవిలో — చెప్పాను గా — పగటికి — రాత్రికి — నాకు తేడా తెలిసేది కాదని—అలాంటప్పుడు—ఒక మహావీరుడు— వైరివీరుల కత్తిదెబ్బలకు కాయలుకాచిన మేలిమేనివాడు — వెలుగుచీకట్ల వింతగిరులు పగలగొట్టుకొని — వచ్చి — నా యెదుట — సాక్షాత్కరించాడు. నేను రౌద్రానందంతో ఊగిపోయాను — ఆ మహాపురుషుడు — శివాగ్ని జ్వాలలాగా — నన్నావరించాడు.

దేవసేనాని కుమారస్వామికై — ఆరాటపడ్డ శివుని చూచి — పార్వతివలె — నాలోని మహాప్రకృతి — సౌరమండలం కంపించినట్లు — కంపించింది. అప్పుడు — ఇప్పటి — ఈ నీరూపం — నా గర్భకోశంలో ప్రవేశించింది. ఆ మహాపురుషుడు — నీ తండ్రి — 'మింటి మండి మింటికై లేచిన మహా మేఘమువలె'— నా కనుపాపల్లో అంతర్ధానమై పోయారు.

భారత వీరపుత్ర — వీరకొండప్పా — ఇది నీ జన్మగాథ. నీ కివే నా ఆశీస్సులు.

ఇట్లు

నిన్ను కన్నతల్లి.

ఈ వుత్తరం చదివి — వినిపించింది నరుసు కమల. వీరకొండప్ప లేచి కూర్చున్నాడు. కమల అతని పాదాలకు నమస్కరించి — పాదధూళి — నుదుటికి పూసుకొంది.

ఇంతలో రణభేరి మ్రోగింది —

వీరకొండప్ప కంఠధ్వని రణరంగంలో శత్రువులగుండెలు చీల్చి చెండాడుతున్నట్టు వినిపించింది కమలకు.

భారత వీరపుత్ర వీరకొండప్ప వక్షస్థలం కొండచరియవలె ఒరిగింది — తెల్లని వలువలతో — నరుసు కమల — తల అతని వక్షానికి ఆనించి — విలవిలపోయిన సెలయేటి ధారలాగ విచిత్రమాధురులు విరజిమ్మకొంది.



# ప్రభుత్వ నిర్ణయాలు

బొంబాయిలోని ఆంధ్ర విద్యా సంఘ భవననిధికి ఒక లక్ష రూపాయిలను విరాళంగా ఇవ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

[illegible]దు నగరం, కంటోన్మెంటు, దానిచుట్టు ప్రక్కల గల కొన్ని 'బెల్టు' ప్రాంతాలతో ప్రత్యేకంగా ఒక తాలూకాను ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది. కొత్త తాలూకా ఏర్పడటం వల్ల ప్రస్తుతం ముగ్గురు తాహశ్శీల్దార్ల అధికార పరిధులలో వున్న ఈ ప్రాంతాలు ఒకే తహశీల్దారు అధికార పరిధిలోకి వస్తాయి.

హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషను పరం చేయబడిన రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల జీతపు సెలవు, పెన్షను కంట్రిబ్యూషనుల క్రింద కార్పొరేషను నుంచి రాబట్టే మొత్తాలను కార్పొరేషను ఆదాయంలో 12½ శాతానికి గాక వాస్తవ మొత్తానికి పరిమితం చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

ఆంధ్రప్రదేశ్ సహకార అపెక్సు బ్యాంకుకు, 1963–64 వ సం. లో రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియానుంచి రూ. 5 కోట్ల ఋణం పొందే విషయంలో హామీగా వుండడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

ప్రభుత్వ ముద్రణశాల సహకార సంఘం, ఆంధ్రప్రదేశ్ సహకార అపెక్స్ బ్యాంకు నుంచి ఒక లక్ష రూపాయిల ఋణంపొందే విషయంలో హామీగా వుండడానికి కూడా ప్రభుత్వం నిశ్చయించింది. ✱



హైద్రాబాదులో 1963 ఆగస్టు 6వ తేదీన జరిగిన పార్లమెంటు సభ్యులు, శాసన సభ్యుల ప్రాంతీయ అధ్యయన శిబిరాన్ని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ప్రారంభించారు. [చూ–'వెలుగు బాటలు'.]

నల్గొండ జిల్లా దిండి ప్రభుత్వ పరిశోధన కేంద్రంలోని వంగతోట.



1963 ఆగస్టు 14వ తేదీన సికింద్రాబాదులో ఎన్. సి. సి. పెరేడు జరిగిన సందర్భంలో కళాశాల విద్యార్థులకు వర్తింపజేసిన నిర్బంధ సైనిక శిక్షణా పథకానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.



**అవార్డు పొందిన పోలీసు అధికార్లు :** ప్రశంసార్హమైన సేవలకుగాను పతకాలు బహూకరించబడిన తొమ్మండుగురు ఆంధ్రప్రదేశ్ పోలీసు అధికార్లకు, 1963 ఆగస్టు 15వ తేదీన సికింద్రాబాదులో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవ పెరేడు సందర్భంలో ముఖ్యమంత్రి పతకాలను అందజేశారు. ఇట్టి సేవలకుగాను హైద్రాబాద్ నగరం స్పెషల్ బ్రాంచ్ అసిస్టెంట్ పోలీసు కమీషనరు శ్రీ ధరణీధర్ పెర్షాద్ (పై చిత్రంలో ఎడమనుంచి 5వ వారు) కు రాష్ట్రపతి పోలీసు, ఫైర్ సర్వీసెస్ పతకం లభించింది. పతకాలు పొందిన మిగతా పోలీసు అధికార్లు వీరు: (ఎడమనుంచి కుడికి) (1) ఉత్తర విశాఖపట్నం జిల్లాలో పోలీసు సబ్-ఇన్‌స్పెక్టరుగా పనిచేసిన కీ॥ శే॥ జె. సూర్యనారాయణ భార్య శ్రీమతి రామాయమ్మ (ఈమె పతకం స్వీకరించారు), (2) శ్రీ డి. రామారావు, పోలీసు సబ్-ఇన్‌స్పెక్టరు, తూ. గో. జిల్లా, (3) శ్రీ పి. రాయన్న, డి. ఎస్. పి., నిజామాబాదు, (4) ఎస్. ఆర్. మెహతా, వ్రేలిముద్రల పరిశీలన సంస్థ డైరెక్టరు, హైద్రాబాదు, (5) ధరణీధర్ పెర్షాద్, [(6) శ్రీ ఎ. కె. కె. నంబియార్, ఐ. జి. పి., (7) శ్రీ శివకుమార్‌లాల్, అడిషనల్ ఐ. జి. పి.], (8) శ్రీ సి. ఆర్. రెడ్డి, కమాండెంట్, II బటాలియన్, ఏ. పి. ఎస్. పి., కర్నూలు, (9) శ్రీ ఏ. ఎం. జబ్బారుద్దీన్, డిప్యూటీ పోలీసు సూపరింటెండెంట్ (రిటైర్డ్), (10) శ్రీ ఎం. తిరుపాల్‌నాయుడు, అఫీషియేటింగ్ డి. ఎస్. పి., కరీంనగర్, (11) శ్రీ కె. సి. జ్ఞానానందుల శర్మ; పోలీసు ఇన్‌స్పెక్టరు, చిత్తూరు జిల్లా.



## ఆదిలాబాదు జిల్లా

*వన మహోత్సవం :*

జూలై 2వ తేదీన ఆదిలాబాదు కలక్టర్ ఆఫీసులో వన మహోత్సవం జరిగింది. అధికార, అనధికార ప్రముఖులు అనేకులు యీ ఉత్సవంలో పాల్గొన్నారు.

## అనంతపురం జిల్లా

*గ్రామసహాయకుల శిక్షణ శిబిరం :*

తనకల్లు పంచాయితీ సమితిలోని మేకల చెరువు గ్రామంలో జూలై 8వ తేదీనుండి మూడు రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణశిబిరం నిర్వహించబడింది. ఆధునిక వ్యవసాయ పద్ధతులలో ప్రత్యక్ష ప్రదర్శనలు యివ్వబడ్డాయి.

గ్రామీణ స్వచ్ఛంద సేవకదళ సభ్యులు గణనీయమైన శ్రమదానం చేశారు. వీరు కంపోస్టు గోతులను త్రవ్వడంతోపాటు సమీపంలో గల రోడ్డును మరమ్మతు చేశారు.

*గ్రామీణ స్వచ్ఛంద సేవకదళాలపట్ల ఆసక్తి.*

పుత్తూరు పంచాయతీ సమితి పరిధిలో 1963 జూలై నెలలో సుమారు 1500 మంది గ్రామీణ స్వచ్ఛంద సేవకదళాలలోనూ, 10,170 మంది రక్షణశ్రామిక బ్యాంకుల లోనూ తమ తమ పేర్లను నమోదు చేసుకున్నారు. రక్షణశ్రామిక బ్యాంకు సభ్యులు వివిధరకాల అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొన్నారు.

*పాఠశాల భవనం :*

కల్లూరుగ్రామ పంచాయతీ రూ. 7,500 ఖర్చుతో ఒకపక్కా పాఠశాల భవనాన్ని నిర్మించే పనిలో నిమగ్నమై వుంది. ఈ డబ్బును విరాళాల రూపంలో సేకరించారు.

## చిత్తూరు జిల్లా

1963 జూలైలో నగరి పంచాయతీ సమితిలో సవరించబడిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమం ప్రవేశ పెట్టబడింది. ఆధునిక వ్యవసాయ పద్ధతులను ప్రచారంచేయడానికి గాను 1,074 మణుగుల రసాయనిక ఎరువులను రైతులకు పంపిణీ చేయడం జరిగినది. పురోగాములైన రైతులు యీ ఎరువులను ఉపయోగించుకున్నారు. దీనికితోడు 1151 మణుగుల మేలుజాతి విత్తనాలను కూడా యీ రైతులు ఉపయోగించు కున్నారు.

*కేంద్ర ఋణాల్లో పెట్టుబడి:*

జూలై నెలలో మదనపల్లి పంచాయతీ సమితిలోని ఆయా వ్యక్తులూ, సంస్థలూ కలిపి రూ.13,500లను కేంద్రం ఋణాలలో పెట్టుబడిగా పెట్టారు.

*కట్టల నిర్మాణం:*

మాచిరెడ్డిగారిపల్లి, అంగల్లు, అంకిసెట్టి పల్లి గ్రామాలలో ఖారీఎత్తున కట్టలనిర్మాణం సాగుతున్నది. ఇంతవరకూ 500 ఎకరాలకు పైగా పొలాల్లో కట్టలు నిర్మించ బడ్డాయి.

రెండు మంచినీటి బావులనుకూడా నిర్మించడం జరిగింది.

## గుంటూరు జిల్లా

*రసాయనికపు ఎరువులు:*

ఈమని పంచాయతీ సమితిలో రైతులకు జూలై నెలలో 14 అధునాతన వ్యవసాయ పరికరాలను యివ్వడంతోపాటు 3465 మణుగుల రసాయనిక ఎరువులను పంపిణీ చేశారు. ఎనభై రెండు వ్యవసాయ ప్రదర్శనలు నిర్వహించబడ్డాయి. 3,227 టన్నుల గ్రామ కంపోస్టును భద్రపరచడంతోపాటు 131 పౌనుల క్రిమిసంహారక ఔషధాలను పంపిణీ చేయడం జరిగినది.

*మంచిపద్ధతిలో సాగు:*

జపాను వరిసాగు పద్ధతిలో 2536 ఎకరాల నేలను సాగులోకి తీసుకురావడం జరిగింది.

*3-రోజుల శిక్షణ శిబిరం:*

పిడుగురాళ్ళ పంచాయతీ సమితిలోని కేసనపల్లి గ్రామంలో జూలై 29 నుండి మూడురోజులపాటుగ్రామసహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడినది. దగ్గర దగ్గర 40 మంది సహాయకులు వ్యవసాయం, పశుచికిత్స, సహకారం, కుటీర పరిశ్రమలు మొదలయిన వాటిలో శిక్షణ పొందారు.

*రోడ్డు నిర్మాణం:*

గ్రామీణులు అరఫర్లాంగు దూరం మట్టి రోడ్డును శ్రమదానంతో నిర్మించుకున్నారు. దీనికితోడు గ్రామంలో ఒక పాఠశాల భవనాన్ని నిర్మించడానికి రూ. 2,180 ల మొత్తాన్ని విరాళాలద్వారా సేకరించారు.

**ప్రగతి పథంలో**

## కరీంనగర్ జిల్లా

*ఆదర్శ పంచాయతీ:*

ముత్యంపేట గ్రామ పంచాయతీని 1962_63 సం. కాలానికి సమితిస్థాయిలో ఉత్తమ పంచాయతీగా నిర్ణయించారు. మల్లైల్ బ్లాకు సమితి అధ్యక్షుడు జూలై 22 వ తేదీన రూ. 1,000 లను ముత్యంపేట సర్పంచ్‌కు బహూకరించారు.

*నూనెగానుగ సంఘం:*

మల్లైల్ పంచాయతీ సమితిలోని వివిధ గ్రామాలకు చెందిన 24 మంది సభ్యులతో బ్లాకుస్థాయిలో నూనెగానుగ సంఘం ఒకటి జూలై ఆఖరి వారంలో మల్లైల్‌లో స్థాపింపబడినది ఈ సంఘం 240 రూపాయల ప్రారంభపు పెట్టుబడితో ప్రారంభించబడినది.

*సాంద్ర వ్యవసాయ కార్యక్రమం:*

ఈ జిల్లాలో 1963 ఖరీఫ్ కాలంనుండి, మొత్తం 21 బ్లాకులకూ 15 బ్లాకులలో సాంద్రవ్యవసాయ కార్యక్రమం అమలు జరుగుతున్నది. ఈ కార్యక్రమం అంచలవారీగా జరుపబడుతుంది 1963_64కాలంలో 45 శాతం గ్రామాల్లో ముఖ్యమైన పంటలు పండించడం జరుగుతుంది. ఆ తరువాత 70 శాతం గ్రామాలకు దీనిని వర్తింపజేస్తారు. 1965_66 సం. కాలంలో యీ కార్యక్రమం మొత్తం గ్రామాలన్నింటినీ ఆవరిస్తుంది.

## ఖమ్మం జిల్లా

*కేంద్రఋణంపై ఆసక్తి:*

ఇల్లెందులోని ఉత్సాహవంతులైన ప్రజలు ఇటీవలి కేంద్రఋణంలో రూ. 20,000లను పెట్టుబడి పెట్టారు. జాతీయ పెట్టుబడిని అధికం చేయడానికీ, కనీసం 5,000 కుటుంబాలనన్నా పొదుపు చేసేట్టు చేయడానికీ ఒక ఉద్యమాన్ని నిర్వహించాలనికూడా ఉద్దేశించబడినది.

## కృష్ణా జిల్లా

*సాంద్రవ్యవసాయ పథకం:*

కృష్ణా జిల్లాలో యీ దిగువ పేర్కొన్న 18 బ్లాకులలోనూ సాంద్రవ్యవసాయ కార్యక్రమం అమలు పరచడానికి ఉద్దేశించబడినది. (1) తోట్ల వల్లూరు; (2) గొల్లపూడి; (3) గూడూరు; (4) బంటుమిల్లి; (5) అవనిగడ్డ; (6) చల్లపల్లి; (7) కూచిపూడి; (8) కైకలూరు; (9) మండవల్లి; (10) గుడివాడ; (11) మోటూరు; (12) గన్నవరం, (13) వీరవల్లి; (14) పామర్రు; (15) ఉయ్యూరు; (16) మైలవరం; (17) విస్సన్నపేట; (18) కంచికచర్ల

*పైలట్ పథకం:*

మేలుజాతివిత్తనాలను నమోదయిన ఉత్పత్తిదార్ల ద్వారా పంపిణీ చేయడానికిగాను గుడివాడ పంచాయతీ సమితిలో పైలట్ పథకం ప్రవేశపెట్టబడినది.

## కర్నూలు జిల్లా

*మేలుజాతి విత్తనాల పంపిణీ:*

ఆదోని బ్లాకులో జూలై నెలలో రైతులకు 3810 మణుగుల మేలుజాతి విత్తనాలను, 296 టన్నుల రసాయనిక ఎరువులను, 2150 మణుగుల గానుగపిండిని, 280 పౌనుల క్రిమిసంహారక ఔషధాలను పంపిణీ చేయడం జరిగినది

*బావుల శుద్ధి*

108 మందికి ప్రాథమిక టీకాలనూ, 1493 మందికి రెండవసారి టీకాలనూ వేయడంతోపాటు 126 మందికి కలరా నిరోధకటీకాలు వేయబడ్డాయి ఇరవైయేడు బావులు క్లోరినుమందు జల్లి శుద్ధిచేయబడ్డాయి.

పరిశ్రమలకు సంబంధించినంతవరకు, కర్నూలులోని ప్రాంతీయ గ్రామీణ వృత్తులను, శిక్షణ కేంద్రంలో శిక్షణ పొందుటకు ఒకవ్యక్తి డిప్యూటు చేయబడ్డాడు

## నల్గొండ జిల్లా

*ప్రత్యేక శిక్షణ:*

మునుగోడి పంచాయతీ సమితి సర్వెల్లు గ్రామంలో ఆగస్టు మొదటివారంలో మూడు రోజులపాటు వ్యవసాయానికి సంబంధించిన అంశాలపై ప్రత్యేకమైన గ్రామసహాయకుల శిక్షణశిబిరం నిర్వహించబడినది వివిధ గ్రామాలకుచెందిన సుమారు 60 గ్రామ సహాయకులు యీ శిక్షణ శిబిరంలో పాల్గొన్నారు.

## నిజామాబాదు జిల్లా

*పైలట్ పథకం:*

జిల్లా పరిషత్తుస్థాయీ సంఘం నెం. 2 జూలై 28 వ తేదీన సమావేశమై, పంట విత్తనాలను నమోదయిన గిడ్డంగుల ద్వారా పంపిణీ చేయడానికి బన్స్వాడా బ్లాకును ఎన్నిక చేసింది.

ఆహారోత్పత్తిపథకం క్రింద రసాయనిక ఎరువులకై స్థాయీసంఘంవారు మొత్తం రూ. 2,70,000 ల మేరకు ఋణాలను మంజూరు చేశారు.

## వరంగల్లు జిల్లా

*జపాను వరిసాగు పద్ధతి:*

జూలైనెలలో పర్కాల సమితిలో 149 ఎకరాలను జపాను వరిసాగు పద్ధతిక్రింద సాగులోకి తీసుకుని రావడంతోపాటు, 2609 మణుగుల రసాయనిక ఎరువులను రైతులకు పంపిణీ చేయడం జరిగినది. సాంద్ర వ్యవసాయ పథకాన్ని అమలు జరపబడే బ్లాకులలో పర్కాల సమితికూడా ఉండడం వలన, అందుకు సంబంధించిన సర్వే పనులు ముందుగా చేపట్టబడ్డాయి.

జూలై 9 వ తేదీన బ్లాకు ప్రధాన కార్యాలయంలో వనమహోత్సవం జరుప బడినది.

*రక్షిత మంచినీటి సరఫరా:*

వరంగల్లు జిల్లా పరిషత్తు, ఆగస్టు రెండో వారంలో జరిగిన సర్వసభ్య సమావేశంలో ములుగు, కొర్వి, వెలేరు, జంగలపల్లి, ఇనుగుర్తి, హసన్‌పర్తి, గీసగొండ, బుచ్చన్నపేట, పర్కాల్, శ్యామ్ పేటలకు రక్షిత మంచినీటిని సరఫరా చేసేవిషయమై చేసిన ప్రతిపాదనను అంగీకరించినది.

*పురోగతి సమీక్ష:*

ప్రస్తుతం నాలుగు పంచాయతీ సమితుల లోనూ అమలు పరచబడుతున్న పైలట్ పథకం పురోగతిని, జిల్లాలో సవరించబడిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమం అభివృద్ధినీ ఈసమావేశంలోసమీక్షించడంజరిగింది. ★

# నేఫాలో నవశకారంభం

ఉన్నత పర్వతశ్రేణినానుకొని వున్న ఆ కుగ్రామంలో ఒక కొండజాతి బాలుడు తన కొయ్య కీలుబండితో ఆడుకుంటున్నాడు. అతని ఆనందానికి అంతులేదు.

ఆ బాలుని తల్లిదండ్రులు గానీ, తాత ముత్తాతలుగానీ వారి బాల్యంలో యిట్టి కీలు బొమ్మలతో ఆడుకొని వుండరు; చూసి వుండరు కూడాను నేఫాలో కానవస్తున్న మార్పులకు యిదొక నిదర్శనం.

క్షుద్బాధనూ, లేమినీ నిర్మూలించడానికి, నేఫా ప్రజల శ్రేయస్సౌభాగ్యాలను పెంపొందించడానికి అక్కడ నిరంతర కృషి జరుగుతోంది.

## జీవిత విధానం

25 విభిన్న కొండజాతులు నివసించే యీ పర్వతప్రాంతం అనాదిగా ఏకాకిగా వుంటూ వచ్చింది. ప్రకృతి శక్తులను ఎదుర్కొంటూ వారు ఒక ప్రత్యేకమైన జీవన విధానాన్ని రూపొందించుకున్నారు.

ఆ కొండజాతి ప్రజలకు నీతి నియమాలున్నాయి. ఆత్మవిశ్వాసం మెండు ఎప్పుడూ ఆనందంగా వుంటారు

అయితే, వారు ఏకాకిగా వుండడం వల్ల, మైదాన ప్రదేశాలలో నివసించే ప్రజలకువలె వారికి విస్తృత ప్రపంచ దృక్పథం అలవడ లేదు. సాంకేతిక విజ్ఞాన ఫలితాలు వారికి అందుబాటులో లేకుండా పోయాయి.

నేఫా ప్రజల సంప్రదాయాలలో జోక్యం కలిగించుకోకుండా, వారి జీవిత విధానాన్నీ, సంస్కృతిని గౌరవిస్తూ, వారికి నాగరక జీవన సౌఖ్యాలపట్ల గల వ్యతిరేకతను నెమ్మదిగా పోగొట్టి, ఆ ప్రాంతం కూడా దేశంలోని తక్కిన ప్రాంతాలవలెనే అభివృద్ధి సాధించేటట్లు చూసేందుకు నేఫా పాలక సంస్థ కృషిచేస్తోంది

## అభివృద్ధి ప్రణాళికలు

రాకపోకల సౌకర్యాల పెంపుదల, విద్యాభివృద్ధి, వ్యవసాయోత్పత్తి పెంపుదల, ఆరోగ్యరక్షణ వీటికి నేఫా అభివృద్ధి ప్రణాళికలలో ప్రత్యేక ప్రాముఖ్యం యివ్వబడింది

రవాణా, కమ్యూనికేషన్ సౌకర్యాల పెంపుదలకు నేఫా తృతీయ పంచవర్ష ప్రణాళికలో రూ 2 05 కోట్లు కేటాయించారు. గతంలో నేఫా ఏకాకిగా వుండిపోవడానికి కారణం కమ్యూనికేషన్ సౌకర్యాలు లేకపోవడమే.

మొదటి రెండు ప్రణాళికలలోనూ నేఫాలో 780 మైళ్ళ నిడివైన రోడ్లూ, కంచర గాడిదలు వెళ్ళడానికి వీలైన 654 మైళ్ళ నిడివైన రోడ్లూ, 3,389 మైళ్ళ కాలి బాటలూ వేశారు. తృతీయ ప్రణాళికలో 419 మైళ్ళ నిడివైన రోడ్లూ, కంచర గాడిదలు వెళ్ళడానికి వీలైన 153 మైళ్ళ నిడివైన రోడ్లనూ, 521 మైళ్ళ కాలిబాటలూ వేయాలని తలపెట్టారు. దానితో యీ ప్రాంతంలో ఏ గ్రామానికి వెళ్ళాలన్నా రోడ్డు సౌకర్యం వుంటుంది.

స్థానిక ప్రజలు కూడా రోడ్లు వేసే పద్ధతులను నేర్చుకున్నారు నిజానికి కొత్త రోడ్లలో చాలా భాగం స్థానికులు నిర్మించినవే.

చాలా విమానాశ్రయాలను నిర్మించాలనీ, ఉన్నవాటిని అభివృద్ధి చేయాలనీ తలపెట్టారు రెండో ప్రణాళికలో పూర్తి కాని కార్యక్రమాలన్నీ తృతీయ ప్రణాళికా కాలంలో పూర్తి చేయబడతాయి.

## ప్రాతిపదిక లక్ష్యాలు

ఆహారోత్పత్తిని పెంపొందించడం ప్రాతిపదిక లక్ష్యాలలో ఒకటి కాబట్టి, తృతీయ ప్రణాళికలో వ్యవసాయ రంగానికి ప్రాధాన్యమిచ్చి రూ. 63.48 లక్షలు కేటాయించారు అందులో పశుపోషణ పథకాలకు కేటాయించిన రూ. 20 లక్షలూ, మత్స్య పరిశ్రమకు కేటాయించిన రూ. 5 లక్షలూ కూడా చేరి వున్నాయి. కొండవాగులనుంచి దాదాపు 5 వేల ఎకరాల భూములకు సేద్యపు నీటి సౌకర్యాలు కల్పించారు

నేఫా రైతులు ఆధునిక వ్యవసాయ పద్ధతుల లాభాలను తెలుసుకుంటున్నారు రెండు లక్షల రూపాయల విలువైన వ్యవసాయ పనిముట్లనూ, 4 వేల మణుగుల మేలిరకం విత్తనాలనూ అభ్యుదయ కర్షకులకు పంపిణీ చేశారు.

ఏదో కొద్దిరోజులపాటు నేఫాలో పర్యటించి వచ్చినవారికి అది యింకా వెనుకబడిన ప్రాంతంగానే కనిపించవచ్చు. కాని, వాస్తవాలను పరిశీలిస్తే, పరిస్థితి అందుకు భిన్నమని తెలుస్తుంది. స్వాతంత్ర్యసిద్ధి అనంతరం, నేఫా ఒక ఏడాదికంటే మరో ఏడాది ఎలా అభివృద్ధి చెందుతూ వచ్చిందో పరిశీ

రిస్తే, గత దశాబ్దంలో నేఫా సాధించిన వాస్తవికమైన ప్రగతి తేట తెల్లమవుతుంది.

### శరవేగంతో ప్రగతి సాధన

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి నప్పుడు నేఫా పాలక సంస్థ రాజకీయోద్యోగుల పది ప్రధాన కేంద్రాలలోనూ ఎనిమిది కేంద్రాలు అడవులలో వున్నట్టువుండేవి. కాని, యీనాడు వాటిరూపం మారింది. ఇప్పుడు అక్కడ పట్టణాలు వెలిశాయి.

అలాంగ్‌లోనూ, యితర ప్రాంతాలలోనూ పెద్ద పెద్ద దుకాణాలున్నాయి. దేశంలో మైదాన ప్రదేశాలలో ఎప్పటి కప్పుడు అక్కడికి సరుకు సరఫరా అవుతూ వుంటుంది. కొంతమంది దుకాణదారులు అప్పుడప్పుడు ప్రత్యేక విమానాలలోకూడా సరుకు తెప్పించుకుంటున్నారు. ఏకాకితత్వానికి వారేనాడో స్వస్తి చెప్పారు.

ఇతర రంగాలలో కూడా శర వేగంతో ప్రగతి సాధించబడుతోంది 1947లో నేఫాలో రెండే ప్రాథమిక పాఠశాలలుండేవి ఇప్పుడు వాటిసంఖ్య 159కి పెరిగింది. ఇవిగాక 20 మాధ్యమిక పాఠశాలలూ, ఆరుఉన్నత పాఠశాలలూకూడా ఉన్నాయి. 53 మంది నేఫా విద్యార్థులు దేశంలో వివిధ ప్రాంతాలకు వెళ్ళి కళాశాలలలో చదువుకుంటున్నారు. ఢిల్లీ కళాశాలలలో నలుగురు చదువుకుంటున్నారు. ప్రీయూనివర్సిటీ తరగతిలో వున్న వారిలో అయిదుగురు బాలికలు

గౌహతీ విశ్వవిద్యాలయ ప్రాంతంలోని పాఠశాలలలో 1962 లో మెట్రిక్యులేషనులో ఉత్తీర్ణులైన విద్యార్థుల నగటుశాతం 44.9. ఆ పరీక్షకు హాజరైన నేఫా విద్యార్థులలో 81.5 శాతం మంది ఉత్తీర్ణులయ్యారు.

### వైద్య సౌకర్యాలు

వైద్య సౌకర్యాలను విస్తృతపరచడంతో, నేఫాలో వ్యాధుల ప్రాబల్యం తగ్గింది. ముఖ్యంగా మలేరియా నివారణోద్యమం ఉత్తమ ఫలితాలనిచ్చింది.

1947 లో ఆ ప్రాంతానికంతకూ ఎనిమిదే ఆసుపత్రులూ, అయిదు డిస్పెన్సరీలు మాత్రమే వుండేవి. ఇప్పుడు వాటి సంఖ్య 90 కి పెరిగింది

భారతదేశం మొత్తంమీద ప్రతి 6,300 మందికి ఒక వైద్యుడుంటే నేఫాలో ప్రతీ 4,946 మందికీ ఒక వైద్యుడున్నాడు దేశం మొత్తంమీద నర్సులు ప్రతి 43 వేల మందికీ ఒక్కరయితే, నేఫాలో ప్రతీ 12,599 మందికి ఒకరున్నారు. 8 వందల జనాభాకు ఒక కేంద్రం చొప్పున అక్కడ ఆరోగ్య కేంద్రాల నేర్పాటుచేశారు.

కుష్టు చికిత్సా కేంద్రాలనేర్పాటు చేశారు. మశూచి నిర్మూలన జాతీయ కార్యక్రమం క్రింద 10 బృందాలు పనిచేస్తున్నాయి.

బి సి. జి. బృందాలు క్షయవ్యాధి నిరోధక టీకాల కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాయి. రెండేళ్ళక్రితం మార్ఘిరితవద్ద 50 మంచాలు గల ఒక క్షయ ఆసుపత్రిని నెలకొల్పారు. ప్రత్యేక చికిత్సకు కూడా ఆ ఆసుపత్రిలో సౌకర్యాలున్నాయి.

నేఫాలో సమాజ వికాస కార్యక్రమాలు దేశంలో యితర ప్రాంతాలలోకన్న ఉత్తమ ఫలితాలనిచ్చాయి. ఇందుకు కారణం కొండజాతి ప్రజలకు స్వయం సహాయ సూత్రంలో నమ్మకముండడమే. నేఫాలో మొత్తం 33 జాతీయ విస్తరణ బ్లాకులేర్పాటుచేశారు.

### సాటిలేని ప్రగతి కృషి

సహకార సంఘాలూ, పబ్లిక్ సంస్థల ద్వారా యీ ప్రాంతాన్ని అభివృద్ధి చేయాలని నేఫా పాలకసంస్థ ఉద్దేశిస్తోంది. స్వీయ కృషితో తామే యీ అభివృద్ధి కృషిని కొనసాగించేటట్లు కొండజాతి ప్రజలను ప్రోత్సహిస్తున్నారు అంతేకాదు, బయటివారు యీ పరిస్థితిని స్వీయలాభానికి వినియోగించుకోకుండా శ్రద్ధవహించబడుతోంది.

అన్ని రంగాలలోనూ అభివృద్ధి కృషిలో స్థానికప్రజలే యితోధికంగా పాల్గొంటున్నారు. నేఫాలోని ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులలో యించుమించు సగం మంది స్థానికులే. చాంగ్లాలోని ఉపాధ్యాయ శిక్షణ సంస్థలో వారు శిక్షణ పొందారు

నేఫా విద్యార్థి ఒకరు యీ మధ్య వ్యవసాయశాస్త్రంలో పట్టం పుచ్చుకున్నారు. నేఫాలో ఆయన తొలివ్యవసాయ శాస్త్ర పట్టభద్రుడు, కొద్ది ఏళ్ళనుంచీ నేఫాప్రజలు భారతసైన్యంలో అస్సాం రైఫిల్స్‌లో చేరుతున్నారు.





### ద్రౌపది కృష్ణునితోఁ దన మున్ను పడిన భంగపాట్లు చెప్పుట

ధర్మనందను పలుకులు తనకుహృదయ,
తాపమొనరింపమోమునదైన్యమొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ,
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు ॥

అంతలు చేసిపో నడచి
యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె యిట్టియూఱట మదిం
బ్రియ మందె యుధిష్ఠిరుండు దా
నంతన యూళు లేవురకు నైదు
సుయోధనుఁ డిచ్చునొక్కొ యీ
కంతకృపావిహీనమతి నాతఁడు
నొంచునె యన్నదమ్ములన్ ॥

తనమునుపడ్డ బన్నములుఁ
దమ్మునిపైఁ గలకూర్మి పేర్మి నీ
జనపతి సైఁపకున్నె యది
సక్కన రాజ్యముపాలు లేక తీ
ఱున కొడఁబాటు గల్గిన
నెఱుంగమి పెట్టరె చాలరైరి వీ
రనరొకొ నానలేమి యని
యాడరె లోకమువారు కేశవా ॥

పెం పేదం దమ కిట్టితక్కువలు
రూపింపంగ నేలా విచా
రింపన్ వారిక మేలు సంధితము
వారిం జూచినం దారు సా
ధింపం జాలరొ కాక పోతఁదగ
మర్దింపం దలంపేని శం
కింపం బట్టొకొ వారు బ్రాహ్మణులె
యేకీడైన సైరింపఁగన్ ॥

ఓట యొకింత యేనియు
సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానమ
యెక్కుడు పూనుఁగాక య
చ్చోటన సంగరంబు లగు చొప్పులు
పుట్టిన నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ పోదురొ
కానల నుండ నచ్యుతా ॥

ఏ నిటు లంటినావలవ దింకను
నీవును రాజుఁ దమ్ములుం
గా నుచితంబు చూచి మన కార్యము
మీ సుజనత్వముం జెడం
గా నొకభంగి సేయక తగం
గురువర్గముతోడి సంధి మీ
కైనతెఱంగునన్ వలచినట్టుల
చేయుడు నేర్పు లేర్పడన్ ॥

అని మఱియు నిట్లనియె,

ఆఱడిఁబోకయున్ ఫలము
నందుటయుఁ గని పల్క నేరమిన్
మాఱటనోరిదాన నయి మాటలు
చిత్తమునందు నిల్ప కేఁ
గాఱులు ప్రేలెదన్ వినుఁడు
కర్జము నెగ్గును గాన నల్కమై
వీటఁడి యైనమానిసికి వెండి
వివేకము కల్గ నేర్చునే ॥

వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁ
జొచ్చితి నందుఁ బాండు భూ
వరునకుఁ గోడలైతి జన
వంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థితు లగు పుత్రులం బడసితిన్
సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తికి
నెక్కినదాన నెంతయున్ ॥

అట్లుంగాక,

నీవు సుభద్రకంటెఁ గడు
నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టినను
బంకజనాభ! యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై
పెనుపొందిన వేణి వట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు
నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే ॥

ఆ సభ కేకవస్త్ర యగు
నట్టినముంగొని వచ్చి నొంచు దు
శ్శాసనుఁ జూచుచుం బతు
లసంభ్రమములై తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రముల
యాకృతి నున్న యెడన్ ముకుంద! వి
శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె
మనం బదియుం దలంపవే॥

అరయమిఁ జేసి కోడ లన
కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులు
వోవఁగ వీరలలోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ
జేయుదునో యటుఁగాక పాడిమై
వరవుడ మోపి చేయుదునో
వారికి మాధవ! నిశ్చయింపుమా॥

**అని యట్లుగ్గడించి,**

ద్రోవది బంధురం బయిన
క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్
దావలచేతఁ బూని యసితచ్ఛవిఁ
బొల్చుమహోభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ
బొంగు విషాదరోషముల్
కావఁగ లేక బాష్పములు
గ్రమ్మగ దిగ్గనలేచి యార్తయై॥

**గోవిందు ముందటం బెట్టి యిట్లనియె,**

ఇవి దుస్ససేను వ్రేళ్లం, దవిలి
సగము ద్రెవ్వివోయి దక్కినయవి కౌ
రవులకడఁ దీఱుమాటల,
యవసరమునఁ దలఁపవలయు
నచ్యుత వీనిన్॥

**ఈ వెండ్రుకలు వట్టి ఈడ్చిన యాచేయి**
**తొలుతగాఁ బోరిలో దుస్ససేను**
**తనువింతలింతలు దునియలై చెదరి రూ**
**పఱియున్నఁ గని యడుగాఱఁగాక**
**యలుపాలఁ బొనుపడునట్టిచిచ్చే యిది**
పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మను నొక విల్లెప్పుడును వహించు
కఱ్ఱివిక్రమంబుఁ గాల్పనే యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజుపీనుంగుఁ గన్నారఁ,
గానఁబడయమైతిమేనిఁ గృష్ణా॥

నెట్టన యిట్టి యల్కమది
నిల్పితి రక్కసతాల్మిఁ జొచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును
గాలము దీనికి వాఱు పెన్నఁడుం
బుట్టదు దుష్టనిగ్రహము
పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టువు నీవుఁ దేజమునఁ
బొల్చినభర్తలుఁ గల్గ నచ్యుతా!॥

**శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట**

**అనుచు నెలుంగు గాలువడ నేడ్చిన యాజ్ఞ**
**సేనిం గృపాయత్తచిత్తుం డయి నారాయణుం**
**డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు**
**దుడువను బెన్నెఱివేణి ముడువనుం దగు**
**వారి నియోగించి య మ్మానినితో నిట్లనియె,**

ముగ్గిచ్చిర నేల నేఁ గలుగ
**ముద్దియ** నాకు వృకోదరుండు వి
వ్వచ్చుఁడుఁ దోడుగాఁగ జన
వంద్యుఁడు ధర్మసుతుండు పంప నీ
మెచ్చుగ శత్రుసంతయము
మేకొని ఛేసెదఁగాక వే ఱొకం
డచ్చుపడంగ నేర్చునె దు
రాత్ములు కౌరవు లుర్వి యిత్తురే॥

లలనా! **యడుగుము** నీ యే
డ్పులకోలఁదియె కురునృపాలపుత్ర
కళత్రం
బుల యేడ్పు, లింక వానిం
గలకల నవ్వుచు వినంగఁ గాలం
బయ్యెన్॥

యమమహిష ఘంటికా నా
దము వినఁ గౌతూహలరబు దళు
కొత్తెడు చి
త్తములు గల కౌరవుల కి
ష్టము లగునే సంధికార్య శాంత
వచనముల్॥

మొదల విధినియతియును న
ట్టిద యందురు పెద్దలది ఘటింపకపోదే
మదిఁ జూచి చెప్పినను దప్పదు
మేరువు దిరిగెనేనిఁ బాంచాలసుతా!॥

పూని పలికెద వినుము రిపుక్షయంబుఁ,
జేసి యుజ్జ్వలపుణ్యలక్ష్మిసమేతు
లైన పాండుకుమారుల యధికవిభవ,
మీవు సూచెదు తడవు లే దిది నిజంబు॥

(తిక్కన - భారతం. ఉద్యోగ పర్వము)

# ప్రశ్నోత్తరావళి

శ్రీ కె.యల్. రామసుబ్బయ్య, రంగాపురం.

ప్రశ్న: ఆంధ్ర ప్రదేశ్‌లో ఆయుర్వేద కళాశాలలు ఎక్కడ ఉన్నాయి? వాటిలో ప్రవేశానికి అర్హత ఏమిటి? ఎప్పుడు చేర్చుకుంటారు?

సమాధానం: హైద్రాబాదులో ఉన్న ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల ఆంధ్ర ప్రదేశ్ మొత్తంలో ఉన్న ఏకైక ప్రభుత్వసంస్థ. యీ సంస్థలో ఆయుర్వేదంలో శిక్షణ ఇవ్వబడుతుంది. ఆంధ్ర ప్రదేశ్‌లో దిగువ పేర్కొన్న ఎయిడెడ్ ఆయుర్వేద కళాశాలలు ఉన్నాయి.

1. అనంతలక్ష్మి కళాశాల, వరంగల్లు.
2. వేంకటేశ్వర్లు ఆయుర్వేద కళాశాల, విజయవాడ.
3. రామమోహన్ ఆయుర్వేద కళాశాల, గుంటూరు.

హైద్రాబాదులోని ప్రభుత్వ ఆయుర్వేదకళాశాలయొక్క 4 సంవత్సరాల ఆయుర్వేద విశారద (జి. సి. ఎ యం.) కోర్సును రద్దుచేయడం జరిగింది. ఆయుర్వేదంలో ఒక సంవత్సరం పి పి.సి కోర్సుతోపాటు 1960 వ సం॥లో 5 సంవత్సరాల శుద్ధ ఆయుర్వేద కోర్సును ప్రారంభించారు. గత విద్యా సంవత్సరం నుంచి శుద్ధ ఆయుర్వేద కోర్సులో ప్రవేశాలను ప్రభుత్వం నిలిపివేసింది కళాశాలలో ఆయుర్వేద కోర్సును ప్రారంభించడానికై కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన పాఠ్య ప్రణాళికకై ప్రభుత్వం వేచివుంది

శ్రీ టి. రామాచార్యులు, తెనాలి.

ప్ర: తెనాలి - విజయవాడల మధ్య బస్సు సర్వీసును ఎప్పుడు ప్రారంభిస్తారు?

స: తెనాలి — విజయవాడల మధ్య బస్సు సర్వీసును ఆరంభించే ప్రతిపాదన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రరోడ్డు రవాణాసంస్థ పరిశీలనలో ఉన్నది. ఇతర పథకాలతో పాటు యీ ప్రతిపాదనను అమలు చేయడంజరుగుతుంది. యీ పథకంక్రింద తెనాలి — విజయవాడల మధ్య ప్రతిరోజు మూడుసార్లు బస్సులను నడుపుతారు.

శ్రీ నన్నూరు మల్లారెడ్డి, గుడపూరు.

ప్ర: బహుమతి పొందిన గ్రామం అంటే ఏమిటి? అటువంటి బహుమతులను గెలుపొందడానికి గల నియమ నిబంధనలు ఏమిటి?

స: 1961 — 62 వ సం॥ లో రాష్ట్రంలో బహుమతి పోటీలపథకాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. యీ పథకం క్రింద రాష్ట్ర, జిల్లా, బ్లాకుస్థాయిలలో ఉత్తమ పంచాయతీలకు బహుమతులు ఇస్తారు. గ్రామాలలో అభివృద్ధి పనులను శీఘ్రంగా అమలుజేయడం, బాధ్యతలను సక్రమంగా నిర్వహించడం, సమిష్టి కృషి, చురుకుదనం ప్రదర్శించడం వంటి కార్యక్రమాలను నిర్వహించేందుకై పంచాయతీలను ప్రోత్సహించడానికి యీ పథకం ఉద్దేశించబడింది.

యీ పథకం క్రింద దిగువవిధంగా ఉత్తమ పంచాయతీలకు రొక్కరూపంలో బహుమతులు ఇవ్వడం జరుగుతుంది.

(అ) సమితి పరిధిలోఉన్నా, లేకున్నా, బ్లాకు స్థాయిలో ఉత్తమ పంచాయతీకి రు. 1000/— లు.

(ఆ) జిల్లా స్థాయిలో ఉత్తమ పంచాయతీకి రు. 5000/— లు.

(ఇ) రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతంలో రాష్ట్ర స్థాయిలో ఉత్తమ పంచాయతీకి రు. 15000/—. తెలంగాణా ప్రాంతంలో రాష్ట్రస్థాయిలో ఉత్తమ పంచాయతీకి రు. 15000/— లు.

రాష్ట్ర, జిల్లా, బ్లాకుస్థాయిలలో విడివిడిగా బహుమతి నిర్ణాయక కమిటీలను ఏర్పాటుచేయడం జరిగింది.

ఉత్తమ పంచాయతీ ఎన్నికకై దిగువ పేర్కొన్న కార్యక్రమాలు అర్హతలుగా పరిగణింపబడ్తాయి:

(అ) పన్నులువిధించే అధికార వినియోగం (నిర్బంధమైనవి, ఐచ్ఛికమైనవి).

(ఆ) 1961—62 సంవత్సరం ఆఖరు వరకు పన్నులు, ఫీజులు, ఇతర బకాయీల మదింపు, వసూళ్ళు.

(ఇ) పంచాయతీ వనరులను పటిష్ఠంచేయడానికై నిర్వహించిన కార్యక్రమాలు.

(ఈ) పంచాయతీలు నిర్వహించిన కుటీర పరిశ్రమల అభివృద్ధి కార్యక్రమాలు.

(ఉ) సౌకర్యాల కల్పనకై గ్రామస్తులు ఇచ్చిన విరాళాలు, విరాళాలు ఇచ్చిన పంచాయతీలోని కుటుంబాల శాతం.

(ఊ) అధికోత్పత్తులకై జరిపిన కృషి. యీ కార్యక్రమంలో పంచాయతీ నిర్వహించిన పాత్ర.

(ఋ) మత్స్య పరిశ్రమాభి వృద్ధికై జరిపిన కృషి.

(ౠ) పంచాయతీలోని బడుగువర్గాల సహాయార్థం పంచాయతీ జరిపిన కృషి.

(మిగతా 48 వ పేజీలో)

# సరిహద్దులను సంరక్షిస్తున్న మన జవాన్లు

నిరంతర అన్వేషణ, అత్యంతజాగరూకత, ఎట్టి పరిస్థితినైనా ఎదుర్కొనే సంసిద్ధత, మన సుదీర్ఘమైన, దుర్గమమైన సరిహద్దులను కాపలా కాస్తున్న సైనికుల ప్రధాన విధి, బాధ్యతలు.

లడక్, నేఫా, తదితర ప్రాంతాలు దుర్గమమైనవైనా వారు జంకరు. ఐదువేల అడుగుల నుంచి పద్దెనిమిది వేల అడుగుల ఎత్తుగల ప్రాంతాలుగాని, కొరుక్కుతినే చలిగాని, మంచు, వర్షం, కీకారణ్యాలు, దారితెన్ను లేని పర్వతాలు వారిని అడ్డుపెట్టవు.

జవాన్లను ఆ ప్రాంతాలకు పంపేముందే వారికి అక్కడి పరిస్థితులు అలవాటు అయ్యేందుకు శిక్షణ యిస్తారు. దూరదూరంగా విసిరేసినట్లున్న స్థావరాలలో చెక్కు చెదరకుండా నిలబడగలగడానికి వారి పట్టుదల, స్థిరసంకల్పం శరీర దారుఢ్యం, సహనశక్తి ప్రధాన కారణాలు.

దేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన గ్రామాలనుంచి కొత్తగా తీసుకున్న రిక్రూట్లకు వివిధ రెజిమెంటల్ కేంద్రాలలో ఆరు నెలలు శిక్షణపొందిన మీదట సకల హంగులు గల సైనికులవుతారు. యుద్ధరంగ శిక్షణ, ఆయుధ శిక్షణ, శిబిర జీవిత శిక్షణ యిస్తారు. అంతటితో ఆగదు; ప్రత్యేకంగా కొందరిని ఎంచి, వారికి అభ్యాసాలు, యుద్ధతంత్రం, మొదలైన వాటిలో శిక్షణ యిచ్చి కరుకు జీవితానికి అలవాటు చేసి, నిర్వహించ వలసినబాధ్యతలను బోధిస్తారు.

ఇంత కఠినమైన శిక్షణకుతోడు వినోద కాలక్షేపంకూడా వుంటుంది. లోపల ఆడే ఆటలు, బహిరంగ ప్రదేశాలలో ఆడేఆటలు వుంటాయి. ఆకాశవాణి సాయుధ దళాల ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహిస్తుంది. జవాన్లకు రేడియోసెట్లు యిస్తారు. ముందు ప్రాంతాలలో ఫిల్ము ప్రదర్శనలు, వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు. వార్తా పత్రికలు, బొమ్మల పత్రికలు వారికోసం విమానాలలో పంపుతారు. కట్టుదిట్టమైన తపాలా సర్వీసు వుంది.

అందువల్ల వారికి తమ బంధుమిత్రులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోవడానికి వీలువుంది. ఉద్యోగ నిబంధనల ననుసరించి అర్హమైన సందర్భాలలో వారికి సెలవులు కూడా లభిస్తాయి.

సైనికశాఖ మన జవాన్లకు సర్వ విధాలా సహాయపడుతూ వుంటుంది. ★

---

(47 వ పేజీ తరువాయి)

(ఇ) గ్రామ పారిశుద్ధ్యానికై అమలు జరిపిన కార్యక్రమాలు.

యీ పోటీలో పాల్గొన దలచిన బ్లాకు, బ్లాకేతర ప్రాంతాలలోని పంచాయతీలు నిర్ణీత తేదీలోగా బి. డి. ఓకు గానీ, జిల్లా పంచాయత్ అధికారికి గానీ తమ దరఖాస్తులను అందజేయాలి.

ఒక పంచాయతీకి ఒకటి కంటే ఎక్కువ బహుమతులు ఇవ్వ బడవు. అయితే అది గెలుచుకున్న బహుమతులలో ఉన్నత బహుమతిని ఇవ్వడం జరుగుతుంది. ఉదాహరణకు- ఒకబ్లాకు బ్లాకు స్థాయిలోనూ, జిల్లా స్థాయిలోనూ ఉత్తమ పంచాయతీగా సెలక్టు అయితే జిల్లా స్థాయి బహుమతి ఇవ్వబడుతుంది. బ్లాకుస్థాయి బహుమతిని బ్లాకులోని రెండవ ఉత్తమ పంచాయతీకి ఇవ్వబడు తుంది.

*శ్రీ దొడ్ల వెంకటరామయ్య, ఉప్పలూరు, కావలి తాలూకా, నెల్లూరు జిల్లా.*

ప్ర : దక్షిణ రాష్ట్రాలలోని గ్రామాధికారులకు వారసత్వపు హక్కు ఉన్నదని ముఖ్యమంత్రి అన్నట్టు 62 సెప్టెంబరు 9 వ తేదీన కొన్ని పత్రికలు ప్రకటించాయి. కాని సుప్రీం కోర్టు యీ హక్కును రద్దుచేసినట్టు తెలిసింది. అందువల్లఆంధ్రప్రదేశ్ లో యీ వారసత్వపు హక్కు ఉన్నదా తెల్పండి. లేనిచో గ్రామ మునసబు ఉద్యోగానికై ఉద్యోగ సాధక కేంద్రంలో పేరున మోదు చేయించుకోవాలా ?

స : సుప్రీంకోర్టు తీర్పును అనుసరించి రాజ్యాంగ చట్టం అమలులోకి వచ్చిన తర్వాత వారసత్వపు హక్కుఆధారంగా జరిగిన నియామకాలు అన్నీ చెల్లవనీ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఉత్తరువు చేసింది. అయితే ప్రస్తుతం ఉన్న అటువంటి నియామకాలన్నీ తాత్కాలికమని గానీ లేక రద్దు అయినట్టుగా గానీ అర్థం కాదు. క్రొత్తగా జరిగే నియామకాలు అన్నీ తాత్కాలిక ప్రాతిపదికపై జరపాలని ప్రభుత్వం ఉత్తరువు చేసింది. తిరిగి ఉత్తరువులు జారీ అయ్యే వరకూ ఖాళీలను శాశ్వతంగా భర్తీ చేయ రాదనికూడా ప్రభుత్వం పేర్కొన్నది. అయితే తాత్కాలిక నియామకాలను కూడా వారసత్వపు సూత్రంపై జరప రాదని ఉత్తరువు చేయడం జరిగింది. ★

# శాంతిప్రియులు స్నేహప్రియులు

చదవటం ఆపివేసి వంట యింటివైపు తిరిగి చూశాను. సుమతి, పాప–స్వాతిని బాగాచీవాట్లు పెడుతున్నది. సుమతి పాపను అలా తిట్టటం నా కెంతమాత్రం యిష్టంలేదు; అయితే అలా చేయటం మంచిది కాదని ఎలాచెప్పాలో పాలుపోక నోరు నొక్కుకొని వుండి పోయాను.

ఉదయం ఎనిమిది గంటలవేళ పాప వంటయింటి కిటికీ దగ్గర నిల్చున్నది. రోజూటి మాదిరిగానే చాక్‌లెట్ రంగులో వున్న గుండ్రని పావురం ఎగురుకుంటూ వచ్చి పాపముందు వాలింది. పాప దానిని తన చేతిలోకి తీసుకున్నది. దాని తల నిమిరింది. దాని ముక్కుకు తన వేలు అందించింది. అలాగే పాప, పావురమూ చాలా సేపు ఆడుకున్నారు

సుమతి పాపను నాలుగుసార్లు పిలిచింది. పావురంతో ఆడుకుంటున్న పాపకు తల్లి పిలుపులు విన్పించలేదు. దాంతో ఆమె తోక తొక్కిన తాచులాగా పాప దగ్గరకొచ్చి–పావురాన్ని బలవంతంగా లాగి కిటికీలో గుండా బయటికి పారేసింది పాపకు కోపం వచ్చి చిందులేయటం ప్రారంభించింది, ఏడుస్తూ! అప్పటికీ తల్లిమీద కోపం తగ్గలేదు. ఏడుస్తూనే – "ఫో! నేనసలు స్నానం చెయ్యను" అని అన్నది.

"ఇప్పుడు తిన్న దెబ్బలు చాలవా? వీపు చిట్లిపోతుంది జాగ్రత్త! ఉదయం నుంచి చూస్తున్నా – ఆ పావురంతో ఆడుకుంటూ కూర్చున్నావు! స్నానం చెయ్యకపోతే – ఇవ్వాళ నీకు భోజనంలేదు. అలాగే స్కూలుకి వెళ్ళిపోవాలి." అని అన్నది సుమతి.

నిజంగానే పాపకు ఆ రోజు భోజనం లేదు. నావైపు దీనంగాచూస్తూ స్కూలుకు వెళ్ళిపోయింది. ఆఫీసుకు టైం కావడం వల్ల నేను భోజనానికి కూర్చున్నాను. కాని భోంచేయ బుద్ధికాలేదు.

"పసిపిల్లను అలా కష్టపెట్టడం నాకేమీ బాగాలేదు." అని అన్నాను సుమతితో!

> మరాఠీ కథ
>
> మూలం,
>
> శ్రీ వి. యస్. పార్‌గాంవ్‌కర్
>
> అనువాదం:
>
> 'మధు'

సుమతికింకా కోపం తగ్గలేదు నా మాట ఆమెకు రుచించలేదు. "మీ రెలాగూ దానికి భయంచెప్పరు. నేను చెబితేనేమో – చివరకు నన్నే అంటారు!" అన్నది సుమతి.

"భయ పెట్టడానికి పాపవయస్సెంత?"

"పిల్లలకు బాల్యంలోనే మంచివిషయాలు నేర్పాలి!"

"మంచి విషయాలు నేర్పటానికి పిల్లలను కొట్టాలంటావా;"

"కొట్టకపోతే వాళ్ళు ఆడింది ఆట, పాడింది పాట అయిపోతుంది. చెట్టు అయి వంగనిది మానై వంగుతుందా?"

సుమతికి ఎలాచెప్పాలో నాకర్థంకాలేదు వంటయింటి కిటికీ మూసివేస్తే ఏ గొడవా లేకుండా పోతుందనిపించింది మేం వుంటున్నది మూడవ అంతస్తులో! అందులో కిటికీ తూర్పువైపున వున్నది. ఆ కిటికీలో గుండా కిందికి చూస్తే చౌరాస్తా, ఆ చౌరాస్తా గుండా నడిచే అసంఖ్యాక జన సందోహం కన్పిస్తూ వుంటుంది ఆ చౌరాస్తాకు మధ్యన వున్న స్తంభం మీదనే కపోతాల నివాసం. ప్రాతఃకాలాన వేలాది కపోతాలు రెక్కలు విదిల్చికుంటూ ఆ స్తంభంమీద ఎగురుతూ వుంటే ఎంతో చూడ ముచ్చటగా వుంటుంది సూర్యుడి వెండి కిరణాల కాంతికి వాటి రెక్కలు మెరుస్తూ కన్పిస్తాయి ఆకాశపు అంచులమీదికి ఎగిరిపోవడం, మరలసుడులు తిరుగుతూ తిరిగి రావడం మనస్సుకు ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. కపోతాల ఆటలు చూస్తూ పెద్దవాళ్ళు ఆకలికూడా మరచి పోతారు. ఇక పసిపాపల విషయం వేరే చెప్పాలా? స్వాతి వాటి ఆటలను చూస్తూ వాటితో ఆడుకుంటూ తనను తాను మరచి పోతూ వుంటుంది ఆ చాక్‌లెట్ రంగు పావురం పాపకు మంచి దోస్తు అయిపోయింది. వాళ్ళిద్దరిమధ్యావున్న స్నేహాన్ని చెడగొట్టడం ఎవరితరం?

పాప అన్నం తినకుండానే స్కూలుకు వెళ్ళిపోయినందుకు బాధపడుతూనే నేను నాలుగు మెతుకులు ఎలాగో కొరికాను. ఆకూ, వక్కా తీసుకోకుండానే - అలాగే వెళ్ళి పోయాను.

సాయంత్రం ఆఫీసునుంచి తిరిగి వచ్చే ప్పటికి పాప మధ్య గదిలో కూర్చొని తన పుస్తకం చదువుకుంటున్నది. సుమతి కన్పించలేదు. నేను పాప దగ్గరకు వెళ్ళి కూర్చొని-"ఏమమ్మా! అన్నం తిన్నావా?" అని అడిగాను.

"తిన్నాను"

పాప కొంచెం నవ్వు మొహంతో కన్పిం చేప్పటికి సుమతికి కూడా పాప మీద కోపం తగ్గి వుంటుందని అనుకొన్నాను.

"మీ అమ్మ ఎక్కడికి వెళ్ళిందమ్మా?"

"బజారు కెళ్ళింది."

"అలాగా" అన్నాను ఏదో మనస్సులోని భారం కొంత తగ్గినట్టనిపించింది.

"అమ్మా! స్వాతీ! చిన్నపిల్లలు తల్లి మాట వినాలి."

"అమ్మ నన్ను వూరికే కొడుతుంది."

"వూరికే ఎందుకు కొడుతుంది?"

"ఏమో ఎందుకో, కొడుతుంది."

"అవును గాని పాపా! ఉదయంపూట అంత సేపు కిటికీ దగ్గర నిల్చోవచ్చునా చెప్పు?"

"మరి పావురం నా దగ్గరకు తొందరగా ఎందుకు రాదు?"

"నువ్వలా నిల్చుంటే ఎలా చెప్పు? నీకు అమ్మ తల దువ్వి జడలు వేయాలా? స్నానం చేయించాలా? భోజనం చేయించి స్కూలుకు పంపించాలా?.. మీ అమ్మ తన పనులన్నీ వదులుకొని నీ కివన్నీ చేయాలి కదా? ఆమెను కష్టపెట్టటం మంచి దంటావా? నువ్వే చెప్పు?"

పాప మొహంవైపు చూశాను. ఆమె తీరు చూస్తే నా మాటలన్నీ ఆమెకు అర్థ మైనాయనిపించింది. నా మాటలు ఆమె అర్థం చేసుకొన్నందుకు నాకు చాలా సంతోషం వేసింది. పాప తెలివికి మెచ్చు కున్నాను. పాప చదువుతున్న పుస్తకం తీసు కొని దానిలో ఏదో పాట వుంటే బిగ్గరగా చదవటం ప్రారంభించాను. స్వాతి నిలబడి నృత్యం చేయసాగింది. ఇంతలో బజారు నుంచి సుమతి లోనికి వచ్చింది. పాపకోసం ఆమె బజారు నుంచి నీలి రంగు సిల్కు ఫ్రాకు ఒకటి తెచ్చింది.

స్వాతి ఆ ఫ్రాకు వేసుకొంటే-అచ్చంగా అప్సరసలాగా కన్పించింది. ఇక పాప సంతోషానికి మేర లేకపోయింది. ఆ సంతో షంలో-ఎగురుతూ కేరింతలు కొడుతూ- వెళ్ళి సుమతిని కౌగిలించుకున్నది. "అమ్మా! రేపటినుంచి నేను కిటికీ దగ్గరకు వెళ్ళనమ్మా! పావురం వచ్చినా వెళ్ళను." అని అన్నది.

సుమతి పాపను గట్టిగా కౌగలించుకొని ముద్దుపెట్టు కున్నది. ఆ తరవాత తల్లీ కూతురు-యిద్దరూ లోనికి వెళ్ళిపోయారు.

ఆ రెండవ రోజు నేను లైబ్రరీ నుంచి వచ్చేప్పటికి పాప మధ్య గదిలో కూర్చొని నెమ్మదిగా ఏడుస్తున్నది. నన్ను చూసి మరింత బిగ్గరగా ఏడవటం సాగించింది.

"ఏడ్చావంటే వీపుమీద ఇంకా నాలుగు పడతాయి, జాగ్రత్త." అని లోపలినుంచి సుమతి కేక విన్పించింది.

తల్లి కేక వినిపించేప్పటికి స్వాతి మొహం మరింత నిర్జీవమైపోయింది. ఎవరో నోరు నొక్కినట్టు వస్తున్న వస్తున్న ఏడ్పును బల వంతంగా ఆపుకొనడానికి ప్రయత్నించింది. కాని దుఃఖం ఆ పసిపాప గుండెలో యిమ డటం కష్టమైపోయింది ఏడుపు ఆగి పోయినా ఎక్కిళ్ళే మాత్రం ఆగలేదు.

ఏడుపుకంటే ఆ వెక్కిళ్ళు మరింత హృద యాన్ని కదిలించివేస్తున్నాయి. ఎందుకో ఆ యింటిలోని వస్తువుల స్వరూపమే మారి పోయినట్టనిపించింది. ముగ్గురు ప్రాణులు గల ఆ యిల్లు జైలులాగా కన్పించింది.

మధ్యగది అసలే కొంచెం చీకటిగా వుంటుంది; పాప ఏడుపుకు ఆ గది మరింత అంధకారబంధురమై భయానకంగా మారి పోయింది.

ఇంటికి యజమానినైన నాకు ఆ సమ యంలో ఏంచేయాలో తోచక తికమకలో పడిపోయాను.

సుమతికి ఏం చెప్పి లాభంలేదు. ఇక పాపను సముదాయించాలంటే ధైర్యం చాల లేదు. వెళ్ళి కుర్చీలో కూర్చొని పుస్తక మేదో పక్కన వుంటే తెరిచాను, చదువుదా మని!

కొంత సేపు గడిచింది. వాతావరణంలో ఎటువంటి మార్పూ నాకు కన్పించలేదు. నా మనస్సంతా ఏదో దేవినట్టుగా వున్నది.

ఇంతలో నాదృష్టి వంట ఇంటి వైపు మళ్ళింది. పావురం రెక్కలు రెపరెప లాడించుకుంటూవచ్చి కిటికీలో కూర్చున్నది. ఆ బూడిదరంగు పావురం ప్రశాంతంగా ఆ కిటికీలో కూర్చొని తలను పొడిగించి నాలుగు వైపులా పరికిస్తున్నది. సుమతి వంటింట్లో ఏదో పని చూసుకుంటున్నది.

పావురం వచ్చి కిటికీలో కూర్చోవటం పాప చూసింది. తన ఏడుపు మానేసి గబగబా వెళ్ళి వంటింటి వాకిట్లో నిలబడింది కిటికీలో వున్న పావురం పాపను చూసి ఎగిరివచ్చి ఆమె భుజంమీద వాలింది.

పాప కళ్ళనుంచి కన్నీటి చుక్కలు ఇంకా కిందకు జారనైనా లేదు-ఆమె మొహం మీద నవ్వు ఉదయించింది. అంతవరకు జరిగినదంతా ఒక్క క్షణంలో మరచి

పోయింది. పావురంతో ఆడుకోవటంలో నిమగ్నమైపోయింది. పాప దాన్ని చూసి ఏదో అంటున్నది. పావురం పాప మాటలు వింటున్నట్టుగా తల అదో మాదిరిగాపెట్టి తన ముక్కును అటూఇటూ కదిలిస్తున్నది. మెడను అటూ ఇటూ తిప్పుతూ – 'గుటర్‌గూం గుటర్‌గూం' అని ధ్వని చేస్తున్నది.

అలా కొంచెంసేపు పాప, పావురం ఆడుకున్నారు. ఆ తరువాత పావురం ఎగిరిపోయింది. – బాధపడుతున్న తనస్నేహితురాలిని ఓదార్చడానికి వచ్చి తన పని తాను పూర్తి చేసుకొన్నట్టుగా!

సుమతి చాలాకోపంగా వున్నది. పొయ్యి ముందు కూర్చొని మండుతున్న నిప్పును పరీక్షగా చూస్తున్నది. మరొకవైపున స్టౌ నీలిరంగు జ్వాలలను రేపుతో ధ్వని పెడుతున్నది. మధ్యమధ్యన ఏవో చిన్నచిన్న పనులుకూడా చేసుకుంటున్నది.

విసుగు పుట్టిస్తున్న ఆ వాతావరణాన్ని మార్చాలనే వుద్దేశ్యంతో నేను సుమతిని వుద్దేశించి ఉదయం టపా వచ్చిందా అని అడిగాను.

సుమతి తలెత్తి నా వైపు ఒకసారి చూసింది. ఆ తరువాత కొంచెం సేపటికి – నే నడిగిన దానికి సమాధానం చెప్పకుండా – "వంట తయారైంది." అని అన్నది.

"ఓహో! అలాగా!" అని నేనునవ్వుతూ వంటింట్లోకి వెళ్ళి రెండు పీటలు పరిచాను. ఒకటి నాకు, మరొకటి పాపకు. సుమతి వెంటనే లేచివచ్చి ఆ రెండోపీట తీసేసింది. నాకు కొంచెం కోపం వచ్చింది.

"ఇవ్వాళ కూడా పాపను పస్తు వుంచుతున్నావా?''

"ఆ విషయం మీ ముద్దుల పట్టి నడగండి. నిద్రనుంచి లేచి ఇంతవరకు మొహం కడుక్కో లేదు. ఇప్పుడు స్నానం చేయించి, తల దువ్వాలి. అంత తీరిక నా కిప్పుడు లేదు."

అప్పుడు గాని నాకు విషయం అర్థం కాలేదు. అంటే పాప మళ్ళీ కిటికీ దగ్గర నిల్చొని పావురంతో ఆడుకుంటూ కాలక్షేపం చేసిందన్న మాట..

ఆ రెండో రోజు పాపకు మొహం నేనే కడిగాను, స్నానం నేనే చేయించాను; ఆ తరువాత ఉభయులం భోజనానికి కూర్చున్నాం. అయితే సుమతికింకా పాప మీద కోపం తగ్గలేదు. తల దువ్వనే లేదు. ఎలాగో నాకు చేతనైనట్టు పాపకు జడ కూడా నేనే వేసి స్కూలుకు పంపించాను.

కాని ఎందుకో మనస్సేమీ బాగాలేదు. ఆఫీసుకు వెళ్లాలనిపించింది కాదు. వక్కపొడి వేసుకుని అలాగే పడక కుర్చీలో పడుకున్నా. అలా ఎంత సేపు పడుకున్నానో నాకే తెలియదు. కొంత సేపటికి లేచి చూసేప్పటికి సుమతి తలుపు దగ్గర నిలబడి వున్నది.

పాప స్కూలుకు వెళ్ళిపోయింది. కాని పాప మొహం నా ముందు మాటిమాటికి మెదులుతున్నది. దాంతో ఏవేవో సంగతులు గుర్తుకొస్తున్నాయి. ఏదో తెలియని బాధ హృదయాన్ని ఆవహించి దహించివేస్తున్నది. పాప పావురాయితో ఆడుకోవటం, అలా ఆడుకోవటానికి వీల్లేదని తల్లి పిల్లను కొట్టటం–ఇలాగే పాత స్మృతులు నన్ను చుట్టుముట్టి బాధించసాగాయి.

సుమతి ఎదురుగా తలుపు దగ్గర చాలా సేపటి నుంచి అలాగే నిలబడి వున్నది; కాని నాకు ఆమెతో మాట్లాడాలనిపించలేదు. అయినా యిందులో సుమతి తప్పు మాత్రం ఏమున్నదిలే?

విషయం స్వల్పమైనదే అయినా–దీనితో ఇంటి వాతావరణమంతా పూర్తిగా మారిపోయింది. ఆనందంతో కళకళలాడే గృహం విచారసాగరంలో మునిగిపోయింది. అభిప్రాయ భేదమనేది అసలు రానేకూడదు; అది వచ్చిన తరువాత–రోజు రోజుకు పెరగటమేగాని, తరగటమనేది వుండదు.

"ఇవ్వాళ్ళ ఆఫీసుకు వెళ్ళరా?" అని సుమతి మా ఇద్దరి మధ్యగల మౌనాన్ని భంగపరచింది.

"వెళ్ళాలనిపించటం లేదు."

''ఎందుకని?''

''ఏమో నాకే తెలియదు... భోజనం చేశావా?"

"ఊహుఁ...''

"పన్నెండు దాటింది. భోంచేయరాదూ?"

"ఆకలి కావటం లేదు.''

"ఎందుకని?"

''ఏమో!''

"నన్ను అనుకరిస్తున్నావా?''

"కాదు, నిజంగానే ఆకలికావడంలేదు.''

"అంటే పాపవిషయంలో నీకుకూడా బాధగా వున్నదన్న మాట?"

"అవును. ఏం చేయను చెప్పండి! కిటికీ దగ్గరకు ఆ పావురం వస్తే నాకు చెడ్డ చిరాకుగా వుంటుంది."

"అయితే నీకు పాపమీద, పావురం మీద కూడా కోపమే నన్నమాట? పాపా అమాయకమైందే, పావురమూఅమాయకమైందే.

"ఇంట్లోకి పావురాలు రావటం అశుభమట.''

''ఇవన్నీ పాతకాలపు భావాలు. పావురం శాంతికి చిహ్నం. సూర్యోదయాన రంగురంగుల అందమైన పావురాలు ఆకాశంలో విహరిస్తూవుంటే ఎంతో చూడముచ్చటగా వుంటుంది! అవి పల్టీలు కొడుతూ, రెక్కలు రెపరెపలాడించు

కొంటూ విహరిస్తూవుంటే మనస్సుకు ఎంతో అహ్లాదకరంగా వుంటుంది."

"నిజమే ననుకోండి! కాని ఇంట్లో ప్రవేశించి అవి అలా చేస్తూవుంటే నా కెందుకో ఏ మాత్రం నచ్చదు. మధ్యాహ్నంపూట వీటి అల్లరి ఇంతా అంతా కాదు. నిద్ర కూడా పోనివ్వవు. ఇల్లు ఖాళీచేసి పెడితే బావుంటదని అనిపిస్తూ వుంటుంది అప్పుడప్పుడు"

"నాకుకూడా అలాగే అనిపిస్తూ వుంటుంది."

"వేరే యిల్లు దొరకటం మాటలా ?"

యిల్లు దొరుకుతుందే అనుకో ! కాని పాపపట్ల నీప్రవర్తన మారుతుందని మాత్రం నే ననుకోను." కొంచెం ధైర్యం చేసి అన్నాను. నే నీ మాట.

"మీ రెప్పుడూ యిలాగే అంటారు నా ప్రవర్తన సరిగా వుండకపోవటానికి నే నేమైనా పాపకు మారుటి తల్లినా ఏమిటి ? పిల్లకు ఇప్పటినుంచే కొంచెం భయం చెప్పకపోతే పెద్దవాళ్ళయిన తరువాత మన మాట అసలే వినరు."

నే నేమీ మాట్లాడలేదు.

ఆ తరువాత కొన్నిరోజులు గడిచాయి. ఎటువంటి సంఘటన జరగలేదు. సుమతి, పాప – ఇద్దరూ చాలాబాగా కలిసిపోయారు పాప వెనుకటిలాగా కిటికీదగ్గర నిల్చొని పావురంతో ఆడుకోవటం మానివేసిందీ అంటే అదీ లేదు. సుమతిఏదో కిటుకుచేసి నట్టు తోచింది.

మరికొన్ని రోజులు గడిచాయి. అయితే సుమతి ప్రవర్తనలో నాకేదో కృత్రిమత వున్నట్టు తోచింది. పాప మీద వచ్చిన కోపాన్ని లోలోపల అణచిపెట్టుకోడానికి ఎంతో ప్రయత్నిస్తున్నట్టు నా కనిపించింది

పాప వెళ్ళి కిటికీదగ్గర నిల్చోవడం ఆలస్యం, పావురం వచ్చి వాలుతుంది. వాళ్ళిద్దరిమధ్యా స్నేహాన్ని చూస్తే సుమతికి మాత్రం గిట్టదు. పాపను, పావురాన్ని ఒక చోట చూసిందీ అంటే ఆమెకు ఎక్కడలేని కోపం వస్తుంది. అయితే బయటికి మాత్రం మామూలుగానే వుంటున్నది. పాప స్నానం చేస్తానూ అంటే చేయిస్తుంది ; తలదువ్వమంటే దువ్వుతుంది. లేకపోతే లేదు.

సుమతిబాధ నాకు తెలియకపోలేదు ఏదో యంత్రంలాగా పనులు చేసుకుపోతున్నదే గాని – ఆమె మాటలో చేతలో వెనుకటి మమకారభావం మాత్రం కన్పించటంలేదు. ఆమె మాట్లాడకుండా కూర్చోవటం నా కెంతో బాధను కలిగిస్తున్నది. పాపకు యింటిలో సంపూర్ణ స్వాతంత్ర్యం లభించింది ; అయితే మేము ఉభయులం మాత్రం అస్వతంత్రులమై పోయాం.

రోజులుయథారీతిగా గడిచిపోతున్నాయి. ఎవరిలోనూ ఎటువంటి మార్పూలేదు.

చివరకు జరగకూడని సంఘటన ఒకటి జరిగిపోయింది.

ఆ రోజు ఆఫీసుకు శలవు కావడంవల్ల రోజూటికంటే కొంచెం ఆలస్యంగా భోజనం చేశాను. ఏదో బడలికగా వుండటంవల్ల మధ్యగదిలో పడుకున్నాను. పాప, సుమతి కూడా ఆ గదిలోనే పడుకున్నారు. పాప వాళ్ళ కొత్తటీచర్‌ను గురించి ఏమేమో చెబుతున్నది. ఆ తరువాత కొంచెం సేపటికి ముగ్గురం నిద్రపోయాం.

సాయంత్రం నాలుగు గంటలకు నేను ఉలిక్కిపడి మంచంమీద నుంచి లేచి కూర్చున్నాను. సుమతి వంట యింటివైపు రెప్పవాల్చకుండా చూస్తున్నది. నేను కూడా మొహం కొంచెం వంచి లోనికి చూశాను. పాప బియ్యపు డబ్బా తెరచి బియ్యం తీసుకొని వసారాలో వాలిన పావురాళ్ళ ముందు చల్లుతున్నది. పావురాళ్ళు టప్‌టప్ మని శబ్దంచేస్తూ వాటిని తినేస్తున్నాయి. పాప అప్సరస కన్యలాగా అదొక రకంగా ఎగురుతున్నది వాటి మధ్యన. వసారా అంతా బియ్యంతో నిండిపోయింది – మధ్యమధ్యన పాప వాటి మధ్యకు వెళ్ళిపోయి వాటిని పట్టుకుంటున్నది. ఆ పక్షులకు పాపంటే ఎటువంటి జంకూగొంకూ వున్నట్టే లేదు. ఒక్కొక్క పావురాన్ని చేతిలోకి తీసుకొని నిమురుతున్నది. మరు క్షణాన మరల అవి కిందికి దుమికి నేలమీద దానా తింటున్నాయి.

అంత చిన్న వయస్సులోవున్న పాప అన్ని పక్షుల మీద ఎలా విజయం సాధించిందో ? సుమతి వెనుకటిలాగానే చూస్తున్నది. తనని తాను లోలోపల అణచి పెట్టుకున్నట్టు స్పష్టంగా తెలుస్తున్నది. సుమతి మీద నాకు చాలా జాలివేసింది. నేను పాప వైపు తిరిగి బిగ్గరగా–"పాపా ! ఏంచేస్తున్నావక్కడ ? చంపేస్తా !" అని కేక పెట్టాను.

ఆ కేక ఎంత భయంకరంగా వున్నదంటే–పావురాళ్ళన్నీ ఆ కేకకు ఒక్కసారిగా ఎగిరిపోయాయి. నేలమీద కూర్చున్న పాప కాస్తా – ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్టుగా ఒక్కసారి లేచి నిలబడింది. సుమతి నా వైపు ఆశ్చర్యంగా చూస్తున్నది. ఆ తరువాత నా కేక నా చెవులలోనే గింగురుమంటూ విన్పించింది.

పాప భయపడ్డ కుందేలులా నా వైపు చూస్తూ నిలబడ్డది. భయంతో కాబోలు వణికిపోతున్నది కూడాను ! గులాబి రేకులవంటి ఆమె పెదాలు కూడా కంపిస్తున్నాయి. నీళ్ళతో నిండిన సీసాను ఒక్కసారిగా గుమ్మరిస్తే దానిలోని నీళ్ళన్నీ లోపలే వుండిపోతాయి. పాప పరిస్థితి కూడా అలాగే వున్నట్టు నాకు తోచింది. అంతటా నిశ్శబ్దంగా వున్నది. ఇప్పుడో, మరి కొంచెం సేపటికో

పాప ఒక్క పెట్టున బిగ్గరగా ఏడవటానికి వుపక్రమిస్తుందేమో ననిపించింది. పాప మొహంచూసి నేను దిగ్భ్రాంతి చెందాను సుమతి కూడా పాప వైపు కళ్ళప్పగించి చూస్తున్నది.

సుమతి దెబ్బలు కూడా పాపకు అంత బాధ కలిగించి వుండకపోవచ్చు కాని నేను బిగ్గరగా ఒక్క కేక వేసేప్పటికి-ఆమె గజగజ వణికిపోయింది తల్లి దెబ్బల బాధలకంటే నా కేక ఆమెకు ఎంతో బాధను కలిగించి వుంటుంది పాపకు నావైపు చూడడానికి కూడా సాహసం వేయలేదు కాబోలు, మొహం పక్కకు తిప్పుకున్నది.

ఆ రెండవరోజు ఉదయం లేచి స్నానాల గదికి వెళ్ళాను. అక్కడ పాప ఒక మూలన నిలబడి వున్నది. ఆ క్రిందటిరోజు సంఘటనను నేను మరచేపొయ్యాను. గూట్లోనుంచి పళ్ళపొడి సీసా తీసి ఆమెచేతి కందిస్తూ — "ఇదుగో పళ్ళపొడి ! పళ్ళు తోముకో !" అని అన్నాను

నా చేతిలోనుంచి పళ్ళపొడి సీసా తీసుకొనకపోగా పైపెచ్చు — 'నా కక్కర్లేదు !' అని అంటూ నా చేతిని తోసివేసి అవతలికి వెళ్ళింది. అప్పుడనుకున్నాను—పాప నిన్నటి సంగతి మరచిపోలేదని.

చాలా కాలంనుంచి పాపకు తల్లినుంచి లభించవలసిన వాత్సల్యం లభించడం లేదు. నన్ను చూసుకొని కాలక్షేపం చేస్తున్నది నిన్నటితో ఆ ఆధారం కూడా చేజారిపోయింది ఇందుకే గాబోలు పాప నాపట్ల అంత కారిన్యంగా ప్రవర్తించింది.


పాప బియ్యం తీసుకొని వసారాలోవాలిన పావురాళ్లముందు చల్లుతున్నది.

ఆ రోజు స్నానం చేస్తానని చెప్పి మరీ తల్లి చేతుల మీదుగా స్నానం చేసింది. తనకు తానే ఎంతో ప్రయత్నించి ప్రాకు వేసుకున్నది రోజుటి మాదిరిగా కిటికీ దగ్గరకు వెళ్ళి నిల్చోవడం మానివేసి, అద్దం ముందు నిలబడి తల దువ్వుకోవడం ప్రారంభించింది. దువ్వెన ఎలా పుచ్చుకోవాలో కూడా పాపకు తెలియదు; ఇక తల ఏం దువ్వుకుంటుంది ? పాప ప్రతి పనిలోనూ ఏదో అన్యమనస్కంగా వుంటున్నది.

తనకు చేతనైనట్టు తల దువ్వుకొని మధ్య గదిలోకి వెళ్ళి తెలివిగల విద్యార్థివలె కూర్చొని పుస్తకం చదువుకుంటున్నది. ఇదివరలో అయితే పాఠాలు ఇల్లు ఎగిరిపోయేట్టు చదివేది; కాని ఇవ్వాళ్ళ మాత్రం— పెద్దవాళ్ళవలె లోలోపల చదువుకుంటున్నది. ఇంటి బాధ్యతంతా తనమీదనే వున్నట్టు, లేదా ఆ ఇంట్లో తను మినహా మరెవరూ లేనట్టూ వ్యవహరించింది.

నా కెందుకో పాప ప్రవర్తన ఏ మాత్రం రుచించలేదు. పైపెచ్చు నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది—ఒక్క రోజులో పాప ఇంత పెద్దది ఎలా అయిందా అని ! ఈ మార్పు నాకేమీ అర్థం కాలేదు.

పాప పుస్తకం చదువుకుంటూ వుండగా రెక్కలు ఆడించుకుంటూ పావుర మొచ్చి కిటికీలో కూర్చున్నది. అక్కడి వాతావరణంలో ఏదో పెద్దమార్పు ఒకటి రాబోతున్నదని నేను పసిగట్టాను. రెక్కలు టపటప లాడిస్తూ కిటికీలో కూర్చున్న పావురం చాలా లావుగావున్నది. మెరుస్తున్న సూర్యకాంతిలో రెక్కలు విప్పి నాట్యం చేస్తున్నది. ఆ దృశ్యాన్ని ఒక్కసారి పాప

చూస్తే ఎంత బావుణ్ణనిపించింది నాకు! పరిస్థితి వెనుకటిలాగా వుంటే నేనే అమాంతంగా వెళ్ళి పాపను ఎత్తుకొని మరీ దాని దోస్తును చూపించివుండేవాణ్ణి! మరి ఇవ్వాళ్ళ పాపకు నేను శత్రువునుగా?

ఆ పావురం మరొకసారి తన పొడుగాంటి మెడను అటూ ఇటూ తిప్పి పరిశీలనగా చూసింది. బహుశా పాపను వెదుకుతున్నదేమో ననిపించింది. లోపల పాప ఏం చేస్తున్నదో తెలియటంలేదు. ఒకవేళ కల్పించినా మనసులోని భావాలను చదవడం కష్టమయ్యేదేమో! ఎందుకంటే – ఇప్పుడు ఒకరి కొకరం చాలా దూరమయ్యాం.

చివరకు ఆ పావురం అక్కడినుంచి ఎగిరి వంటింట్లోకి వెళ్ళి వాలింది. పావురం చేస్తున్న గొడవకు పాప తాను కూర్చున్న చోటునుంచి లేచి పలకతో సహా పావురం దగ్గరకు పరుగెత్తింది. పావురం అక్కడే వుంటే పలకతో పాప దాన్ని కొట్టేదేమో – కాని పావురం ఆ ప్రమాదాన్ని గుర్తించి ఎగిరిపోయి ఆకాశంలో చక్కర్లు కొడుతున్నది.

ఈ విధంగా ఒకటి రెండు సంఘటనలు సంఘటించాయి. అయితే ఈ వాతావరణాన్ని సహించడం చాలా కష్టంగా వున్నది. పాపను అర్థం చేసుకొనటానికి చాలా ప్రయత్నించాను కాని వీలుపడలేదు సుమతికూడా మంచి చేసుకోవాలని చూసింది. కాని పాపలో ఎటువంటి మార్పూ రాలేదు. వైరుధ్యం మాత్రం పెరిగిపోతున్నది

ఆ రోజుల్లోనే వంటింట్లో సిమెంటు చేయించవలసిన అవసరం ఏర్పడింది. వంటింట్లో మరికొన్ని చిన్నచిన్న మార్పులు కూడా జరిగాయి దీంతో మా అందరి మనస్సులలోకూడా కొంతమార్పు వచ్చింది పాప మధ్య మధ్యన మాట్లాడటం మొదలు పెట్టింది

అది సంధ్యాసమయం. వంటింటి పని పూర్తయింది తూర్పు వైపున కిటికీ దగ్గర సిమెంటు చేసిన నేల ఆరలేదు కూలివాళ్ళు నీళ్ళుచల్లి వెళ్ళిపోయారు. మేమంతా బయటి గదిలో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం. సుమతి ఇవ్వాళ్ళ మంచి మూడ్‌లో వున్నది పాప ఎక్కడో ఆడుకుంటున్నది. "ఇప్పుడు వంటిల్లు బావున్నది!" అని అన్నాను సుమతితో.

"అవునవును, అలుక్కోవలసిన బాధ తప్పిపోయింది."

"అయితేనేం నాలుగైదు అంగుళాలు ఎత్తు పెరిగింది."

"పెరిగితే పెరిగింది నష్టమేముంది?"

"నష్టం లేకేం? చాలావుంది."

"ఏమిటది?"

"పాప అక్కడ నిల్చోవడానికి వీలు ఏర్పడింది. ఇదివరలో అయితే కాళ్ళుఎత్తి నిలబడేది."

"ఓహో! నిజమే!"

"ప్రాణంలేని భూదేవికూడా పాపకు సహాయ పడుతున్నది. ఇందుకే కాబోలు– భూదేవిని తల్లిగా భావిస్తారు."

సుమతి వెంటనే లేచినిలబడింది. మధ్య గదిలోంచి అవతలి గదిలోనికి చూసింది. ఆమెఅలాగే ఆశ్చర్యంతోనిలబడిపోయింది. పాప పావురంతో ఆడుకుంటున్నది. ఆ ఆటలో నిమగ్నమై బయటి ప్రపంచాన్నే విస్మరించింది.

గత పది పన్నెండు రోజులనుంచి ఒకరి నొకరు చూసుకోలేదేమో–ఎంతో ప్రేమగా ఆడుకుంటున్నారు. ఆ దృశ్యం ఎంతో చూడ ముచ్చటగా వున్నది. పాపా, పావురం అలా ఆడుకోవడం చాలా సేపు చూస్తూనే నిలబడి పోవాలనిపించింది. ఆ దృశ్యం అలాగే శాశ్వతంగా నిలిచిపోతే?

కాని సుమతి తనను తాను సంబాళించుకోలేక పోయింది. ఆమెలోని కోపం కట్టలు తెంచుకొని ప్రవహించింది. ఆమె భీకర రూపం దాల్చి పాపవైపు పరుగెత్తింది. కింద పడేసి ఈడ్చుకొంటూ బయటికి లాక్కొని వచ్చి కొట్టటం ప్రారంభించింది. అసలు ఏం జరిగిందో ఏమిటో, ఆమె కోపానికి కారణ మేమిటో తెలిసికొనడానికి ప్రయత్నించేలోగానే పాప వంటిమీద విపరీతంగా దెబ్బలు పడ్డాయి. సుమతి పిచ్చిదానిలాగా– చేతికి ఏ వస్తువు దొరికితే ఆ వస్తువల్లా తీసుకొని వళ్ళు హూనం హూనం చేసింది. చిన్నపిల్లను అలా కొట్టటం మంచిదా కాదా అనే విచక్షణా జ్ఞానం కూడా సుమతి కోల్పోయింది.

సింహం నోటినుంచి గొర్రె పిల్లను లాగినట్టు, సుమతినుంచి పాపను వేరు చేశాను–అతి కష్టంమీద! పాపను ఎత్తుకొని భుజంమీద పడుకోబెట్టుకొని జోకొట్టడం మొదలెట్టాను. కొంత సేపటికి ఏడుపు మాని వేసింది గాని, వెక్కిళ్ళు మాత్రం మాన లేదు.

సాయంత్ర మైంది. అంతటా చీకటి వ్యాపించింది. ఇంట్లోకూడా అంధకారం అలుము కున్నది. పాప ఇంకా నెమ్మదిగా వెక్కివెక్కి ఏడుస్తూనే వున్నది. ఇంత వరకు పాప ఎంతో గంభీరంగా వుంటూ, తనకుతాను సంబాళించు కున్నది, ఇలా చేయడానికి ఆమె కోమల హృదయం ఎంత సంఘర్షణ పడిందో? ఆ తరువాత ఇలా దెబ్బలు తినవలసి వచ్చింది. ఇలా దెబ్బలు తిన్నందుకు ఆమె పసిహృదయం ఎంత బాధపడుతున్నదో ఏమో? ఆమెకు ఎంత బాధకలగకపోతే సాయంత్రంనుంచి అప్పటి

వరకూ వెక్కి వెక్కి ఎందుకు ఏడుస్తుంది?.. ఆ బాధలోనే ఆమె కనురెప్పలు మూతలు పడ్డాయి. ఆ తరువాత ఎంతో సేపటికి పాప నిద్రపోయింది. మధ్యమధ్యన ఆమె దీర్ఘంగా శ్వాస తీసుకుంటున్నది. ఆ తరువాత చాలా సేపటికి పాపను వేరే పడుకో బెట్టి నేను లైటు వేశాను.

సుమతి వాకిలి దగ్గర తలుపుకు ఆనుకుని స్తబ్దుగా నిల్చొని వున్నది. పశ్చాత్తాపభావం ఆమె మొహంమీద స్పష్టంగా కన్పిస్తున్నది. అయితే ఆమెను మాట్లాడించడానికి నాకు సాహసం చాలిందికాదు. పాపవైపు ఆమె తదేకంగా చూస్తున్నది. పాప నిద్ర పోతు న్నది; అయితే ఆమె కళ్ళదగ్గర ఇంకా కన్నీటిచుక్కలు అలాగే వున్నాయి. వుండి వుండి గట్టిగా శ్వాస పీలుస్తున్నది. సుమతి దీర్ఘంగా నిట్టూరుస్తూ అలాగే నిలబడివుంది.

ఆరోజు రాత్రి మేమెవరం భోజనం చేయలేదు. నేను పాపదగ్గరే పడుకున్నా. చివరకు పక్కలైనా వేసుకోలేదు అర్థ రాత్రివేళ ఎందుకో పాప వంటిమీద చెయ్యి వేస్తే బాగా వేడిగా తగిలింది. జ్వరం వచ్చింది. లేచి థర్మామీటరుపెట్టి చూశాను. జ్వరం 103 డిగ్రీలు వున్నది. నా తల తిరిగి పోయింది.

సుమతి మాత్ర హృదయం తల్లడిల్లి నట్లుంది. ఆమెకు తన ఆచరణ స్మృతికి వచ్చిందేమో? నేను లేచిన వేళకే ఆమె కూడా లేచి కూర్చుంది.

పాపకు జ్వరం తగిలిన సంగతి తెలుసు కుని సుమతి పిచ్చిదానివలె పాపవైపు కొన్ని క్షణాలపాటు రెప్పవాల్చకుండా చూసింది. ఆ సమయంలో ఆమెను ఎవరైనా చూసి వుంటే పిచ్చిదనే అనుకునే వారు. ఆ మరు క్షణాన పెద్దపెట్టున ఏడుస్తూ పాపను కౌగ లించుకున్నది.

రెండవరోజు డాక్టరు వచ్చి పరీక్ష చేశాడు. పాప చుట్టూ మందుల సీసాలు ఏకమైనాయి. డాక్టరు ఇంజెక్షను ఇచ్చి వెళ్ళి పోయాడు. రెక్కలు ఆడించుకుంటూవచ్చి పావురం కిటికీ దగ్గర వాలింది. మెడ నాలుగు వైపులకు తిప్పి పాపకోసం చూసింది. పాప కన్పించలేదేమో–పావురం వెళ్ళిపోయింది. పాప ప్రస్తుతం ఎటువైపూ చూసే స్థితిలో లేదు. ఆమె అపస్మారక స్థితిలో వున్నది. జ్వరం ఇంకా అలాగే వున్నది. తగ్గలేదు.

ఆ జ్వరంలో పాప ఏమేమో కలవ రించింది.

మూడు రోజులు గడిచాయి. జ్వరము తగ్గలేదు, స్పృహ రాలేదు. ఆ స్థితిలో వుండి పాప 'పావుర, పావురం!' అని...'అమ్మా కొట్టవద్దు...కొట్టవద్దు...'అని కలవ రిస్తున్నది.

పాప మంచం పట్టింది. చివరకు సుమతి అటూ ఇటూ తిరుగుతూ కూడా జబ్బుపడ్డ మనిషిలాగా కన్పిస్తున్నది. పాప సగం జబ్బు ఆమె పంచుకున్నదేమో ననిపిస్తుంది, ఆమెను చూస్తే.

పాప జ్వరం తగ్గకపోయేప్పటికి సుమతి

(మిగతా 56 వ పేజీలో)

# పారిశ్రామిక విశేషాలు

## సింగరేణి గనులు

సింగరేణి గనులలో 1963 మే నెలలో బొగ్గుఉత్పత్తి 2,50,125 1 టన్నులు కాగా అదే కాలానికి గత సంవత్సరం 2,40,547.6 టన్నులు వుంది.

1963 మే మాసాంతానికి మొత్తం బొగ్గు వుత్పత్తి 1,315,639.4 టన్నులు వుంది. సరిగ్గా యిదే కాలానికి గత సంవత్సరం 1,185,174.6 టన్నులు వుంది.

సింగరేణి గనులకు చెందిన మందమారి వద్ద రామకృష్ణాపురం బొగ్గు క్షేత్రాలలో 1963 మే 24వ తేదీని క్రొత్తగని ఒకటి ప్రారంభించబడినది. దీనివల్ల దేశఖనిజ సంపద అభివృద్ధి చెందడమేగాక ఇది ఎంతో మందికి ఉద్యోగావకాశాలను కల్పించగలదు.

గోదావరి ఖని నెం. 8 అనే మరో గని రామగుండం గనులలో 1963 మే 27వ తేదీన ప్రారంభించబడినది. ఈ గనిలో 150 లక్షల టన్నుల బొగ్గు నిక్షిప్తం ఉన్నదని అంచనా.

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ

*చెఱకు అంచనా:*

1963–64 కాలంలో యీ దిగువ పేర్కొన్న విధంగా చెఱకు ఆడతారని అంచనా:

| | | |
|---|---|---|
| 1. ఫ్యాక్టరీ క్షేత్రం లోని చెఱకు : | 2,70,000 | టన్నులు |
| 2. రైతుల వద్దనుండి పొందిన చెఱకు : | 3,50,000 | ,, |
| మొత్తం | 6,20,000 | ,, |

*సందర్శనలు :*

ఆంధ్రప్రదేశ్ ప్రణాళికా శాఖా మంత్రి డా ఎమ్. చెన్నారెడ్డి 1963 జూన్ 5వ తేదీన ఫ్యాక్టరీని సందర్శించారు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన ఆర్కిటెక్ట్ శ్రీ ఫయజుద్దీన్‌గారు కూడా జూన్ 5వ తేదీన ప్రధాన కార్యాలయ భవన నిర్మాణానికి స్థల పరిశీలన నిమిత్తమై కాలనీని సందర్శించారు

తెలంగాణా ప్రాంతీయ సంఘం చైర్మన్ శ్రీ టి హయగ్రీవాచారి ఆ సంఘంలోని మరో అయిదుగురు సభ్యులతో కలిసి జూన్ 28వ తేదీన యీ ఫ్యాక్టరీని సందర్శించారు.

# రెండు వంతెనలు

మహబూబ్‌నగర్ జిల్లాలో కాశీ — కన్యా కుమారి జాతీయ రహదారి (నెం 7) మీద కృష్ణానదిపై రంగాపూర్ గ్రామ సమీపంలో రూ. 38 5 లక్షల వ్యయంతో నిర్మించబడిన రోడ్డు వంతెనకూ, ఇదే జాతీయ రహదారి మీద కర్నూలు వద్ద హంద్రీ నదిపై రూ. 7 లక్షల వ్యయంతో నిర్మించబడిన మరో రోడ్డు వంతెనకూ 1963 ఆగస్టు 28 వ తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డిగారు ప్రారంభోత్సవం చేశారు. ఈ ప్రారంభోత్సవ సభలకు రాష్ట్ర భవనాలు, కమ్యూనికేషన్ల శాఖా మంత్రి శ్రీ మీర్ అహమ్మద్ అలీ ఖాన్ అధ్యక్షత వహించారు. ఆంధ్ర ప్రదేశ్ రహదార్ల శాఖ చీఫ్ ఇంజనీర్ శ్రీ హెచ్. ఆర్. శాయోజీరావు స్వాగత మిచ్చారు.

## రంగాపూర్ వంతెన

ఈ వంతెన నిర్మాణంతో హైద్రాబాదు - బెంగుళూరుల మధ్య ఎట్టి ఆటంకమూ లేని దగ్గర దారి ఏర్పడింది. అంతేగాక కాశీ నుంచి కన్యాకుమారి వరకు (వార్ధా వద్ద వంతెన మినహా) సరాసరి రాకపోకలకు సదుపాయం కూడా ఏర్పడింది. పూర్వం కర్నూలు నుండి హైద్రాబాదుకు రావడానికి మైసూరులోని రాయచూరు మీదుగా 194 మైళ్ళు ప్రయాణం చేయవలసి వచ్చేది. కాని ఇప్పుడీ వంతెన నిర్మాణంతో వీటి మధ్య దూరం సుమారు 60 మైళ్ళు తగ్గింది. తెలంగాణా, రాయలసీమ ప్రాంతీయుల మధ్య ఇతోధికంగా సన్నిహితత్వం ఏర్పడడానికీ, ఈ ప్రాంతముల మధ్య వర్తక వాణిజ్యాలు పెంపొందడానికీ ఈ వంతెన దోహదం చేయగలదనడంలో సందేహం లేదు.

రంగాపూర్‌వద్ద నిర్మించిన ఈ వంతెన జాతీయ రహదారిపై వున్నందున దీని నిర్మాణానికైన రూ. 38.50 ల ఖర్చును కేంద్ర ప్రభుత్వమే భరించింది. ఈ వంతెన పొడవు 3086 అ. 6 అం. లు. వంతెనపై రహదారి వెడల్పు 24 అ. లు. ప్రవాహ వేగం మొదలైన వాటిని పునః పరిశీలించిన పిమ్మట వంతెన పొడవును గద్వాల వైపు 120 అ. లకూ, రంగాపూర్ వైపు 80 అ. లకూ పెంచారు.

ఈ వంతెన మన రాష్ట్రంలో కృష్ణా నదిపై నిర్మించబడిన మూడవ వంతెన. దీనికి 1959 ఏప్రిల్ 6 వ తేదీన శంకుస్థాపన జరిగింది.

## హంద్రీ వంతెన

ఈ వంతెన నిర్మాణం కర్నూలు పౌరుల చిరకాల వాంఛ. హంద్రీ నదిపై ఈ వంతెన నిర్మాణం వల్లా, రంగాపూర్ వంతెన నిర్మాణం వల్లా హైద్రాబాదు — బెంగుళూరుల మధ్య సరాసరి రాకపోకలకు దగ్గర మార్గ మేర్పడింది. దీని నిర్మాణం వల్ల తెలంగాణా ప్రాంతానికి, రాయలసీమతోనే గాక మైసూరు రాష్ట్రంతో కూడ మరింత సాన్నిహిత్యం పెంపొందించుకోవడానికి అవకాశం ఏర్పడిందనడంలో సందేహంలేదు.

ఇది జాతీయ రహదారిమీద వుండటం వల్ల దీని నిర్మాణానికి అయిన రూ. 7 లక్షల ఖర్చునుకూడా కేంద్ర ప్రభుత్వమే భరించింది. దీని పొడవు 576 అ. లు వంతెనపై రహదారి వెడల్పు 24 అ. లు ఒక్కొక్కటి 64 అ. ల పొడవుగల ఖానాలతో ప్రీస్ట్రెస్ట్ కాంక్రీటుతో ఆధునిక పద్ధతిలో ఈ వంతెనను నిర్మించారు. 1961 మే 9 వ తేదీన వంతెన పనులను ప్రారంభించడం జరిగింది.

---

(55 వ పేజీ తరువాయి)

మరింత బెంబేలు పడిపోయింది. నేను పాప దగ్గర కూర్చుని వున్నాను సుమతి కూడా పాప తలవైపున కూర్చొని ఆమె తల నిమురుతున్నది కళ్ళవెంట కన్నీరు ధారలు కట్టి ప్రవహిస్తున్నది. పాప మినహా ఈ ప్రపంచంలో తనకెవరూ అవసరం లేదన్నట్టుగా వున్నది - ఆమె వైఖరి.

మూడుగదుల ఆ ఇల్లు - పాపవున్న ఆ ఒక్క గదిలోనే ఇమిడిపోయింది. ఆ మూడుగదుల మధ్యవున్న భేదం ఒక్కసారిగా అంతరించి పోయినట్టే — మా ముగ్గురి మధ్యగల అంతరంకూడా మటుమాయమైనట్టు నాకు తోచింది

ఆ తరువాత మూడు రోజులకు పాపకు స్పృహ తెలిసేప్పటికి, పాప పక్కలో ఆమె ప్రియమైన పావురం 'గుటర్ గుం గుటర్ గూం' అని ధ్వనిపెడుతూ ఎగిరెగిరి పడుతున్నది. సుమతి— వాత్సల్య భావంతో ఒకసారి పాపను, మరొకసారి పాప స్నేహితురాలైన పావురాన్ని చూచి మురిసి పోతున్నది ఆ దృశ్యాన్ని చూచి నన్ను నేను మరచి పోయాను. 

# గిడుగా? పిడుగా? కాదు -
# రుద్రమూర్తి శ్రీ గిడుగు రామమూర్తి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

*[విద్య, విజ్ఞానం విస్తృతంగా వ్యాపించడంలో ప్రధాన సాధనంగా ఉపయోగపడిన వ్యావహారిక భాషకు రచనాపరంగా సువ్యవస్థితమైన స్థాయి నేర్పరచడంలో ప్రభాకరశాస్త్రి, ఆదినారాయణశాస్త్రి, గురజాడ, కందుకూరి, డాక్టర్ సీతాపతి ప్రభృతుల అండదండలతో శ్రీ గిడుగు వెంకట రామమూర్తిగారు ఒక మహోద్యమాన్ని ప్రారంభించి కృతకృత్యు లయ్యారు. ఈ ఉద్యమ నిర్వాహణలో గ్రాంధికభాషావాదులతో శ్రీ రామమూర్తిగారు హోరాహోరిగా పోరి "గిడుగు" కాదు "పిడుగ" ని పించుకొన్నారు. జాతి మనుగడకు ముఖ్యమైన జీవ నాడివంటి భాషోద్యమంలో ధ్రువ తారగా వెలుగొందిన శ్రీ రామమూర్తిగారి శతవర్ష జయంత్యుత్సవాలు జరుగుతున్నాయి. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఈ నెల 'ఆంధ్రప్రదేశ్'లో శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిగార్లు వ్రాసిన రెండు వ్యాసాలను ప్రకటిస్తున్నాము. —ఎడిటర్]*

శ్రీ రామమూర్తి ఆంధ్రభాషకు విశేషమైన సేవ సలిపెనని ఆంధ్రులకు మరొక ఆంధ్రుడు అంతగా తెలుపనక్కరలేదు. ఆంధ్రభాషా యోషకు సేవ సలిపినవారింకను అనేకులున్నారు. వారి సేవకును శ్రీ రామమూర్తి సేవకును వ్యత్యాసమున్నది. ఇతడు బహు సంస్కృత గ్రంథములను—తప్పుగనేమి ఒప్పునేమి - తెలిగింపలేదు. ఆశుకవనమును,-ఇందు భావమును, జీవమును ఉన్నను లేకున్నను-గణయతుల వర్షమును సభలయందు గురిపించి చక్కని శాల్వాలను గప్పుకొనలేదు. రంగారు బంగారు అలంకారములను దాల్పలేదు. శ్రీరామమూర్తి నవలలు వ్రాయలేదు-నాటకములు లిఖింపలేదు పఠనీయ గ్రంథములను-ఏ తీరుగ పఠనీయములైనను-వ్రాయలేదు. దోబూచి కథలు వ్రాయలేదు. కాని, ఈతడు భాషాసేవ సలిపినాడు అట్లనిన, సారస్వతమున నిర్గుణోపాసకుడని తెలుపను. సాహిత్య బ్రహ్మము నే తలచి భావ మననమున ధనంజయుడాయెనని తెలుపను. భాషలో లేని సోయగము నీతడు తేలేదు. లేని భావము నీతడు అల్లుకొని రాలేదు. భాషయందుండి కప్పుపడిన సోయగమును వెల్లగించుటకును, ముసుగు తెరలందును, ముండ్లపొదలందును ఇరుకుకొనిన భావమును వెలువఱుచుటకును ఈతడు నడుముగట్టెను. ఒక్కడు గునపము చేబూని శతాబ్దములనుండి గుట్టయై నిలిచిన మూఢ సంప్రదాయమును త్రవ్వుటకై [illegible]నుకొనుటచే, ఈతడెంతేని శ్రమ పడవలసి వచ్చెను.



కాలవాహిని యట్లు భాష చలింపవలెనని గుర్తించిన నేటి ఆంధ్రులలో శ్రీ రామమూర్తి ప్రథముడు. మన సీమలో విశేషముగా భాషకేగాని

భా మునకు ఆదరము లభించినది కాదు. భావమునుండి చిరిగి చిందరయైన భాష కుట్టువిడిన గుడ్డపేలికయట్లు నిరర్థకమైన దని ఎందఱో గుర్తింపలేదు. మానవ జాతిని పునరుద్ధరింపగల భావములను విశిష్ట భాషాసేవకులు వ్యాప్తిపై వెదజల్లిరి. గెథేవలన (Goethe) జర్మనీ పునర్జన్మ మందినది. ప్యూరిటను కవి కలము, ఇంగ్లడునకు వేఱు రూపు నిచ్చినది. వాల్టేరు, రూసోల లేఖినులు ఫ్రాన్సు శీమకు స్వాతంత్ర్య మిచ్చినవి. వంగీయుల రచనములు రామమోహనుని స్యందనమునకు గుఱ్ఱములైనవి. ఆంధ్రులను లేపి నిలువబెట్టు భావములుగాని, మనుష్యహృదయమందును, సృష్టి చిత్రములందును అంతర్వాహినులట్లు ప్రవహించు ఉద్దేశములుగాని తెలుగు గంటములకు దృగ్గోచరము కాలేదు. బండెడు సమాసములందు కొంత శృంగారము నిరికించి ఎగుడు దిగుడు స్రోవలందు మన కవులు పల్వురు ఆంధ్ర సారస్వతమును నడిపిరి. సంస్కృతమందలి ఉద్గ్రంథములను తెలిగించిరి. తియ్యని స్వరమున "తందానా!" యనిరి. గంభీరస్వరమున "భళాభళి" యనిరి. కాని స్వతంత్రమైన నొత్తును భావమందు కనుగొనరైరి. భాషా స్వాతంత్ర్యమునకు తావొసగరైరి. ఎన్ని యుద్యమములందైన ఆంధ్రులు "అల్లల్లభిరా!" అని ఎగిరి గంతు వేసిరిగాని సారస్వతోద్యమమున హేమ్లెటులవలె ఊగిసలాడిరి. విభూతి రేఖల యొరపడిని కలములు త్రిప్పిరి. ఒరడివవెనుక లేగదూడలట్లు చరించుటేగాని, ఒరపడిలో నున్నతత్వమును గ్రహింపరైరి. తలయెత్తి, నాదియను వాక్యము చెప్పరైరి. నిలిచి 'ఈ భావము' నా హృదయ పృథ్వియందుద్భవించిన దనరైరి. ఛందశ్శాస్త్రమును, వ్యాకరణ శాస్త్రమును దిగ్గ్రమింగి లక్షణ యుతముగ, కవితలేని పంక్తులను, జీవములేని పద్యములను, విసరి 'తధికిణతోం!' అనిరిగాని బ్రహ్మాండమను వంటి భావమును చదువరిమనసును చొప్పింపరైరి. పిండికట్లును, పంగనామములును భావబంధురములైనవే కావచ్చును. కాని యింతపిండిని, ఇంత సున్నమును-పూర్వమెవరో పూసికొనిరని చెప్పి-భాషాసమితికి పూసి "జే! జే!" అనిన సారస్వతాంగన సర్వాంగ సుందరియై చూపట్టునా? కాలము ననుసరించిన స్వేచ్ఛ-ఇష్టా విహారమును కాదు-నీయక భాషకు తిమ్మెర లెక్కించినచో, అది ఒక యడుగైనా కదల జాలునా? ముండ్ల పుంతలందే నడచుచు, పాతగాడియందే మనసు నిలుపుచుండుటచే సర్వతోముఖమైన జాత్యుద్ధరణమునకు వలయు భావములను ఆంధ్రులు వ్యక్తీకరింపలేదు. ఈ యుద్ధరణమునకు వలసినది సంచలనము, సమధికమగు గమనిక, స్వాతంత్ర్య మనిగాని, జాత్యుద్ధరణ మనిగాని, భాషా స్వరాజ్యమనిగాని, భావముల కాంగ్రెసనిగాని పెడ బొబ్బలుపెట్టక, భాషయందలి సంచలనమునకై శ్రీ రామమూర్తి చెమట లోడ్చెను.

భాషగాని భాషను తెగనఱుకుటకును, భావముయొక్క కుత్తుకబంటి దురంతమున కొడిగట్టు స్థూలకాయ భాష మచ్చమాపుటకును, నిర్హేతుకముగ వెలివడిన భాషను పంఘమందు పునరుద్ధరించుటకును, భాషయందు స్వాతంత్ర్యసిద్ధి జూపుటకును ఈతడు నిద్రాహారములకు తిలోదకములు విడెను. తెవులును చంపికదా వైద్యుడు రోగిని నిలిపి, పిదప బలమునకు మందొసగును. రుద్రుని పని ముగిసినగాని, విష్ణువునకు గాని, విధికిగాని పని యేముండును? యుయుధాన విజృంభణము ముగిసిన పిదపగదా విరాట ప్రజ్ఞకుగాని, ద్రుపద శక్తికిగాని ధర్మక్షేత్రమగు కర్మక్షేత్రమున పని యుండును! ఒంటరియై పాటుపడుచున్నందున, శ్రీరామమూర్తి రుద్రక్రియకే అర్ధశతాబ్దమును వెచ్చించెను. తక్కిన రెండు పనులు ముగిసినగాని ఈతని భాషా సేవ ముగియదు. నేడు భీష్ముడైయున్న ఈతనికి శంతనవర మేమైన ఉండకపోదా?

శ్రీరామమూర్తిని రుద్రుడనుటకు ఎన్నేని కారణము లున్నవి. పోను పోను మనకే కారణములు పొడగట్టుచునే యుండును. రుద్రుడు తపసి. శ్రీరామమూర్తివంటి పట్టుదలగల తపసి తెల్గులందు మఱొక్కరు లేరు. ప్రపంచము నంతను నిదురవోవ నిచ్చి, దినంతులు గొట్టు దివిదీపమునకు గర్వభంగమొనరించిన యోధు డీతడు. శిలా శాసనముల నుండియు, చెదపుర్వుల పొట్టలనుండియు, బూజుగట్టిన తాటియాకుల నుండియు, శతాబ్దముల లోతుగుండియల నుండియు తెలుగు మాటల ఉత్పత్తిని, తెలుగు తల్లి మోమును, తెలుగు పదముల ప్రయోగమును, కాలక్రమమున నన్యభాషా సంపర్కమున తెలుగున గోచరించిన మార్పులను చూపి నేటి తెలుగుశైలి మారుపుగనుట అనివార్యమని నిరూపించుట కీతడు పడిన పాట్లు అనిర్వచనీయములు. తక్కిన భాషలందలి సంచలనము నిరూపించుటకై ఇత డాయా సారస్వతములను తఱచి వానియందలి లక్ష్మిని తన భాగ్యలక్ష్మి జేసికొనక

పోయినను, తన పూతకర్తవ్య నిర్వహణమునకై వలయు పరిజ్ఞానమునకై ఒరుల సహాయ్యము నెఱుగక తీరిక నెఱుగక ఈతడెంతేని యత్నము సలిపెను. ఉచ్చారణమందు తప్పులను దాటిపోలేక పోయినను, ఈతడు వంగభాష చదువుట నే నెఱుగుదును. మూల శబ్దములు వాడుకమాట లెట్లగునో నిరూపించుటకు ఒప్పగు హిందీ పదముల నీతడు పేర్కొనుట నే నెరుగుదును. పాళీభాషలో కూడా పాండిత్యము సంపాదించి మంగళసుత్తము చదువుచుండగా నేను చెవులార వింటిని. ఆంగ్లభాష యందలి సంచలన వృత్తాంతము నీత డేకరువు బెట్టుట నే నెరుగుదును. అక్కరములు లేని సవర భాషను గూడెములందు దిరిగి శోధించి దానికి వ్యాకరణమును, నిఘంటువును నీతడు వ్రాయుట నేను కాంచితిని. నా అంతరంగమిత్రుడు శ్రీ సునీతి కుమార ఛటర్జీయును, నాకు మిగుల గూర్పు గురువగు అమూల్య చరణ్ విద్యాభూషణుడును అన్యభాషల నేర్పు పట్ల కావించిన యత్నములందించుక పాల్గొని వారికేనయైన ఆంధ్రుడు శ్రీ రామమూర్తి యొక్కడే యని గ్రహించి ఆతనితో కొన్ని దినములున్నపుడు నేను మిగుల మురిసితిని. హరినాథదేవతె నీతడు భాషా రత్నాకరమున బుడుంగున తన మనసును నింపకున్నను, భాషయందలి బాల్యయౌవనముల నెఱుంగుటకై అనల్పమైన శ్రమ సలిపెను. ఈ కృషియందు ఆంధ్రులలో ఈతనికి ఈతడే సాటియని నొక్కి చెప్పుదును.

"Style is the man"అని Newman ను "Style is psychological" అని Dequincy యును తెలిపినట్లు రచన తత్వమును భావ హృదయమును, శైలి దృష్టియు నీతడు నిరూపించి యుండినచో బాగుగ నుండెడిది. తన గమ్యస్థానమును చెప్పి, త్రోవలోని డొంకలను తెగ నఱుకుటకై ఈతడు పయనమై యుండినచో, ఆంధ్ర ప్రపంచ మంతయు నే డీతని ననుకరించుచే గాక, ఈతని అడుగులకు మడుగు లొత్తెడిది. తన గమ్యస్థానమును తెలుపక-ఈతని భాషా వ్యాయామ మీతని గమ్య స్థాన మని నేను తలపను-ఈతడు పొదల నరుకుటకును, మూలబడియున్న ప్రాత యంటులను నాటుటకును, పూనుకొనినందున "ఏమి తెగువ?"ని పలువురు ఉలికిపడిరి. ఇంచుమించుగ అందఱి కవుల వ్రాతలు ఈతని కత్తి పోటును చవి చూచినవి. "వేదమువారి గ్రంథములందే వేనవేలు తప్పులుండ ఇక తక్కిన వారి వ్రాతల మాటేమి ?" అని ఈతడు జలదగంభీరస్వరమున పలికినపుడు పలువురు పండితుల గుండెలు దడదడలాడినవి ! శ్రీపాదవారికిని వీరికిని గల చుట్టరికము, కోఁచూపులందును, కోసైన మాట లందును ఉన్న దని ఆంధ్ర ప్రపంచ మెఱుగును. "ఈతనికి సంస్కృతము గాని, ప్రాచీనాంధ్రము గాని వచ్చినట్లు తోచదు. ఇటువంటి అయ్యల విమర్శనమునకు మీవంటివారు ఉపేక్షిస్తారు." అని శ్రీరామమూర్తి మల్లాది వారికి వ్రాసిరి. ఈ లేఖ మాడపట్టున తగిలినంతనే రెండవవారు, కొంత కాలము "వజ్రాయుధము"ను ఝళిపించిరి. శ్రీరామమూర్తి వెనుకకు తగ్గలేదు-మోమోటమునకై దగ్గనైనా దగ్గలేదు ఆవలింతకైన తా వీయలేదు. శ్రీరాముడు అగ్గిరాము డాయెననియు, గిడుగు రాముడు పిడుగు రాముడాయె ననియు ఎల్లరి ప్రతిపక్షులు ప్రక్కసందుల్లో దూరి "బ్రతుకు జీవుడా !" అనుకొనిరి.

తప్పులను పట్టుచే పనిగలవాడు దొంగలను పట్టువానివలె అడలు పుట్టించును. బాహ్య ప్రపంచమందువలెనె సాహిత్య ప్రపంచమున పోలీసుగిరి "అమ్మో" అనిపించును. ఆదర్శప్రాయుడగు భాషా సేవకుడు రాజువంటివాడుగాని హృదయమును బిగించుకొనిన పోలీసు కాడు శ్రీ రామమూర్తి భాష యొక్క Jurisprudence (ధర్మశాస్త్రము) చదివి చదివి నమిలి నమిలి మ్రింగినాడు. "శిక్షణము, రక్షణము, పోషణములకు మూలకందమైన రాజన్యుడవు కమ్మని అతనికి తెలుపనక్కరలేదు; రుద్రక్రియకై అతడు మెచ్చింపగూడదని; సమయమును నెంతో మెచ్చించివైచెను విమర్శ ఎన్నడును గొడ్డలి పెట్టగుచో, భాషకు మేలొదవుటకు మాఱు కీడు మూడును భావమును మూలి పడద్రోసి, మాటలకై సాగించిన పెనుగులాటకును తీరి కూర్చుని 'దూసుకో'మ్మను ఆడువారి కయ్యమునకును భేద ముండదు. పనమాటల పెనుగులాట ఒక యుద్దేశమునకు మార్గము కాని, తన యుద్దేశసిద్ధి కాదనియు, ఔషధ క్రియమాత్రము తన పనిగాక తండ్రి క్రియ యగు పోషణమును, తల్లి కర్తవ్యమగు భావన జీవన వృద్ధియు సారస్వత వసుంధరపై తాను నెఱపవలయు ముఖ్య కృత్య మనియు నేటి Destructive Criticism తనగమ్యస్థానం కాదనియు, శ్రీరామమూర్తి చెప్పి యుండినచో, ఈ పటలోనే తన కురుక్షేత్రమున తరువాతి యవతారమట్లుతోచి తన పాంచజన్యమును పూరించెడువాడు!

పూలచెండు పడునది శ్రీ రామమూర్తి భాషా సేవ మీదనా, శ్రీ రామమూర్తి మీదనా అని కాదా తొలి ప్రశ్న? ఒకవిధమైన భాషాసేవ యందీతడు ఒంటరియై యున్నట్లే తక్కిన గుణములందు గూడ నీత డించు మించుగ నొంటరియై యున్నాడు. సాహసము, ఇచ్ఛాశక్తి, దృఢ నిశ్చయము, స్వాతంత్ర్యేచ్ఛ, నిరంతర పరిశ్రమ మున్నగు మహాపురుష లక్షణములు కలిసి శ్రీ రామమూర్తి అయినాడు. ఈతడేగురునొద్దను విద్య నభ్యసించలేదు. తనంత తాను చదివి తుది కొమ్మ నెక్కెను. తన భాషా సంస్కరణోద్యమము పెంపొందుటకై నిస్సహాయుడై ఆంధ్ర మందును, ఆంగ్ల మందును ఈతడు కొంతకాలము పత్రికలు నడిపెను తొలుత నీతడు సింహనాద మొనరించినపుడు, ఆంధ్ర పండితులు గదలు చేబూనిరి. మత సంస్కరణమునకు కందుకూరి పంతులు తొడరినపుడు తోచిన కన్నెఱ్ఱలును, వెక్కిరింతలును, మూతి విరుపులును, చేతి దూపులును ఈతని గూడ మార్కొనినవి. మార్కొనినపుడు పర్లాకిమిడి రాముడు భార్గవ రాముడాయెను! "హతోస్మి" అనుట గాని నీరు నములుట గాని ఈతని ప్రకృతికి విరుద్ధము. ఈ మహారథుని మ్రోల పలువురు పండిత ప్రకాండులు జయద్రథులైరి. రామ బాణము మ్రోల ఖరదూషణులు నిలువజాలరైరి పిడివాదము లీతని హేతువాదమును మార్కొని తుత్తునియలై నేల రాలినవి! శ్రీరామమూర్తి ఆయుధము విజ్ఞానము! ఈ విజ్ఞానము తళ్కొత్తునవి నిరపాయమైన వజ్రపు మెఱపులు కావు. ప్రతికక్షిని వీడని వెసూవియస్ జ్వాలలు సభాంగణమున నీతని ఎదుట నిలిచిన పండితుడు ఆంధ్ర మండలమున లేడు. ఎదుటివాడెంత దుండగీడైనను, ఒకమాఱు చెంపపెట్టు పెట్టినట్లును, వేఱొకమాఱు ముక్కునకు సూటిగా గ్రుద్దినట్లును, ఇంకొకతూరి చింతబరిక చేబూని మీది కురికినట్లును, మఱొకపుడు కుత్తుకపట్టి చిత్తుచేసినట్లును ఈతడు వాదించును! ఈతని పండ్ల పటపటయందువాడియైన తర్కమున్నది! ఈతని తీక్ష్ణదృక్కులందు మిరుమిట్లు గొలుపు సారస్వతమున్నది!! ఈతని బల్లెంపుటూత్తులందు కోసైన మీమాంస యున్నది!!! ఈతని పిడికిలియందు బలమైన ఆత్మవిశ్వాసమున్నది!!!! సభాంగణములందీతని యంతరంగ మండలి శక్తి ఈతని నీఱు జేసివైచును. ఈతని చూచి అడలనివారు చెవియొద్ద నీతని 'డ్రమ్' చూచి తోక ముడుచుకొని పరారి యగుదురు! సహవాస ఫలమున నీతని చెవియంత్రము కూడా చేతన శక్తి నందెను! "నీది తప్పు"అని కొమ్ములు తిరిగిన విద్వాంసులను నిలువంబెట్టి గూబకు బెత్తెడు చూచినట్లీతడు పలుమాఱు వాకొనెను! "నీదే తప్పు" అని మరల—తెరలో గాదు ఎదుట—పలికి ఈతని ముందీవఱలో నెవ్వరును నిలువలేదు. ఈతని వాదన యొక్క పోటును, వాక్కు యొక్క ధాటియును ఎన్నో శాల్వలను చింపి, మూటగట్టి మూల నుంచెను! ఎన్నియో కుండలములను అట్టిటు లాడించినవి! గంటల కొలది చదువుట ఈతని కెట్లలవాటో, గంటలకొలది ఉపన్యసించుట ఈతని కట్లే అభ్యాసము! ఈతని చదువుల గదిలో బ్రవేశించి చూడుడు. ప్రపంచముయొక్క ఎన్సైక్లోపీడియాలు-ఎన్సైక్లోపీడియాను మించిన ఎన్సైక్లోపీడియాలు అందుండును. ఈత డుత్తరములను గూడ కంఠస్థ మొనరించును! కామా,ఫుల్‌స్టాపులనైన ఈతడు కదల్పక ఉండడు. తానువ్రాయు ముఖ్య లేఖలకు నకలు ఫైలు నుంచుకొనును. రాయసం వారి కీతడు ఒకప్పుడు వ్రాసిన ఉత్తరము యొక్క కాపీ నేడును ఈతని పెట్టెలో నున్నది. ఈతని యుత్తరపు టూక్తులకు గూడ సూది మొనలుండును! ఈతని చదువు, ఈతని వాసములను పెంకెములను పట్టియున్నది! ఈతని దొడ్డిలోని ఆవు కూడ ఫైలాలజీ (Philology) సూత్రముల తో అంబా అనును. శ్రీ రామమూర్తి వంటి భీమ కర్ములు ఆంధ్రులందు మిక్కిలి తక్కువగ నున్నారు.

నేటిచెండుల నందున దీతని శక్తియా, ఆంధ్ర శక్తియా, అని కాదా తొలిప్రశ్న! ఆంధ్రుని పట్టుదల ఇతిహాసముల నాటిదైనది. నేడది వెనుక గంతు వైచినది. తన జాతిశక్తిని తనయందు ప్రస్ఫుటిత మొనరించిన కొలదిమంది ఆంధ్ర వీరులలో శ్రీరామమూర్తి యొకడు. స్వయంశక్తిపై నాధారపడి ఈతడు పైకి వచ్చెను. ఈతని జిజ్ఞాస ఈతని యింటబుట్టినది కాదు. జిజ్ఞాస సింధువున నీతనికి తెరువుజూపు ధ్రువనక్షత్ర మేమియు గిడుగు భవనమున లేదు. ఈతనికి దృష్టాంతరమైన వీతడే కాని మరొక్కరుడు లేడు. ఇందుపల్లినుండి మూటముల్లెలు కట్టినవాడే ఈతడు వేఱు పురుషుడాయెను. నాడే ఆతని యెదుట ఎత్తైన కొండ తోచినది! బనియన్ తెలిపిన యాత్రికునివలె (Vide Bunayan's Pilgrims Progress) నడుము గట్టి ఈతడు కొండను పట్టెను. వెనుక లోయనుగాని, ప్రక్క పుంతనుగాని ఈతడు చూడలేదు. ఈ యాత్మ నిర్భరత్వమే భాషాసేవయందీతనికి ధృతిని, విజయమును చేకూర్చినది! ఈతని విజయము ఆంధ్రజాతి విజయము.

["వ్యాస సంగ్రహం" నుంచి సంగృహీతం]

# వ్యావహారికభాష; ప్రజాసాహిత్యం

*గిడుగు వెంకట సీతాపతి*

**కా**లము మారుతూ ఉన్నది, లోకము మారుతూ ఉన్నది మార్పు ప్రకృతి సిద్ధమే కాని ప్రకృతి విరుద్ధము కాదు. మానవ జీవితములో ఏ విషయములో నైనా ఒకమార్పు కలిగినప్పుడు దాని కనుకూలమైన మార్పు తక్కిన విషయములలో సైతము కనబడకపోదు ఏదో ఒక రోగమో లోపమో వస్తేనేతప్ప ఒకకన్ను మీదికీ మరియొక కన్ను క్రిందికీ చూడడము ఎట్లు జరుగదో అట్లే ప్రజలదృష్టి రాజకీయ విషయములలో మీదికీ తక్కిన విషయములలో క్రిందికీపోదు. ఆరోగ్యము బాగుగా ఉన్నంతకాలము దేహమందలి అవయవములలో ఒకటి పెరుగుతూ ఉండడము మరియొకటి క్షీణించడము ఎట్లు జరుగదో అట్లే రాజకీయంగా ప్రజలస్వామ్య మభివృద్ధిపొందుతూ ఉన్నప్పుడు ప్రజల భాషకూడా ప్రబలక తప్పదు.

రాజుచిత్తమే రాజనీతియై
రాజు సేవయే ప్రజల ధర్మమై
రాజు కోసమే దేశము నిల్చి
రోజులప్పుడే దాటిపోయినవి
పండిత చిత్తమె భాషకు గతియై
పండిత సేవయై కవుల ధర్మమై
పండితార్థమే వాఙ్మయ మంతా
ప్రబలిన కాలము నిల్చియుండునా?

పూర్వకాలములో బమ్మెరపోతరాజు వంటి భాగవతోత్తములు ఎవరో ఇద్దరు ముగ్గురుతప్ప తక్కిన కవీశ్వరులందరూ రాజుల ఆస్థానములలో ఉండిన పండితుల మెప్పుకోసము, వారిద్వారా రాజుల మెప్పుకోసము శబ్దాలంకారములు అర్థాలంకారములు కలిగి క్లిష్టమైన శైలిలో రచితములయిన పద్యకావ్యములు వెల్లడిస్తూ ఉండేవారు అంతేకాని సాధారణ ప్రజలు తమంతతాము చదువుకొని అర్థము చేసికోదగిన గ్రంథములు రచించేవారు కారు సామాన్యజనుల ఆనందముకోసం సామాన్య విద్య అలవరచుకొన్న కవులు కొందరు జానపద గేయాలు రచించడమును అవి పామరజనము పాడుకోవడమున్ను జరుగుతూ ఉండేది కాని వాటి యెడల పండితులకు ఆదరముగాని గౌరవముగాని ఉండేదికాదు క్షేత్రయవంటి వాగ్గేయకారులు రచించిన పాటలనైనా పండితులు గౌరవించినట్లు కనబడలేదు అప్పకవి మొదలయిన లక్షణకర్తలు తమ లక్షణములకు లక్ష్యములుగా ప్రబంధాది పద్యకావ్యములందలి ప్రయోగములను ఉదాహరించినవారే కాని గేయముల నుండి ప్రయోగములను నుద్ధరించేవారు కారు. అంతేకాదు అప్పకవి శూద్ర కవిత్వము కాకి ముట్టుకొన్న హవిస్సువలె ఉండునని నిరసించినాడు, ఆముక్తమాల్యద పెద్దనగారి రచనయే అన్న ఉద్దేశముతోను, విజయవిలాసము, సారంగధర చరిత్ర రచించిన చేమకూర కవి బ్రాహ్మణుడన్న అభిప్రాయముతోను వాటిలో గల ప్రయోగములను ఎత్తి చూపించినాడు

కాలము మారిపోయినది. నిరంకుశముగా దేశము ఏలిన రాజులు లేరు. ప్రజాస్వామ్యము స్థిరపడుతున్నది. కనుక ప్రజల విజ్ఞానాభివృద్ధికోసము, ప్రజల ఆనందముకోసము ప్రజాసాహిత్య శాస్త్రాది గ్రంథాలు కావలసిన కాలము వచ్చినది. ఎవరో ఒక పండితుడు భారతమో భాగవతమో రామాయణమో చదువుతూ వాడుక భాషలో అర్థము చెప్తూ పురాణ కాలక్షేపము చేస్తూ ఉంటే ప్రజలు వింటూ విజ్ఞానము పొందగలరు, ముక్తి పొందగలరు అనే రోజులు పోయినవి. ఎవరిమట్టుకు వారు ఇంటివద్ద చదువుకోదగిన గ్రంథాలు కావలసిన కాలము వచ్చినది అట్టి గ్రంథాలు జీవద్భాషలో ఉంటేనే కాని ప్రజ లాదరించరు

కొన్ని విదేశ భాషలలో గత నూరు సంవత్సరములలోను వేలకొలదిగా గ్రంథములు ప్రజల భాషలో రచితములయినవి. అంతేకాదు, భావిపౌరులు కానున్న పిల్లలకోసము కూడా బాల సాహిత్య గ్రంథములు వేలకొలదిగా ప్రకటితములయినవి రచితమైన ప్రతి గ్రంథము ఆచంద్రతారార్కము ప్రజల ఉపయోగమునకు నిలిచి ఉండవలెనన్న పట్టుదలలేదు ఉత్తమ గ్రంథాలు పుస్తక భాండాగారములలో ఉంటవి, కావలసినవారు చదువుకోవచ్చును. అవి ప్రాచీన భాషలో ఉండి ప్రజాసామాన్యమునకు అర్థము కావడము కష్టమని తోచినప్పుడు వాటిని నేటి భాషలోకి మార్చి ప్రకటిస్తారు. చాసర్ కవి వ్రాసిన కావ్యాలు, ఇప్పుడు విద్యాలయాలలో పాఠ్య గ్రంథాలుగా

ఉన్నవి. చాసరు వ్రాసిన భాషలోలేవు. గ్రంథము లన్నిటి కంటెను ఎక్కువ ప్రచారములోవున్న గ్రంథము బైబిలు. అది రెండుసార్లు ఆయా కాలమందుంచిన జీవద్భాషలోనికి పరివర్తనము పొందినది మన దేశమందలి సంప్రదాయమందుకు విపరీతమయినది. మనకు కావలసినది గ్రంథములలోని విజ్ఞానము కాదు, భాష! ఋగ్వేదముగాని తక్కిన వేదములుగాని ఉపనిషత్తులుగాని తెలుగువంటి ఆధునిక దేశ భాషలలోనేకాదు, పాణినీయ లక్షణములకు లక్ష్యమైన సంస్కృత భాషలోనికి అనువదించినా వాటి పవిత్రతకు భంగము కలుగుతుందన్న భయము గల పండితులు నేటికిని కనబడుతున్నారు అంతకంటె విపరీతమైన విషయ మేమంటే అర్థమయినా కాకపోయినా వేదము కంఠస్థముచేసి స్వరయుక్తముగా పఠింపగల బ్రాహ్మణులు అవధానులు, గౌరవార్హులు! తా ముచ్చరిస్తూవున్న మంత్రముల కర్థమేమో తెలియకపోయినా యజ్ఞములు చేసేవారికీ చేయించే వారికీ కర్మఫలముగా మోక్షము సిద్ధిస్తుందన్న నమ్మకము కలవారు నేటికిన్నీ కనబడుతున్నారు ఇట్టి సంప్రదాయమునకు అలవడి, ఇట్టి వాతావరణములో పుట్టి పెరిగిన వారికి-అందరికీ కాకపోయినా కొందరికి కావ్యభాషలోనే-అనగా వాడుకలో లేని 'పాతవడ్డ' పలుకులుగల 'గ్రాంథిక' భాషలోనే పద్య కావ్యములే కాదు, వివిధ విషయములకును సంబంధించిన వచన గ్రంథములూ, పిల్లలు చదువుకోవలసిన చిన్నపుస్తకములూ-అన్నీ రచించవలెనన్న ఆశయము కలదంటే ఆశ్చర్యపడ నక్కరలేదు అట్టి వారికి గ్రంథములలోని విషయముకంటె భాషలో వారనుకొంటూవున్న గ్రాంథికత్వమే ఎక్కువ ముఖ్యము. అట్టి వారు లెస్సగా తెలిసికోవలసిన విషయములు మనవిచేస్తాను.

భాష మాటలాడే మానవ సంఘమునకు సంబంధించినది. ఆ మానవ సంఘముతోపాటు జీవిస్తూ కాలపరిస్థితులను బట్టి మారుతూఉంటుంది. ఆ మానవ సంఘమునకు గల సంస్కృతికి అనుకూలముగా పరిణత పొందుతూ ఉంటుంది; అభివృద్ధి రెండుశక్తులకు లోబడి ఉంటుంది - అంతఃశక్తికి, ఇతర ప్రాభవమునకు

అణుమాత్రంబగు మట్టి విత్తనము మొ
లకైలేచు, నేపారు, చి
క్కని చెట్టైన నలెత్తు కాచు; నురు శా
ఖల్ సాచు; నందుండి నే
లను దాకన్ బదునూడలన్ విడుచు; వే
ళ్ళన్ జాచు; నట్లే కదా
తనరున్ భాషయు ప్రాణమున్నవఱకున్
దప్పేమి యో భారతీ!

జెలలై పుట్టి; స్రవించి, వర్షములకున్
వెన్నొంది; శాఖానదుల్
గలియన్ బెంపునుబొంది; పుష్కలతరం
గ శ్రేణి నృత్యంబుతో
నలరన్ బాఱెడు నమ్మహానదుల సా
మ్యంబొప్పి భాషల్ భువిన్
విలసిల్లున్ గద యెల్ల కాలమును ని
ర్విఘ్నంబుగా భారతీ!

అన్నాను.

భాష వృద్ధిపొందుతూ ఉంటుందంటే ఒక్క శబ్దజాలములోనే కాదు, పదముల రూపములలోను, అర్థములవ్యాప్తిలోను, భావనిరూపణములోను, వాక్య విన్యాసములోను, రీతిలోను మార్పుచెందుతూ వృద్ధిపొందుతూఉంటుంది. పిల్లలకయినా పెద్దలకయినా భావములు ముందుగా కలుగుతూ ఉంటవి. ఆ భావములను వ్యక్తము చేయుటకు తగినభాషకోసము ప్రయత్నము జరుగుతూ ఉంటుంది. నూతన భావములు పుట్టినప్పుడు నూతన పదజాలముగాని ఉన్న పదములతో నూతన విన్యాసముగాని కావలెను. ఏ భాషఅయినా దానిని మాతృభాషగా మాటలాడువారుతమకు తెలియకుండానే కల్పన చేయవచ్చు. అది అందరికీ అలవడవచ్చును. అట్లు అలవడినదే నిలుస్తుంది.

ఏ దేశములోనైనా ఏ భాషలోనైనా చాలాకాలము జనులు మాటలాడుతూ పాటలు పాడుకొంటూ, కథలు చెప్పుకొంటూ ప్రసంగములు సాగిస్తూ వున్న తర్వాతను గాని వారికి వ్రాయుట చదువుట అలవడలేదు. గ్రంథములే లేని కాలములో గ్రాంథిక భాష అంటూ వుండదు గదా? తొల్లింటి కావ్యమునకుగాని, పాటకుగాని ఉపయుక్తమయిన భాష జనులు మాటలాడుకొంటూ వుండిన వ్యావహారిక భాషయే కదా కావలెను ఒకటి రెండు గ్రంథములు పుట్టిన తర్వాతనుగాని గ్రాంథికభాషఅంటూ వుండదు. పుట్టిన గ్రంథములలోని భాష ఆకర్షకముగా వుంటే ఆ తర్వాత పుట్టిన కవులకు ఆదర్శప్రాయ మవుతుంది. ఆ తొల్లింటి గ్రంథములలోని భాష కొద్దిగా మార్పుచెందుట కూడా సహజముగా జరుగుతుంది. కొన్ని శబ్దములు, కొన్ని పద రూపములు వాడుకనుండి పోవచ్చును కొన్ని నూతనముగా పుట్టవచ్చును క్రొత్త ప్రాతల కలియిక కూడా కనబడవచ్చును. కొంతకాలము గడచిన తర్వాత మొదటి కావ్యములలోని శబ్దములు పదముల రూపములు వ్యవహార భ్రష్టములై

కాక జనసామాన్యమునకు అర్థము కాక పోవచ్చును. అట్టివి వాడకూడదన్న నియమము కూడా కొన్ని భాషలవారు చేసికొన్నారు. వేదములందలి భాష కొంతకాలానికి జనులకు బోధపడనంతగా మారిపోయినది. అటువంటి సమయము లోనే నిరుక్తములు, వ్యాకరణములు పుడుతూ వుంటవి. ప్రాచీన భాష శ్రమ పడి నేర్చిన వారు ఆ గ్రంథములు రచిస్తూ ఉంటారు. వారికైనను కొన్ని చోట్ల ఆ ప్రాచీన భాషా పదములు అర్థము చేసికొనుటలో సందేహములు కలుగుతూ వుంటవి. అప్పుడు వాటికి అర్థ వివరణము చేస్తూ "యద్వా" "యద్వా" అంటూ వుంటారు, కొన్ని పొరపాట్లు కూడా చేస్తూ వుంటారు. వ్యాకరణ విషయములోను ప్రాచీన భాషా పద నిరూపణములో పొరపాట్లు జరిగినవి. పాణిని నాటికి వేదభాషా పద రూపములు కొన్ని వాడుకనుండితప్పినవి. వాటిని ఆర్వ ప్రయోగము లన్నారు. అవి "భాష"లో ప్రయోగింపరాదన్నారు. వాల్మీకి రామాయణములోను, భగవద్గీత లోను 'భాష'లో వాడరాదన్న పద రూపాలు కనబడుతున్నవి. నేనొక చోట యత్ అనేది పరస్మైపదలో ప్రయోగించినప్పుడు అది తప్పు అన్నారు. భగవద్గీతలో "యతతోఽప్యాః కౌంతేయ!" అని ఉన్నది గదా? అంటే అది ఆర్వప్రయోగము 'భాష'లో ప్రయోగింపరాద న్నారు. సర్వజ్ఞ సింగభూపాలుడు 'పుత్రిక'అనే అర్థముతో 'నందన' అనే శబ్దము ప్రయోగిస్తే సిద్ధాంత కౌముది అమరము మాత్రమే చదువుకొన్న పండితులు తప్పు అన్నారు పతంజలి మహా భాష్యములో "నందనాపి" గ్రామ్యమైనది గనుక తప్పు కాదన్నారు తెలిసిన వారు. ఇది అంతా ఎందుకు చెప్తున్నా నంటే ప్రాతవడి వ్యవహార భ్రష్టము లయిన శబ్దరూపములు ప్రయోగింప రాదన్న నియమము సంస్కృతములో వున్నదిగాని మన తెలుగు భాషలో అన వుడు నావుడు మొదలుకొని చేయకువే వఱకున్న అన్నీ గ్రామ్యములే; అంతే కాదు అట్టివెంత ఎక్కువగా ప్రయోగిస్తే అంత గొప్పగా ఎన్నుకొంటున్నాము. రసజ్ఞులయిన కవులు అట్టి ప్రయోగములు గల కావ్యములను మెచ్చుకోరు. తిక్కన సోమయాజి కుకవి నిందచేస్తూ ఏమన్నాడో జ్ఞప్తికి తెచ్చుకొందురు గాక !

"పలుకుల పొందులేక రసభంగము
 సేయుచుఁ బ్రాతవడ్డ మా
టలఁదమనేర్పు నూపి యొకటన్
 హృదయం బలరింపలేక యే
పొలమునుఁగాని యట్టిక్రమముం
 దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయం జరించు కుకవుల్
 ధర దుర్విటు లట్ల చూడఁగన్ ॥"

పద్యము చదివినంతనే వినే వారికి బోధపడేటట్లు రచన సాగింపగల వాడే కవి అంతేకాని తా నర్థము చెప్తేనే కాని వినేవారికి బోధపడనట్లు పద్యములు రచించే వాడు రసజ్ఞుడయిన కవి కాజాలడు.

"తేనెసోక నోరు తియ్యనయగు రీతిఁ
 దోడ నర్థమెల్ల దోపకున్న
గూఢశబ్ద వితతిఁ గొట్లాడు పనియెల్ల
 మూఁగ చెవిటివాని ముచ్చటరయ ॥"

అన్నారు మరియొకరు.

గాల్జ్‌వర్ది అనే ఆంగ్లేయ మహాకవి "జనులు మాటలాడుకొంటూ ఉన్నట్లు ప్రసంగములు కల్పించి వినేవారికి ఉల్లాసకరముగాను, మనోహరముగాను రచితమయిన కథయే సాహిత్య గౌరవమును పొందగల" దన్నాడు. అర్థము సులభముగా కాని శబ్దజాలముతో రచితములయిన కావ్యములకు గల ప్రయోజనము అత్యల్పము; అవి గ్రంథాలయములలోను అల్పసంఖ్యాకులయిన పండితుల వద్దను నిలుచునే కాని సామాన్య జనుల ఇండ్లలో ఉండవు.

గ్రాంథిక భాష ఎప్పటికీ ఒక్క తీరుననే ఉంటుందనిన్ని అందుచేత అందులో రచితములయిన గ్రంథములు కలకాలము నిలిచి ఉండవనిన్ని వ్యావహారిక భాష కడు వేగముగా మారిపోతూ ఉంటుం దనిన్ని, అందుచేత ఈ తరము వారు తమ వ్యవహారమందలి భాషలో రచించిన గ్రంథములు వచ్చేతరము వారికి బోధపడ వనిన్నీ కొందరు తెలిసియో తెలియకనో అంటూ ఉంటారు. ఏబది యేండ్లయి కొందరు ఈ వాదము పాడిందే పాటగా చేస్తూన్నారు అందుకు మేము చెప్పిన సమాధానములు ప్రకటితము లయినా చూడరు; లేదా చూచినీ్న చూడనట్లుగా ప్రసంగిస్తారు. మా సమాధానాలు సరియైనవి కావన్నవారు అందులో లోప మెక్కడ గలదో చెప్పనయినా చెప్పరు. అందువలన వారివలెనే మేమున్ను పాడిందే పాటగా సమాధానములు మరల మరల చెప్పవలసివస్తున్నది. "గ్రాంథిక" భాష వేగముగా మారదనిన్ని మారినా కృషిచేసి నేర్చుకోదగిన దనిన్ని అంటారు. మారకపోతే శృంగారనైషధము, మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యద, హరిశ్చంద్రనలోపాఖ్యానము మొదలైన ప్రబంధాలకు వ్యాఖ్యానాలెందుకు రచించవలసి వస్తున్నది? అచ్చ తెలుగులో

రచితములయిన యయాతిచరిత్రమువంటి గ్రంథాలు సాధారణ పండితులకు సులువుగా అర్థము కాకపోవడానికి కారణమేమి ? ఎంత కృషి చేసినా ఎంత గొప్ప పండితులయినా గ్రాంథిక భాషలో గ్రంథములు రచించిన వారికి తప్పులు తప్పవేమి ? కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు రచించిన గ్రంథాలలో నూర్లకొలదిగా తప్పులున్నవని వేదము వేంకటరాయ శాస్త్రిలుగారు వ్రాస్తే, శాస్త్రిలుగారు అందులో కొన్ని వాస్తవముగా తప్పులు కావన్న సంగతి తెలియక మిథ్యాపవాదము చేసినారని మా తండ్రిగారు తెలియజేసినారు. నిర్దుష్టముగా "గ్రాంథిక" భాషలో రచించిన వారు ఒక్కరూ కనబడ లేదనిన్ని మాతృ భాషలో రచితములైన గ్రంథములందు వచ్చుటకు అవకాశము లేని (మీరు వచ్చిరి) వంటి తప్పులు "గ్రాంథిక" భాషలో రచితము లయిన గ్రంథములందు కనబడుతున్న వనిన్ని నిదర్శనములను చూపిస్తూ ఋజువు చేసినారు. ఏది తప్పో ఏది కాదో తెలిసికొనుటకు ఆధారాలు తక్కువ. ఉన్న వ్యాకరణాలు చిన్నవి, కొన్ని విషయాలలో పరస్పర విరుద్ధము లయినవి. నన్నయభట్టీయమనే పేరనున్న ఆంధ్రశబ్దచింతామణి అప్పకవి చెప్పిన కథనుబట్టి ఆ వ్యాకరణ విషయము బాల సరస్వతి కాలమువఱకున్ను ఎవరికిన్ని తెలియదటగదా. అంతవఱకున్ను తిక్కన యెఱ్ఱనాది కవులు ఏ వ్యాకరణ సూత్రాల ననుసరించి తమ కావ్యాలు రచించారు? కేతన వ్రాసిన వ్యాకరణము కడుచిన్నది. అతడున్ను ఆంధ్రశబ్ద చింతామణి కర్తయున్ను సంపూర్ణముగా తెలుగు భాషకు వ్యాకరణ సూత్రాలు వ్రాయలేదు. వారు చెప్పక విడిచిన విషయాలలో కవులు ఏ ప్రమాణములను ఆధారముగా గ్రహించి తమ రచనలు సాగించారు ?

ఇంతకూ వ్యాకరణమువలన ప్రయోజన మేమి ? అది ఎట్లు రచితమగుతుంది. లక్ష్యములనుబట్టి లక్షణము ఏర్పడుతుందా? లేక లక్షణమునుబట్టి లక్ష్యములు ఏర్పడుతవా ? ఈ మొదలయిన విషయములు లెస్సగా ఆలోచించి తెలిసికోక తెలిసినవారు, చెప్పినది వినిపించుకోక మొండివాదములు చేస్తూ ఉంటారు కొందరు. ప్రారంభదశలో అనగా ఏ గ్రంథమూ లేనికాలములో గ్రంథ రచన ప్రారంభించిన కాలములో రచయితలకు తమలోకమందు తాము మాతృభాషగా అలవరచుకొన్నదే ప్రమాణమైన భాష. ఆతర్వాత ప్రతి రచయితయున్ను తన కాలపు భాషతో తనకుపూర్వము రచితములయిన గ్రంథములందలిభాషకూడా జతపరచుకొని రచన సాగిస్తూ ఉంటాడు. గ్రాంథిక భాషఅనేది ఇటీవల కల్పితమైన మాటేకాని పూర్వమెక్కడా వ్యాకరణ పరిభాషలో ఉన్నదికాదు. మాతృ భాషలో రచన సాగించేవారికి ఆ భాషకు రచితమైన వ్యాకరణము చదువుకో వలసిన ఆవశ్యకత లేదు. అయితే వ్యాకరణ రచనవల్ల ప్రయోజనమేమీ లేదా ? అంటేలేకపోలేదు అంటున్నాను. భాషా తత్త్వము తెలిసికోడానికి ఉపచరిస్తుంది ఇతర భాషలవారికి ఆ భాష నేర్చుకొన్నప్పుడు ఉపచరిస్తుంది. ఈ విషయము మరింత ఎక్కువగా విశద పరచడానికి నాఅనుభవములోవున్న ఒక చిన్న ముచ్చట చెప్తాను. 1901లో నేను ఎఫ్ ఎ చదువు ప్రారంభించినప్పుడు మా పర్లాకిమిడి కాలేజీలో ఆంగ్లభాషాచార్యుడుగా ఎడ్మండ్ కాండ్లర్ అనే కేంబ్రిడ్జ్ పట్టభద్రుడు నియమితుడైనాడు. మాకు ఇంగ్లీష్ భాషావ్యాకరణము ఒకటి పాఠ్యగ్రంథముగా ఉండేది. అతడు అది వఱకే "వేగబాండ్ ఇన్ ఏష్యా" అనేనవల, కొన్ని వ్యాసములు, కథలు రచియించి రచయితగా పేరుపొందినవాడే అయినా ఆంగ్లభాషావ్యాకరణమేదిన్ని చదువుకో లేదట. అప్పుడొకరు తెలివి తక్కువగా వ్యాకరణము చదువుకోకుండా ఎట్లు పేరుపడ్డ రచయితవు కాగలిగావని ప్రశ్నించారు. "నే నే సంఘములో పుట్టి పెరిగినానో ఆ సంఘమువారి భాషే నామాతృభాష. ఆ భాష ప్రమాణముగా, పెట్టుకొని లక్షణకర్త వ్యాకరణము రచించియుండాలి. మా భాషననుసరించి వ్యాకరణ సూత్రములుండాలి. అందుకు భిన్నముగా ఉంటే ఆ సూత్రములుతప్పు అనాలి" అని మాకు తెలియజేసినాడు. ఈ విధముగానే కావ్యాదర్శ తృతీయ పరిచ్ఛేదమందలి 148 వ శ్లోకము చెప్తూ ఉన్నది చూడండి - "శిష్టేష్టుస్తు నదుష్యతి" అనగా "శిష్టైః సాధుభిః అభిమతతయా వ్యవహృతస్తు న దోషాయ భవతి" అనివ్యాఖ్యానము. దీనితోపాటు "శిష్టానామ్ ఉక్తౌ సూత్రాణా మభావే అను శాసన కారిణ ఏవ దండనీయాః" అనే వాక్యముకూడాకలదు. ఇదిలెస్సగా పరిశీలించిన వారికి వ్యాకరణ లక్షణము బోధపడుతుంది. వ్యాకరణము సర్వే వంటిది, పంచాంగము వంటిది. వ్యాకరణము చెప్పినా చెప్పకపోయినా తప్పుగా చెప్పినా భాషాప్రయోగాలు ఎదోచితముగానే సాగుతూ ఉంటవి, పంచాంగములో చెప్పినా చెప్పకపోయినా గ్రహచలనము యథావిధిగానే సాగుతూ ఉంటుంది.

మరియొక దౌర్భాగ్యమేమంటే వ్యాకరణములో ఉన్నసూత్రాలయినా తెస్పగా పరిశీలించక పిచ్చిగా మాటలాడుతూ ఉంటారు కొందరు. "సంస్కారార్థో నియమః'' అంటే విపరీత మయిన అర్థము చెప్తూ ఉంటారు కొందరు సంస్కార శబ్దానికి ఇరువై అర్థాలు నిఘంటువులో కనబడుతున్నవి. వ్యాకరణ శాస్త్రములో ఈ శబ్దము ప్రయోగించినప్పుడు వ్యాకరణ పరిభాషలో ఉన్న అర్థమే చెప్పాలి. అంతేకాని శుద్ధి చేయడమని సామాన్యముగా ఉండే అర్థం చెప్పరాదు. ''చేస్తాను" అనే పదము లోకములో ఉన్నది. శుద్ధముకాదు గనుక "చేసెదను" అని మార్చి వ్యాకరణకర్త శుద్ధపదముగా తయారు చేస్తాడుఅన్నట్లు అర్థము చేసికొంటున్నారు. ఈ వ్యాకరణ శాస్త్రము లోకములో సిద్ధములయిన పదములను సాధించేదేకాని, సిద్ధమయిన దానిని అసాధువు చేయలేదు; సిద్ధము కానిదానిని సాధువు చేయలేదు, సిద్ధమైన పదమునుగూర్చి ఇది ధాతువు, ఇది ఉపసర్గ, ఇది ప్రత్యయము, ఇది ఆగమము, ఇది లోపము, అని వివరించి చెప్పుతుంది. శబ్దానుశాసన మనగానే అదేదో రాజశాసనమువంటిదనుకొని దానినుల్లంఘిస్తే ఏమి కీడు కలుగునో అన్నట్లు భయపడతారు. ఆ అనుశాసనము సరిగా లేకపోతే స్వాభిమానముగల పండితులు దానిని మన్నింపరు. మాకు చిన్నయ్యమాటకంటె పెద్దన్నగారి ప్రయోగమే ఎక్కువ అన్నారు తిరుపతి కవులు. మరియొక విషయములో గుప్తార్థప్రకాశికలో కల్లూరి వెంకటరామ శాస్త్రిగారు "ఇట్టులసామాన్య కవి ప్రయోగములుండగా కవిబ్రహ్మవాక్కునకెదురాడిన చిన్నయసూరి వచనంబు చిన్నయసూరి వచనంబుగాఁ జెల్లందగునని అధిక్షేపించినారు

ఈ వ్యాకరణములూ ఈ వ్యాఖ్యానాలూ ఈ విమర్శలూ అన్నీ పద్యరూపములోవున్న కావ్యభాషకే కాని వచనమునకు కూడా అన్వయించునన్నట్లు ఎక్కడా ఎవరూ చెప్పలేదు. 'అందుకు రెండు కారణములు 17-వ శతాబ్దము వఱకున్ను సాహిత్యములో చేరదగిన గద్య రచన పుట్టలేదు ఒక్క శాసనములలోనే కొన్ని చోట్ల కనబడుతున్నది. శాసనములలోని పద్యములు మాత్రము కావ్యభాషలో వున్నవి. వచనములన్నీ ఆయా కాలముల వ్యావహారిక భాషలోనే వున్నవి ఒకవిధముగా పద్య రచనకు కావ్య భాష, వచన రచనకు వ్యావహారిక భాష ఉద్దిష్టమయినట్టు కనబడుతున్నది. పద్య కావ్యములలోనైనా ఆయా కాలముల వ్యావహారిక భాష తొంగిచూస్తూనే వున్నది అయితే నేను కళింగ సంచికలో ఒక వ్యాసమున తెలియజేసినట్లు శాసనములలో కనబడిన వ్యావహారిక భాషా ప్రయోగములు మరి కొంతకాలము గడచిన తర్వాత పద్య కావ్యములలో కనబడుతూ వున్నది ఈ పద్య కావ్యములలో కనబడుతూవున్న వ్యావహారిక భాషను గూర్చి మా తండ్రిగారు బాలకవి శరణ్యము అనే గ్రంథములో వివరించినారు. కాని అందులో మొదటి రెండు ప్రసంగములు - కుఁతురు, కూఁతురిని, కూఁతురిక మొ॥ సంబంధించిన ప్రసంగమున్ను, చేతురు, కూతురు మొ॥ సంబంధించిన ప్రసంగమున్ను మాత్రమే వారు సవిస్తరముగా (80 పుటలకు పైగా విస్తరించినంత గ్రంథము) రచించినారు. ఆ తర్వాత వారు అస్వస్థులయి ఉండుట వల్లనూ ఆగిపోయినది. అంతలో వారి సప్తతితమ మహోత్సవము జరుపుటకు నిశ్చయించిన నవ్య సాహిత్య పరిషత్తు కార్యదర్శి శ్రీ తెలికిచెర్ల వేంకటరత్నము వారి గ్రంథములు ప్రకటించుటకు తొందర పడుటవలన తక్కిన ప్రసంగములు (సుమారు 150 ప్రసంగములు) మా తండ్రిగారి ఆజ్ఞను శిరసావహించి, వారి 'నోట్సు' ఆధారముగా నుంచుకొని నేను రచించవలసి వచ్చినది. అందుచేత ఇవి ఆ రెండు ప్రసంగములవలె విపులముగా లేవు. అంతేకాక అందులో కొన్ని లోపములు కూడా వున్నవి. ఈ గ్రంథము 1933 లో ప్రకటిత మయినది. అందులోని లోపములు పొరపాట్లు కొన్ని మా తండ్రిగారు వ్రాసిపెట్టుకొన్నారు. 1940 లో వారు స్వర్గస్థులయిన తర్వాత నేను నా పరిశీలనవలన తెలిసికొన్న కొన్ని అంశములు కూడా వ్రాసిపెట్టుకొన్నాను ఇవి అన్నీ ఎప్పుడు ఎట్లు ప్రకటింపగలనా అని యోచిస్తువుండగా భగవంతుని కృపవలన విశాలాంధ్ర ప్రచురణాలయమువారు ద్వితీయ ముద్రణమునకుపూనుకొన్నారు. ఈ ద్వితీయ ముద్రణము మార్చి 1956లో జరిగినది. ఇంతలో వాఙ్మయ మహోధ్యక్షు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు కూడా "ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష" లేక ధ్వని—లిపి—పరిణామం అనే గ్రంథము ప్రకటించారు. అందులో తెలిసికోదగిన నూతన విషయము లున్నవి.

ఈ గ్రంథములు సావకాశముగా పూర్తిగా చదివిన వారికి వ్యావహారిక భాషయెడల విముఖతపోయి ఈ భాషలో గ్రంథ రచన సాగుటవలన తెలుగు సాహిత్యము చెడిపోవునేమో అన్న భయము పూర్తిగా అంతరించిపోవునని నా అభిప్రాయము.

వ్యావహారిక భాష యెడల సుముఖు లయినవారిలోనే కొందరికి ఒక చిన్న విషయములో కొన్ని సంశయములు కలిగినవి. వాటినిగూర్చి కొంచెము వ్రాసి నా వ్యాసము ముగిస్తున్నాను.

పైని సూచించిన మిత్రుల సంశయములు మాండలిక పదములను గూర్చి కలిగినవి. వ్యావహారిక భాషలో గ్రంథ రచనసాగిస్తే ఒక మండలములో రచితము లయిన గ్రంథాలు ఆ మండలములోని వారికే కాని ఇతర మండలములవారికి బోధపడవని, ఎప్పుడూ పేర్కొంటూ ఉన్న ఉదాహరణములే పేర్కొంటూ ఉంటారు. "మీరు కందిపప్పు అంటారు మేము బేడలంటాము; మీరు చెక్కలంటారు మేము వక్కలంటాము" అని.

ఇది ఒక పెద్ద కారణముగా ప్రదర్శించి వ్యావహారిక భాష్యగ్రంథస్థము చేయరాదంటారు. గ్రాంథిక భాషలో ఈ చిక్కు ఉండదని అనుకుంటారు. కావ్య పరిశీలన లెస్సగా చేయరు. హరవిలాసము(II. 31) లో 'పప్పు' అని శ్రీనాథుడున్నూ, ఆముక్త మాల్యద (II.88) లో "బేడలు" అని కృష్ణదేవరాయలున్నూ ప్రయోగించినారు. లక్షణ కర్త లెవరున్ను మాండలిక శబ్దాలు అగ్రాహ్యాము లనలేదు. మాండలిక శబ్దాలకే "అన్యదేశజాంధ్రము"లని పేరుపెట్టి అప్పకవి ఏమన్నాడో చూశారా?

"కేశవ! యాంధ్రులు నానా,
దేశములయందు నిలిచి తెనుఁగు
లెతత్త
దేశోక్తులంటఁ బలికిన
నాశబ్దము లన్య దేశజాంధ్రము
లయ్యెన్ ॥"

ఈ మాండలీయకములే ఆంధ్రనమ సంగ్రహములోను, ఆంధ్రభాషార్ణవము లోను పర్యాయ పదములుగా కనబడుతున్నవి. కొన్ని శబ్దరత్నాకరములోను సూర్యరాయాంధ్ర నిఘంటువులోను ఉన్నవి. అన్నీ లేవంటే అది కోశముల తప్పు; అంతేకాని ప్రయోగించిన వారి తప్పుకాదు. "పప్పు బేడ యన సూపంబు దనరారు" అని ఆంధ్రభాషార్ణవము (II. 248) లో ఉన్నది. ఇక్కడ స్థలము చాలదు గనుక పేర్కొ లేదు గాని ఇంకా అనేకముగా ఉన్నవి. కవిసార్వభౌములున్ను ఇటీవల ఆంధ్రప్రదేశమందు ఆస్థాన కవులున్ను అయియుండిన కీ. శే. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు దార్ఢ్యము అనే అర్థములో జివ అనే శబ్దము తన రచనలో ప్రయోగించి పుట యడుగున "వానికింకను జివ చేరలేదు." ఇట్లు గోదావరి మండలమున వాడుదురు" అని వ్రాసినారు. శబ్దములే కాదు క్త్వార్థక క్రియా రూపములు కొన్నిమండలములలో కొందరు ప్రయోగించినట్టు మరికొన్ని మండలములలో ప్రయోగించరు. అట్టివి కూడా కొందరు ప్రఖ్యాత రచయితలు వాడుతున్నారు. "చెప్పికాగానే; చెప్పుకొని యయిన తర్వాత" అని కథాసరిత్సాగరములో కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు ప్రయోగించినారు. మరి యొకరు "వానిని రాకజేసిరి (= రాకుండా–)" అన్నారు.

మాండలిక రూపాలు "గ్రాంథికాంధ్రము"లో కనబడినప్పుడు లేని ఆక్షేపము వ్యావహారిక భాషా రచనలలో కనబడినప్పుడు పలకలుగ వలెను. ప్రతీ దేశములోను ప్రతీ భాషలోను మాండలిక శబ్దరూపాలున్నవి. ఇంగ్లండు దేశములో లేవా? అమెరికాలో లేవా? అమెరికన్ ఇంగ్లీషులో వేలకొలదిగా ఇంగ్లండ్ ఇంగ్లీషుకు భిన్నములయిన శబ్దరూపాలున్నవి. అయినా ఒకరి గ్రంథాలు మరియొకరు చదివి అర్థముచేసికో గలుగుతున్నారు. రెండు దేశముల వారి గ్రంథాలున్ను మన దేశము వారు చదివి అర్థము చేసికొంటున్నారు. ఒకరి మాండలిక ప్రయోగాలు ఇంకొకరు సులువుగా అర్థము చేసికొనుటకున్ను ప్రయోగించుటకున్ను ఇప్పుడు అవకాశము లెక్కువయినవి. రాకపోకలు అన్ని మండలముల వారికి సులువైనవి. వార్తాపత్రికలలోను, వార పత్రికలలోను అన్ని మండముల వారున్ను వ్యావహారిక భాషలో లేఖలు, కథలు, మొదలయినవి ప్రకటిస్తున్నారు. అందరూ – పిన్నలు పెద్దలు చదువుతున్నారు. మాండలిక శబ్దప్రయోగాలు ఏ చిక్కూ తెచ్చిపెట్టుట లేదు. మంత్రులు, రాజకీయ నాయకులు ఆంధ్రప్రదేశమంతా పర్యటిస్తున్నారు; ఉపన్యాసాలు ఇస్తున్నారు. వీరిలో అన్ని మండలముల ప్రతినిధులూ ఉన్నారు. ఎవరికిఏచిక్కూ లేదు. ప్రసంగిస్తున్నప్పుడు లేని చిక్కు ఆ ప్రసంగములు కాగితము మీద పెట్టినప్పుడు ఎట్లు రాగలదు?

మరియొక విషయములో కొందరు తమ భయమును వెల్లడిస్తున్నారు. వ్యావహారిక భాష వేగంగా మారిపోతూ ఉంటుందట! అందుచేత నేడు వ్యావహారిక భాషలో రచితములయిన గ్రంథాలు రాబోవు తరమువారికి బోధపడవట! గ్రాంథిక భాష మారడంలేదని అనుకొంటున్నారు కాబోలు? నన్నయ

భాష తిక్కననాటికి మారినది. తిక్కన నాటిభాష శ్రీనాథుని నాటికి మారినది. ఈ విధముగా గ్రాంథిక భాష కూడా మారుతూనే వున్నది. అర్థము వివరించి పండితులు చెప్తేనేకాని ప్రాచీన గ్రంథములు సులువుగా బోధపడవు. అందుచేతను, క్లిష్టమయిన భాషలో రచితము లగుటచేతను శృంగార నైషధము, మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యద మొదలయిన ప్రబంధాలకు టీకలు, వ్యాఖ్యానాలు పండితులు రచించి ప్రకటించవలసి వచ్చినది.

గ్రాంథికభాషలో రచితములైన గ్రంథాలు ఉత్తమ గ్రంథాలనిన్ని చాలా కాలము నిలబడతవి అనిన్ని వ్యావహారిక భాషలో రచితములైనవి కావనిన్ని అట్టే కాలము నిలవవనిన్ని కొందరంటున్నారు. ఏ గ్రంథమైనా అట్టే కాలము నిలబడడానికిగాని, ఎక్కువ ప్రతులు చెల్లడానికి గాని గుణము మాత్రమే ప్రధాన లక్షణము కాదు.

సుకవి మాధవరాయలు రచించిన చంద్రికాపరిణయము ఆముక్తమాల్యద, వసుచరిత్రవంటి ఉత్తమ గ్రంథమే. ఒక్కసారి గ్రంథకర్త బంధువులు, ధనవంతులు కనుక ప్రకటించారు. ఎంతమంది చదివినారు? ఎంతమంది అర్థము చేసికోగలిగినారు? మరియొక ముద్రణము పొందగలదా? తారాశశాంకము వంటి గ్రంథము చాలామంది చదివి ఉంటారు. ఎన్నిముద్రణము లయినా పడవచ్చును. మన దేశములోనే కాదు ఇంగ్లండు మొదలయినదేశములలోకూడా పరిస్థితులు ఇట్లే ఉన్నవి. షేక్స్పియరు నాటకాలకు 500 మంది కంటె ఎక్కువ ప్రేక్షకులుండరు. శృంగార రసభూయిష్ఠమైన చౌకబారు చలన చిత్రాలకు రెండువేలమంది ప్రేక్షకులు వెళ్తారు. కథలకు, నవలలకు ఉంటే వెల్లామణిలో నాల్గోవంతు వెలాముణి యయినా ప్రబంధాలకుండదు. కొన్ని ఉత్తమ గ్రంథాలు అంగళ్ళలోలేవు. గ్రంథాలయాలలో మాత్రమే నిలచి ఉన్నవి.

వ్యావహారిక భాషలో కథలు, నాటకలు, నాటకాలు రచించడము బాగుగానే ఉన్నది కాని ఈ భాషకొక వ్యాకరణముండవలెనంటారు కొందరు. ఆ కోరిక కూడా నెరవేర్చినారు వాఙ్మయ మహోద్యమ శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు. కాని ఎవరు చదువుతున్నారు? ఎందరు చదువుతున్నారు? ఆ వ్యాకరణము చదివి గ్రంథ రచన సాగిస్తున్నారా? భాషాచరిత్ర తెలిసికొనగోరేవారికి అది ముఖ్యముగా కావలసిన గ్రంథము. దాని విలువ రాబోయే తరముల వారికి మరింత ఎక్కువగా కనబడుతుంది. ★

# వర్షరాజ!

ఎన్. టి. వి. వి. రామానుజాచార్యులు

నీల నీరదపాళి నింగిపైఁ దిలకించి
నెమ్ములు నృత్యమ్ము నెమ్మిసూప,
నిండైన తావితో నింగిచూచెడి మల్లె
దోసిళ్ళ పువ్వులు వాసిఁగూర్ప
మొయిలు షోకులు చూచి, మొగలి, రేకులు విప్పి
ముగ్ధదంపతులకు ముద్దొనర్ప
కర్షక జనముల కడగండ్లు దీర్పంగ
వర్షధారల నిచ్చి హర్షమొసఁగ
గర్జనలఘోష రోదసిన్ గ్రమ్ముకొనఁగ
సంతసంబిచ్చు పర్జన్య! స్వాగతమ్ము!
కొమ్ము సంతోష బాష్పాలు! కోట్లకొలది
రమ్ము! మాయూరి పొలిమేర! రాజతేజ!

ఒకచాయఁ గ్రొమ్మెఱుపు లొకసారి కనుపింప
నొకచాయ గర్జనలు దుటుచూప
ఒకచాయ మేఘాళి యొయ్యార మొలికింప
నొకచాయ పిడుగులు వీకఁద్రోల,
ఒకచాయ మేఘాల చీకట్లు ముసలంగ
నొకచాయ దుర్వృత్తి వీకఁజొరఁగ
ఒకచాయ వర్ణాళి యొకచాయ చిత్రమై
ప్రియురాలి హేలల ప్రీతి నింప

వివిధ భావాల వెల్లియై వెలుఁగు మేఘ!
వందనమ్మందుకోవోయి! వర్షరాజ!
వన్నెగల్గించి వాత్సల్య వారిధార
నిచ్చి కాపాడు కలకాల మీ జగమ్ము

సందేశమ్ములమూత్న భావములు నీ సందేశకావ్యమ్ములో
విందుల్ సేయఁగ కాళిదాస రచనన్ వేడ్కన్ నినుం
జూచెదన్
అందమ్మొ హృదయమ్ము ముఖ్యము; రసాయత్తైక
చిత్తమ్మువన్
సౌందర్యమ్మును జిమ్మునంచ నెడి వా చారూఢి
సత్యమ్ముగాన్. ★




# ✻ మహిళల శ్రామిక జీవనం ✻

— ఆవుల జయప్రదాదేవి

మహిళ కూడా శ్రమించి జీవించగలదనే సత్యాన్ని ఎప్పుడూ మహిళాలోకం నిరూపించుకుంటూనే ఉంది. కేవలం బీదప్రజానీకంలోనే కాకుండా మధ్యతరగతి కుటుంబాలలోనూ, ఆవసరమని యెంచిన ధనిక కుటుంబాలలో నుంచి కూడా స్త్రీలు అన్ని రంగాలలోనూ కృషి చేస్తున్నారు.

శ్రమించటం అంటే ఒక్క కూలీనాలీ చేయడమే కాదు. ఉద్యోగాలలోనూ, రాజకీయాలలోనూ, సాంఘిక కార్యక్రమాల లోనూ కూడా, అవకాశ మున్నవారు ఒక్క ప్రతిఫలాపేక్షతోనే కాదు నిస్వార్థంగా కూడా పని చేస్తున్నారు.

అయితే ప్రధానంగా ఈ వ్యాసంలో మనం స్త్రీలు ఆర్థికంగా సంపాదనపరు లయ్యే విషయంలో మన సంక్షేమ కార్యక్రమాలు యెంతవరకూ ఉపయోగపడుతున్నాయి అన్న విషయం తీసుకుందాం. ఈ సందర్భంలో కొన్నింటిని గురించి లోగడే మనం తెల్సుకున్నాం. స్త్రీల విద్యాభ్యాసంలో తోడ్పడి వారిని ఉద్యోగార్హులను చేయడం, వృత్తి విద్యల ద్వారా జీవనోపాధికి ఆస్కారం కల్పించడం మొదలైన విషయాలను గురించి వివరంగా తెల్సుకున్నాం. అందువల్ల ఈసారి ప్రత్యేకంగా సహాయక ఉత్పత్తి కేంద్రాలను గురించి తెలుసుకుందాం. తరువాత ఉద్యోగినులైన మహిళల వసతీ విధానంలో ఏర్పాటు లెలా ఉన్నాయి అనే విషయం కూడా ముచ్చటించు కుందాము.

స్త్రీలకు పని కల్పించడానికి, జీవన భృతికి కావలసినంత డబ్బును ఇతోధికంగా వారు సంపాదించుకోవడానికి ఈ సహాయ ఉత్పత్తి కేంద్రాలు చాలా ఉపకరిస్తాయి. ఇవి ప్రత్యేకంగా, వాటంతటవిగా ఏర్పడ టానికి వీలులేదు. కేవలం ఏదోఒక పెద్ద ఫ్యాక్టరీకి అనుబంధంగా మాత్రమేఉంటాయి. అనగా బట్టలు, రడీమేడ్ దుస్తులు, టెలిఫోను పరికరములు మొదలైన వస్తువులను తయారు చేసే ఫ్యాక్టరీలలో స్త్రీలు తయారు చేయడానికి అనుగుణ్యంగా ఉన్న పనిముట్లను గానీ, చిన్నచిన్న పరికరాలను గాని, ఇతర వస్తువులను గానీ రూపొందించడానికి ఈ కేంద్రములు ఏర్పడతాయి. వీటి ద్వారా ఫ్యాక్టరీకి సంబంధించిన అవసరమైన పరికరములు తయారు చేయబడతాయి. ఆ పనులవలన 100 మంది పైగా సుమారు 200 మంది స్త్రీలకు పనులు చేసే అవకాశం లభిస్తుంది.

ఈ సహాయ ఉత్పత్తి కేంద్రాలకుకూడా లోగడ మనము తెలుసుకున్న ఉత్పత్తి కేంద్రాలకువలెనే, కేంద్ర సంక్షేమ సంఘం వారు ఆర్థిక సహాయం చేస్తారు. కేంద్రానికి కావలసిన పరికరాలకు (ఎక్విప్‌మెంటు) పూర్తిగా డబ్బు ఇస్తారు. కేంద్రమును నడపడానికి కావలసిన షెడ్లు వగైరాలను ఏర్పరచుకొనడానికి కూడా గ్రాంటును మంజూరు చేస్తారు. ఈ సహాయ కేంద్రాలలో ఫ్యాక్టరీ పరికరములను చేయుటకు కావలసిన శిక్షణ పొందే కాలంలో శిక్షితులకు స్టయిఫండు కూడా యిస్తారు. యీ పరిశ్రమల విధానాన్ననుసరించి స్టయిఫండు కాల పరిమితిని నిర్ణయిస్తారు. ఈ కేంద్రాలలో తయారయిన వస్తువులను అమ్మే బాధ్యత ఫ్యాక్టరీ వారే వహించాలి. అట్లాగే తిరిగి ముడి పదార్థాలను కూడా సరఫరా చేస్తారు.

ఇలాంటి కేంద్రాలు బొంబాయి, బెంగుళూరు, కలకత్తా మొదలైన నగరాలలో ఉన్నాయి. అక్కడ పనిచేసే స్త్రీలకు నెలకు 100 రూపాయలకు పైగా లభిస్తుంది. ఇది స్త్రీలకు ఎంతో అనుకూలమైన విధానం. ఈ విధమైన సహాయిక కేంద్రాలు ఇప్పటివరకూ ఆంధ్రప్రదేశ్‌లో ప్రారంభం కాలేదు. ఈ కేంద్రాలను ప్రత్యేకంగా సంస్థల యాజమాన్యం క్రిందనే నడపాలి. వ్యక్తిగతంగా నడుపడానికవకాశంలేదు. పెద్ద ఫ్యాక్టరీ సహాయ సహకారంలతోనే వీటిని నడుపగలుతాము. అమ్మకం బాధ్యత లేకపోవటం చేత వీటిని నడుపడం ఏమంత కష్టమైన పని

(మిగతా 70 వ పేజీలో)

పసిపిల్లల పెంపకం:

# నాలుగు నెలల తరువాత...

—డాక్టర్ : వేమిరెడ్డి రాజేశ్వరమ్మ

నాలుగు నెలలనుండి చంటి పిల్లలకు గట్టి పదార్థాన్ని పెట్టడం అలవాటుచేయాలి. ఆ వయసువాళ్ళకు ఏ పదార్థాన్నన్నా పెట్టితే, దానిని మింగే ప్రయత్నం చేస్తుంటారు. అందువల్ల వాళ్ళకు యీ వయసునుండే మెల్ల మెల్లగా 'ఏదయినా తినడానికి అలవాటుచేస్తే మంచిది.

గట్టిపదార్థాలలోకూడా పిల్లలకు బంగాళా దుంపలు, కూరగాయలు, పళ్ళు, గుడ్లు లాంటివి మొట్టమొదటి రోజుల్లో అలవాటు చేయాలి. ఆ తర్వాత తర్వాత రొట్టె, వెన్న, మాంసం, చేపలాంటివి పెట్టాలి. వీటిలో ఏదిముందు, ఏది వెనుక పెట్టాలి అన్న ప్రసక్తి లేదు. ఏది మొదలుపెట్టినా ఒకటే. కోడిగుడ్డు పెట్టేటప్పుడు ముందుగా దానిని ఉడకబెట్టాలి. మొట్టమొదట దానిలోని పచ్చ సొనతో ప్రారంభించి, పూర్తి పచ్చసొన వరకూ యివ్వాలి. కోడుగుడ్డు తినడానికి అలవాటు పడినతరువాత బంగాళాదుంపను పెట్టవచ్చు, బంగాళాదుంపను బాగా ఉడక బెట్టి, పైతొక్కతీసి, దానిని మెత్తగానలిపి పాలతోగాని, వెన్నతోగాని కలిపి తినిపించ వచ్చు. దీనికి అలవాటుపడిన తర్వాత బియ్యము, రాగి మొదలయినవాటిని ఉడక బెట్టి, జావలాచేసి యివ్వవచ్చు. వీటిబదులు బజార్లలో అమ్మే 'ఫారెక్స్' (Farex) వంటివి పాలలోకలిపి యివ్వవచ్చు. వీటికి కూడా అలవాటుపడిన తర్వాత కాయ గూరలను బాగా ఉడకబెట్టి, మెత్తగా పిసికి యివ్వడం మంచిది. ఆతర్వాత పండ్లు తిని పించవచ్చు. మొట్టమొదట అరటిపండుతో మొదలుపెట్టాలి.

ఈ కొత్త పదార్థాలను యిచ్చేటప్పుడు, తొలిరోజుల్లో పిల్లలు తినడానికి యిష్టపడక పోవచ్చు. అంత మాత్రంచేత యివ్వడం మానెయ్యకూడదు. రెండు మూడుసార్లు యిస్తే వారికే అలవాటవుతుంది. ఎప్పుడూ ఎక్కువగా పెట్టకూడదు. కొద్ది కొద్దిగా ప్రారంభించాలి.

వీటిని సాధారణంగా పాలు పెట్టడానికి ముందుగా యిస్తుండాలి. మొట్ట మొదట అరచెంచాతో ప్రారంభించి రెండు రోజుల కొకసారి పెంచుకుంటూ వెళ్ళాలి. అలా చంటిపిల్ల తినడానికి యిష్టపడేంత వరకూ పెట్టాలి. మొదటి పదార్థానికి అలవాటు పడిన తర్వాత, రెండో దానిని ప్రారంభించాలి. దానితోపాటు మొదటయిచ్చిన పదార్థాన్ని కూడా తినిపిస్తూవుండాలి. లేకపోతే పిల్లలు రుచిమరచిపోయి తిరిగి మొదటికే వచ్చే అవకాశం వుంది.

ఆరవనెలనుండి పిల్లలు పంటిచిగుళ్ళతో కొరకడానికి ప్రయత్నిస్తుంటారు. వారి చేతిలో బిస్కెట్టు పెట్టితే, దానిని నోటిలో పెట్టుకుని కొరకడానికి ప్రయత్నిస్తారు. మాంసాహారులకు కోడిఎముక అలా కొరక డానికి రుచిగా వుంటుంది. పిల్లలు ఎదుగు తున్నకొద్దీ కొద్దిగా మాంసంవున్న ఎముకను యిస్తే తినడానికి అలవాటు పడతారు. ఆ ఎముక గుచ్చుకునేట్టు, విరిగిపోయేట్టు ఉండ కుండా చూడవలసిన అవసరం ఎంతయినా వుంది.

ఏడవ నెలలో రొట్టెను సన్నగా ముక్కలుకోసి, వెన్నపూసి తినిపించ వచ్చును. ఈ నెలనుండే పిల్లలకు తల్లిపాలు మార్పించే ప్రయత్నం చేయాలి. ఈ వయసులోనే ఆహారంమీద కుతూహలం కలుగుతుంది. అందుచేత వాళ్ళంతటవాళ్ళే ఆ పదార్థాన్ని చేతితో తీసుకుని నోట్లోపెట్టు కునే ప్రయత్నం చేస్తుంటారు. ఆ ప్రయత్నాన్ని విరమింపజేయడం మంచిపనికాదు.

ఎనిమిది, తొమ్మిది నెలలు వచ్చేసరికి పిల్లలు స్పూనుతో తినడానికి యిష్టపడతారు. మొదట్లో వంటిమీదా, నేలమీదా వంపుకుని నానా గలీజూ చేస్తారు కాని, అలవాటుబడితే ఆ ప్రమాదమేమీ వుండదు. పిల్లలు తమంత తాము తింటున్నామన్న సంతోషంతో తృప్తిగా తినగలుగుతారు. ఒకవేళ వారు సరిగా తినలేకపోతే, వాళ్ళను తినినంత వరకు తిననిచ్చి, ఆపైన తల్లి దగ్గరుండి తినిపిస్తే మంచిది.

తల్లిపాలు సుమారు రెండేళ్ళవరకూ సరిపోతాయి. కొన్ని కొన్ని జాతులలో 3-4 ఏళ్ళవరకూ వుంటాయి. కొన్ని దేశాలలో ఏడోనెలకే తల్లిపాలు మాన్పించేస్తారు. ఈ రెండువిధానాలలోనూలాభనష్టాలువున్నాయి. ఆర్థిక దుస్థితివల్ల పైపాలు యివ్వలేనివారికి తల్లిపాలే శరణ్యం, కాని తల్లిపాలలో తగినంతగా యినుము మొదలయిన పదార్థాలులేవు. అందువల్ల పిల్లలకు రక్తం పట్టక బలహీనంగా తయారవుతారు. కావున తొమ్మిది నెలలనుండి పిల్లలకు పై ఆహారం అవసరం. తల్లి ఆరోగ్యాన్నిబట్టి కూడా తల్లిపాలు యివ్వడమా, మానేయడమా అనేది ఆలోచించాలి. తల్లి అల్పంగావున్నా, రోగిష్టిదయినా పై పాలుగాని, పై ఆహారం గాని యివ్వడమే ఉత్తమం.

తల్లిపాలు మాన్పించిన తరువాత అన్ని పాలూ పైపాలే యివ్వాలని చాలామంది అభిప్రాయ పడుతూవుంటారు కాని అలాంటి నియమమేమీలేదు. పై ఆహారము యిస్తే అంతగా పైపాలు యివ్వకపోయినా ఫరవా లేదు. పైపాలు యిష్టపడని పిల్లలకు పాలతో తయారయిన పదార్థాలను యివ్వడం మంచిది.

ఒక్కసారిగా తల్లిపాలనుమాన్పించి పై

పాలను పట్టడం కూడదు. మెల్ల మెల్లగా మాన్పించాలి. ఇందుకు సుమారు రెండు నెలలన్నా పడుతుంది. 9 నెలలనుండి పూర్తిగా పై పాలే యివ్వాలను కున్నప్పుడు పిల్లలకు 6½ నెలనుండే రోజుకు ఒకసారి పై పాలు త్రాగించడం ప్రారంభించాలి. పై పాలను ఎండాకాలం ప్రారంభించాల్సి వస్తే, ఎండలు వెళ్ళిపోయేవరకూ వేచివుండడం మంచిది. ఈ వయసులో పిల్లలు సుమారు 9 ఔన్సుల పాలు తాగుతారు.

పై పాలు ఎలా ప్రారంభించాలి, ఎప్పు డెప్పుడు తాగించాలి అన్న సందేహం అక్కరలేదు. పిల్లలు రోజూ ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, రాత్రి పాలు తాగుతూ వున్నప్పుడు, తొలిరోజులలో సాయంకాలం వేళల్లో తల్లిపాలు బదులు పై పాలు యివ్వవచ్చు. మూడువారాల తర్వాత మధ్యాహ్నం వేళల్లో తల్లిపాల బదులు పై పాలు పట్టవచ్చు. మరికొద్ది రోజులయిన తర్వాత ఉదయంకూడా పై పాలు యివ్వవచ్చు. ఆ తర్వాత రాత్రిళ్లు కూడా ప్రారంభించవచ్చు. ఒకవేళ పిల్లలు రాత్రివేళల్లో తల్లిపాలతోనే తృప్తిపడి నిద్రపోతూవుంటే కొన్ని నెలలవరకూ తల్లి పాలనే యివ్వడం మంచిది.

ఒక్కొక్కసారి అకస్మాత్తుగా తల్లి పాలనుండి పై పాలకు మార్చవలసిన అవసరంవస్తుంది. అలాంటప్పుడు కూడా ఒకసారి పాలమార్పుకు, రెండవసారి పాల మార్పుకు కనీసం మూడు రోజులన్నా వ్యవధిఉండాలి. తల్లిపాలు అకస్మాత్తుగా మాన్పిస్తే, తల్లికి రొమ్ములునిండి నొప్పి కలగవచ్చు. మరల పాలివ్వని పక్షంలో కొంచెంగట్టిగా కట్టుకట్టి, 'స్టిల్‌బెస్టరాల్' 5మిల్లిగ్రాములురోజుకుమూడుసార్లచొప్పున కొద్దిరోజులపాటుయివ్వాలి. ఒక్కొక్కప్పుడు 20 మిల్లిగ్రాములు రోజుకు మూడుసార్ల చొప్పున కూడాయివ్వవలసి వస్తుంది.

తల్లి బయటకువెళ్ళి పనిచెయ్యాల్సిన అవసరంలేనప్పుడు తప్పనిసరిగా తల్లిపాలే యివ్వాలి. పై పాలవలన పిల్లల ఆరోగ్యం దెబ్బతినవచ్చు. తల్లికి ఏమన్నా జ్వరం వస్తే, ఆ కొద్దిరోజులూ తాత్కాలికంగా పాలు యివ్వడం మాన్పవచ్చు. ఆ రోజులలో పాలను పిండివేస్తూ వుండాలి. లేకపోతే రొమ్ములు గడ్డలు కట్టగలవు.

పళ్ళు వచ్చేటప్పుడు, కొంతమంది పిల్లలకు అట్టే యిబ్బంది కలిగించకుండానే వస్తాయి. కాని కొంతమంది విసుగ్గావుండడం ఊరికే ఏడవడం, రాత్రిళ్ళు నిద్ర పోక పోవడం చేస్తూ వుంటారు. అలాంటప్పుడు ఒకఔన్సో, రెండు ఔన్సులో నునువెచ్చని మంచినీళ్ళు సీసాలోపోసితాగిస్తే హాయిగా నిద్రపోతారు. ఒక్కొక్కప్పుడు పాలల్లో ఆస్పిరిన్ బిళ్ళలోసగం కలిపి తాగించవలసి వస్తుంది. ఇలా ఆరుగంటల కొకొక్కసారి చేయవచ్చు. అంతకన్నతక్కువ వ్యవధిలో వేయడంమంచిది కాదు. బొత్తిగా నిద్ర పోకుండా తిప్పలుపెడితే 1—3 గ్రైములు క్లోరాల్ యివ్వవచ్చు. పళ్ళువస్తున్న రోజులలో పిల్లలు ఎక్కువగా పాలుత్రాగరు. వాళ్ళు ఏడుస్తుంటే, ఆకలి వేస్తున్నది కాబోలని పాలు పట్టకూడదు. ✿

---

(68 వ పేజీ తరువాయి)

కాదు. వీటి ద్వారా స్త్రీల ఆర్థిక పరిస్థితిని, కుటుంబ నిర్వహణాబాధ్యతలోనూ కొంత స్థోమతను, అవకాశాన్ని కల్పించవచ్చును.

తరువాత ఉద్యోగినులైన స్త్రీలకు పట్ట ణాలలో ప్రత్యేకంగా వసతి గృహాలుకూడా ఏర్పాటు కాబడవి. అనేకచోట్ల అవివాహితు లైన స్త్రీలు, లేక ఉద్యోగరీత్యా కుటుంబానికి దూరంగా ఉండవలసిన స్త్రీలు, పట్టణాలలో ఒంటరిగా ఉండటానికి ఇబ్బంది పడుతూ ఉన్నారు. అందుచేత వారికి రక్షణ, మాన సిక ప్రశాంతత కావలసినంతగా లభించడం లేదు. ఎక్కువ ఆదాయాన్ని పొందుతున్న వారు ప్రత్యేకమైన ఏర్పాట్లు చేసుకోగలుగు తారు. నాన్ గజిటెడ్ ఉద్యోగినులు తమ పరిమిత ఆదాయంలో అవసరాలకు తగిన ఏర్పాట్లను ప్రత్యేకంగా చేసుకోవడం చాలా కష్టం. అందుకని వారి సౌకర్యాల కోసం ఈ ఉద్యోగినుల వసతీ గృహాలు చక్కగా ఉపకరిస్తున్నాయి. ప్రతి ఒక్కరికి, భోజన, వసతి సౌకర్యాలు చేయబడతాయి. ఈ గృహాలలో అయ్యే ఖర్చును బట్టి నెల కొక సారిగా ఉద్యోగినులుడబ్బునునిర్వాహకులకు జమకట్టవలసి ఉంటుంది. లాభములకై కాకుండా, వృత్తి కొరకు కాకుండా, కేవలం సహకార భావంతో సంస్థల యాజమాన్యం వారు ఈవిధంగా ఉద్యోగినులకు వసతీ గృహాలను నడిపి తోటి సోదరీమణులకు యెంతో సహాయపడుతున్నారు.

ఇంతవరకూ మన దేశంలో స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు బహుముఖంగా వ్యాపించి నడుపబడుతున్నవి. స్త్రీలుకూడా ఉత్సాహంతో ఈ సహకారములను అందుకో డానికి ముందడుగు వేస్తూ, స్త్రీ జనాభ్యు దయానికి చేయూత నిస్తూ ఉన్నారు.

ఇంతేకాదు. ప్రతి స్త్రీ కూడా జాతి ఔన్నత్యానికై తమ కర్తవ్యాన్ని కూడా గుర్తించాలి. బాల్యంనుండి సమాజంలో, బిడ్డగా, సోదరిగా, భార్యగా,తల్లిగా స్త్రీ తన బాధ్యతలనునిర్వర్తించవలసిఉంది. వాస్తవం చెప్పాలంటే పురుషునికంటే కూడా మానవ జాతి పటిష్ఠతకు స్త్రీయే ప్రధాన కారణం. అసలు పటిష్ఠతకే స్త్రీ ఒక జీవగఱ్ఱ. మానవు నికి జీవితంలో బాల్య దశయే ఒక పునాది. అట్టి బాల్యం ప్రతి బిడ్డకూ తల్లి ఒడిలోనే గడుస్తుంది. ప్రపంచ జ్ఞానమే.-బిడ్డ మాతృ మూర్తి యొక్క లాలన పాలనతో నేర్చు కుంటాడు. పుట్టినప్పటినుండీ కూడా తల్లే తన బిడ్డకు గురువు. ఆకలిదప్పులు ఆట పాటలు మొదలైన అన్ని విషయాలూ నేర్పేది తల్లే. ఆ సమయంలోనే విజ్ఞానవతి అయిన తల్లి తన బిడ్డయొక్క భవిష్యత్ జీవితానికి కావలసిన పునాదిని ఏర్పాటు చేయగలుగుతుంది. మానవతా భావం, ఐక్యత, జాతీయత మొదలైన సుగుణాలకు త్రోవ ఏర్పరచ గలుగుతుంది. అట్టి గురు తరమైన బాధ్యత, ప్రాధాన్యత తల్లిది. అట్టి తల్లి విజ్ఞానవంతురాలై, విదుషీమణిగా వున్న తన బిడ్డలను, భావి భారత పౌరులుగా, దేశ భక్తులుగా, సుగుణ సంపన్నులుగా చేయటంలో సిద్ధహస్తురాలు కాగలదు.

ఈవిధమైన అవకాశములను అనగా స్త్రీ జనాభ్యుదయమునకు సంబంధించిన ప్రతి అవకాశమును ప్రతి స్త్రీ కూడా వినియో గించుకొని ఆర్థికంగా, మానసికంగా, ఉన్నత భావాలను కలిగి, తమ బిడ్డలను సక్రమ మైన పద్ధతులలో, సుశిక్షితులను చేయ గలి గిననాడే, దేశమూ, జాతీ అభివృద్ధికి రాగలదు. మళ్ళీ మన భారత జాతి, మానవ జాతికి తలమానికం కాగలదు. ✿

## బాలానందం

# విద్యార్థులకు మరికొన్ని స్కాలర్ షిప్పులు

వాసిరాజు ప్రకాశం

తమ్ముళ్లూ! చెల్లాయిలూ!

మనలో అందరూ పల్లెలవైపు వెళ్ళే వుంటారు. అక్కడి వాతావరణం ఎంతో విచిత్రంగా వుండేది యిదివరకు —

ముఖ్యంగా, వూరి చివరన, అసలు వూరితో సంబంధంలేని మరికొన్ని ఇళ్ళు, పూరిపాకలు వుంటాయి. అదికూడా చిన్న వూరిలాగానే వుంటుంది. వారిక్కూడా వేరే చెరువు వుంటుంది — నీళ్ళు తెచ్చుకోవటానికి. దానినే 'మాలపల్లి' అని అంటారు.

మరి, అక్కడ ఎవరుంటారు? — వాళ్ళు కూడా మనలాగే మనుషులే. వారిక్కూడా మనకుమల్లే కళ్లు,కాళ్లు — అన్నీ — వున్నాయి. కాని వారందర్నీ మనకు దూరంగా వుంచారు. అందువల్లనే వారుండే దానిని మాలపల్లి అని అన్నారు.

పూర్వకాలంలో వాళ్ళను అంటరానివారుగా భావించి దూరంగావుంచారు. వాళ్ళు మన ఇళ్ళల్లోకి రాకూడదు. మనల్ని తాకనే కూడదు. ఇదంతా పాతసంగతి లెండి.

కాని, 1947 లో భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించుకొన్న తరువాత ఆ భేదాలన్నీ పోయాయి. "మనమంతా ఒకే మానవజాతికి సంబంధించిన వాళ్ళం. మాలపల్లెలలో వుండేవారుకూడా మనలాగే మానవులు," బోసినవ్వుల గాంధీతాతయ్య చెప్పిందికూడా అదే. ఈ అంటరానితనం పోవాలని, మానవులంతా ఒకటేనని అందరూ గుర్తించాలని తాతయ్య ఎన్నో ఉద్బోధలు చేశాడు.

ఈ నాటి మన ప్రభుత్వంకూడా అదే విషయాన్ని గమనించి, యీ అంటరానితనం పోగట్టడానికి ఎన్నో పథకాలను రూపొందించింది. వాటి ఫలితంగానే దేశంలో యీనాడు అందరమూ ఒకటయ్యాం. ఏ కులానికి చెందినవారైనా, ఒకే బస్సులో పక్కపక్కనే కూర్చుంటున్నారు; అందరూ దేవాలయాలకు వెళుతున్నారు. క్లాసుల్లో కూడా అందరమూ ఒకే బెంచీమీద కూర్చుంటున్నాం.

కాని, మొదటినుంచీ, మిగిలిన వారందరికంటే వారు వెనుకబడే వున్నారు. మిగతా వారు అభివృద్ధిచెందిన విధంగా, వారంతా చెందలేదు. వారి అభివృద్ధికికూడా కృషి చేయటం మనప్రభుత్వ పథకాల్లో ఒకటి.

ఈడొచ్చిన పెద్దవారిమీద దృష్టిని లగ్నం చేయటంకంటె, రేపటి పౌరులు కానున్న నేటి బాలల అభివృద్ధికే ప్రాధాన్యత ఇవ్వటం మంచిది. అందుకే, ఆ బాలబాలికలంతా బాగా చదువుకోవాలని, మన ప్రభుత్వం ఎన్నో పాఠశాలలను ప్రారంభించింది. మిగతావారికి లేని సౌకర్యాల నెన్నిటినో, వారికి కలుగజేసింది.

మిగతా కులాలవారితోపాటు, అభివృద్ధి చెందని యీ కులాలను వెనుకబడిన కులాలని అంటారు. ఈ వెనుకబడిన కులాల వారందరి జాబితా మన ప్రభుత్వం లోగడే ప్రకటించింది. పాఠశాలల్లో, బాగా చదువుకొని, అభివృద్ధి చెందాలని, వారుకూడా మిగతావారితోపాటు వున్నత పదవులను అధిష్ఠించాలని, వారికోసం ఏర్పరచిన సౌకర్యాలలో స్కాలర్‌షిప్పుల, పథకంకూడా ఒకటి.

వెనుకబడిన కులాలకుచెందిన బాలబాలికలుకూడా, మిగతా వారితోపాటు, చక్కగా చదువుకొని, ఉత్తమమైన పౌరులుగా తయారు కావాలని, దేశాభివృద్ధి కార్యక్రమాలలో సమంగా పాలు పంచుకోవాలని యీ పథకంయొక్క ఆశయం. ఈ స్కాలర్‌షిప్పులను రాష్ట్రప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖ తరపున ఆ డైరెక్టరు పంపిణీ చేస్తారు.

ఎలిమెంటరీ పాఠశాలల్లోనూ, ఉన్నత పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ చదివే వెనుకబడిన కులాల వారందరికీ యీ పథకం వర్తిస్తుంది. షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులు కలిసిన, వెనుకబడిన వర్గాల జాబితానొక దానిని ప్రభుత్వం తయారు చేసింది. ఆ జాబితాలో దాదాపు నాలుగు వందల కులాలను ప్రస్తావించటం జరిగింది.

ఆయా జిల్లాలలోవుండే జిల్లాపరిషత్తులే యీ స్కాలర్‌షిప్పులు కొన్నింటిని మంజూరు చేస్తాయి. ఈ జిల్లా పరిషత్తులే స్కాలర్ షిప్పులను పొడిగిస్తూ వుంటాయి. కొన్ని సందర్భాలలో సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టరుగారే వీటిని మంజూరు చేస్తారు.

ప్రభుత్వంయొక్క చేయూతలేనిపక్షంలో చదువుకోలేని పేదవారికి మాత్రమే వీటిని పరిమితం చేయటం జరిగింది. దరఖాస్తులుపంపే ప్రతివారు, తమ తమ

'ఆర్థికస్తోమత'కు సంబంధించినసర్టిఫికేటును కూడా జతపరచాలి.

షెడ్యూల్డు కులాలనుంచి క్రైస్తవ మతంలోకి, మారిపోయినవారు కూడా యీ ఉపకార వేతనాలకు అర్హులే. అలాంటి వారు ఒక గజెటెడ్ వుద్యోగివద్దనుంచి గాని, పోలీసు ఇన్స్పెక్టరు వద్దనుంచిగాని, డిప్యూటి తాహసిల్దారు హోదాకు తక్కువ కాని రెవెన్యూ అధికారివద్దనుంచి గాని, బాధ్యతాయుతమైన ఒక మతాధికారి వద్దనుంచిగాని 'సర్టిఫికేటు' పంపాలి.

ప్రభుత్వం గుర్తించని పాఠశాలల్లోను, గుర్తించని తరగతుల్లోను చదివేవారికి యీ సౌకర్యం వర్తించదు.

సాంఘిక సంక్షేమశాఖ డైరెక్టరు కార్యాలయంలోను, జిల్లా పరిషత్తులలోను, కొన్ని ప్రాధానమైన విద్యాసంస్థలలోను దరఖాస్తు ఫారాలు లభిస్తాయి నిర్ణీతమైన ఫారలనే ఉపయోగించాలి; ఆయా విద్యాసంస్థల ద్వారానే పంపవలసి వుంటుంది.

ప్రస్తుతం చదువుతున్న తరగతి, గత సంవత్సరం చదివిన తరగతి, పోయిన సంవత్సరంలో వచ్చినమార్కులు మొదలైన వివరాలన్నింటినీ పేర్కొనాలి. అసంపూర్ణంగావుండి, పూర్తి వివరాలను ఇవ్వని దరఖాస్తులను ప్రభుత్వం పరిశీలించదు. ప్రతి ఏటా ప్రభుత్వం చెప్పిన తేదీలోగా దరఖాస్తులను పంపాలి. ఆలస్యంగా అందజేసిన వాటిని ప్రభుత్వం పరిశీలించదు.

స్కాలర్‌షిప్పు పొందదలచినవారు ఇతర నిబంధనలతోపాటు, వయసుకు సంబంధించిన నిబంధనలనుకూడా శ్రద్ధగా చూడాలి. జులై ఒకటవ తేదీనాటికి, నాలుగవ తరగతి చదివేవారికి పన్నెండు సంవత్సరాలు, ఐదవ తరగతి చదివేవారికి 13, ఆరవ తరగతి (షష్టఫారం) చదివేవారికి 15, మూడవఫారం చదివేవారికి 16, దాటిపోయి వుండరాదు. అదే విధంగా నాలుగవఫారం చదివేవారు 17, ఐదవఫారం విద్యార్థులు 18, ఆరవ ఫారం విద్యార్థులు 19 సంవత్సరాలలోపు వయస్సు కలిగి వుండాలి.

ఏడవఫారం, ప్రీ యూనివర్సిటీ తరగతులవారు 20 సంవత్సరాలలోపు వయస్సు వారై వుండాలి.

కళాశాలల్లో – డిగ్రీతరగతి మొదటి సంవత్సరంవారు 21, రెండవ సంవత్సరం వారు 22, మూడవ సంవత్సరం వారు 23 సంవత్సరాలుదాటి వుండకూడదు.

అన్ని తరగతుల్లో ఫస్టు మార్కులు తెచ్చుకొంటూ, నిరుపేదలై – అర్హులై వుండిన కొందరు విద్యార్థుల విషయంలో వయస్సు నియమాలను సడలిస్తారు.

## నీ పిల్లలు

నీ చేసిన బొమ్మలు కారు
నీ కడుపున కలిగిన వారు :
మాటాడక కూర్చుండుటకు,
మరి కదలక పడి యుండుటకు ॥నీ॥

ఒక మార్గం మాత్రము నీవు
ఒక గమ్యం వారికి కావు :
ఊహాలు ఉన్నవి వారికి
ఉన్నతిని చేరడానికి ॥నీ॥

కోరకు, నీ వలె వారిని
కూర్చి తీర్చి ఉంచాలని :
కోరి యత్నించు, వారిని
గొప్ప ననుకరించాలని ॥నీ॥

వంగిన విలు నీ తీరు
వదలిన బాణాల్ వారు :
జీవిత మటులే నిరతం
భావివైపు జను త్వరితం ॥నీ॥

వారి తనువు లవి వసించు కొరకై
వసతు లెన్నొ సమకూర్చ గలవు :
వారి తలపు లవి వాసించుటకై
వసతు లేమి సమకూర్చ లేవు ॥నీ॥

— బి. వి. నరసింహారావు

తాము చదువుకొంటున్న వూళ్ళో నివసించక, ఐదుమైళ్ళకు మించిన దూరంగల ఇతర గ్రామాలనుంచి వచ్చి వున్నవారికి 'రెసిడెన్షియల్' స్కాలర్‌షిప్పులని మరి కొన్ని వున్నాయి. ఇవికూడా వెనుకబడిన వర్గాలకే పరిమితం చేయబడ్డాయి. ఒకటవ ఫారం అంతకంటే పెద్ద తరగతుల్లో చదువుతున్నవారికి మాత్రమే వీటిని ఇస్తారు. అయితే, వీరు ప్రభుత్వం గుర్తించిన 'హాస్టల్'లో వుంటూవుండాలి.

తలిదండ్రులుఅదేగ్రామంలోవుంటున్నా, స్కూలు (లేదా కాలేజీ) 'హాస్టల్'లో వుండే బాలికలుకూడా యీ స్కాలర్ షిప్పులకుఅర్హులే. మగపిల్లలకు యీ సదుపాయం లేదు.

వీటితోబాటు—యం.ఎ., యం.యస్ సి— మొదలైన పోస్టు – గ్రాడ్యుయేట్ తరగతులలో చదివే విద్యార్థులకు కూడా మరికొన్ని స్కాలర్ షిప్పులను రాష్ట్రప్రభుత్వం ప్రత్యేకించింది. విద్యనిమిత్తం, వారి వారి అవసరాలనుబట్టి యీ స్కాలర్ షిప్పులమొత్తం ఆధారపడింది. విద్యార్థులు చెల్లించవలసిన జీతం మొదలైన ఖర్చుల దృష్ట్యా యీ మొత్తాన్ని ఇవ్వటం జరుగుతుంది. 'హాస్టల్'లో వుండే విద్యార్థులకు ప్రత్యేకమైన సదుపాయాలున్నాయి.

వాణిజ్య వ్యాపార సంబంధమైన కోర్సులలో చదివేవారికి, కాంపౌండరు కోర్సు చదివేవారికి—ఏటా పదేసి స్కాలర్‌షిప్పుల వంతున ఇస్తారు. వెనుకబడిన తరగతులని, ప్రభుత్వం గుర్తించిన కులాల వారికే వీటిని ఇస్తారు. ఇవికూడా రాష్ట్ర ప్రభుత్వ సాంఘిక సంక్షేమశాఖ డైరెక్టరు అధీనంలోనే వుంటాయి షెడ్యూల్డు కులాలు మినహాయించి – క్రైస్తవ మతం పుచ్చుకొన్న ఇతరకులాలవారికి యీ సౌకర్యంవర్తించదు.

ప్రభుత్వం నిర్వహిస్తున్న 'ఫిజికల్ ఎడ్యుకేషన్' కళాశాలలో చదువుతున్న వారికి మరికొన్ని; 'వ్యవసాయం' సబ్జక్టుగా

(మిగతా 73 వ పేజీలో)

# కాకమ్మ పిచ్చుకమ్మ కథ

మరాఠీ కథ

— వేటూరి ఆనందమూర్తి

*[ ఈ కాకమ్మ పిచ్చుకమ్మ కథ తెలుగు దేశంలో ప్రచారంలో ఉన్నా "అనగనగా ఒక రాజు" అన్న కథకున్నంత పరిచారం లేదు. మరాఠీ భాషలో దీనికున్నంత ప్రచారం మరి దేనికీ లేదు. ]*

ఒక ఊళ్లోనేమో ఒక కాకమ్మ ఒక పిచ్చుకమ్మ ఉండేవి. కాకమ్మ గూడేమో పిడకలతో కట్టుకొంది. పిచ్చుకమ్మ గూడేమో మైనంతో కట్టుకొంది.





ఒకసారి పెద్ద వాన కురిసింది. కాకమ్మ కట్టుకొన్న పిడకల గూడు కాస్తా కరిగిపోయింది. పిచ్చుకమ్మ మైనపు గూడు మాత్రం మిగిలింది. అప్పుడు కాకమ్మ ఇల్లులేక పిచ్చుకమ్మ గూటి కెళ్ళింది.



'పిచ్చుకమ్మా! పిచ్చుకమ్మా! తలుపు తియ్యవూ?' అంది.

'నే నిప్పుడు తియ్యను. మా పాపాయికి నీళ్ళు పోస్తున్నాను' అంది పిచ్చుకమ్మ.

కాసేపాగి మళ్లా పిలిచింది కాకమ్మ.

'పిచ్చుకమ్మా! పిచ్చుకమ్మా! తలుపు తియ్యవూ?' అని.

'నే నిప్పుడే తియ్యను. మా పాపాయికి అన్నం పెడుతున్నాను' అంది పిచ్చుకమ్మ.



పోనీకదా అని ఇంకా కాసేపు ఆగి

'పిచ్చుకమ్మా! పిచ్చుకమ్మా! తలుపు తియ్యవూ?' అంది కాకమ్మ.

'ఊహుఁ— నేనిప్పు డప్పుడే తియ్యను. మా పాపాయికి జోల పాడుతున్నాను.' అంది పిచ్చుకమ్మ.

కాకమ్మ అక్కడే కూచుంది. పిచ్చుకమ్మ తర్వాత తలుపు తెరిచింది.



ఇద్దరూ కలిసి భోం చేసి సుఖంగా ఉన్నారు.

---

(72 వ పేజీ తరువాయి)

తీసికొని—మూడు సంవత్సరాల బి. యస్ సి. కోర్సు చదువుతున్నవారికి మరికొన్ని; మెడికల్ కళాశాలలో యం. బి. బి. యస్. తరగతి చదువుతున్నవారికి మరికొన్ని; దంతవైద్యానికి సంబంధించిన కోర్సు చదువుతున్నవారికి, మరికొన్ని శానిటరీ ఇన్‌స్పెక్టరు కోర్సు చదువుతున్నవారికి, ఇంజనీరింగు కోర్సు చదువుతున్నవారికి, విద్వాన్ కోర్సు పండితుల శిక్షణ కోర్సు, పశు సంవర్థక కోర్సు చదువుతున్నవారికి. బి. ఇడి. కోర్సు, న్యాయశాస్త్రం, మెడికల్ రేడియోలజీ డిప్లొమా, కో-ఆపరేటివ్ ట్రైనింగు అండ్ ఎడ్యుకేషన్, మరికొన్ని ఇతర డిప్లొమా కోర్సులలో చదివే వెనుకబడిన వర్గాలవారికీ కొన్ని స్కాలర్‌షిప్పులను ప్రభుత్వం ఏటా ఇస్తున్నది.

ప్రభుత్వంనుంచి ఉచితంగా యీ సదుపాయం పొందుతున్న వారంతా, యీ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి. బాగా చదువుకొని, ఎప్పటికప్పుడు మంచి మార్కులు తెచ్చుకొంటూ వుండాలి. అలా కాకుండా, క్రమశిక్షణ పాటించక, చిలిపిగా తిరుగుతూ, చదువులు మానివేస్తే–ఏ క్షణంలోనైనా ప్రభుత్వం యీ స్కాలర్‌షిప్పును ఉపసంహరించుకో వచ్చును.

తస్మాత్ జాగ్రత్త!

(8 వ పేజీ తరువాయి)

సభ్యదేశాలలోనూ ఇంగ్లండు, ఫ్రాన్సు-ఈ రెండుదేశాలూ వోటుచేయలేదు. ఈ తీర్మా నాన్ని ఘనా, మొరాకో, ఫిలిప్పైన్స్ ప్రవేశ పెట్టాయి. దక్షిణాఫ్రికాలో గల జాతివివ క్షణ, ఐక్యరాజ్య సమితితో దానికి గల సంబం ధాల దృష్ట్యా విరుద్ధమైనదని గట్టిగా మొర పెట్టాయి. దక్షిణాఫ్రికాతో చేసే వర్తకాన్ని నిలిపివేయవలసిందిగా కోరే మరో తీర్మానం వీగి పోయింది.

దక్షిణాఫ్రికా జాతివివక్షణా విధానానికి తీవ్ర నిరసనగా భారతదేశం యింతకు ముందే ఆ దేశానికి విమాన, ఓడ మార్గా లను మూసివేసింది. అమెరికా 1964 నుండి అన్నివిధాలైన ఆయుధ సహాయాన్నీ నిలిపి వేస్తానని ప్రకటించింది.

## నిర్యుద్ధ సంధి సంభాషణలు

చరిత్రాత్మకమైన అణ్వస్త్ర పరీక్షల నిషేధ ఒప్పందం అనంతరం రష్యా, ఇంగ్లండు, అమెరికా దేశాల ప్రతినిధులు తూర్పు, పశ్చిమ రాజ్యాల మధ్య నిర్యుద్ధ సంధికిగల అవకాశాలను గూర్చి మాస్కోలో సంప్రదింపులు జరుపుతున్నారు. రష్యా ప్రధాని కృశ్చేవ్ యీ విధమైన సంధి సంభాషణలకు ప్రధానకారకుడు. ఈ సంప్ర దింపులలో అమెరికా సెక్రటరీ డీన్‌రస్క్, ఇంగ్లండు విదేశాంగకార్యదర్శి లార్డ్‌హోమ్, రష్యా విదేశాంగ మంత్రి ఆంద్రిగ్రోమికోవ్ పాల్గొన్నారు. ఈ సంధికి అంగీకారాన్ని తెలియజేయడానికిపూర్వం తాము ముందుగా తమ 'నాటో' మిత్రదేశాలను సంప్రతించ వలసివుంటుందని పశ్చిమరాజ్యాలప్రతినిధులు తెలియజేశారు. సంప్రతింపుల సమయంలో ఐక్యరాజ్యసమితి సెక్రటరీ జనరల్ ఉ.థాంట్ మాస్కోలో వుండడాన్ని బట్టి, మిత్రరాజ్య సమితి చేస్తున్న శాంతి ప్రయత్నాలను, అగ్ర రాజ్యాలు గుర్తించాయనడానికి నిదర్శనం అనవచ్చు.

ఈ మధ్య కాలంలో, అణ్వస్త్ర పరీక్షల నిషేధ ఒప్పందాన్ని భారతదేశంతో పాటు ఎన్నో దేశాలు అంగీకరించాయి. ఈ ఒడం బడిక అనంతరం మొట్టమొదట భారత దేశమే దీనిపై సంతకం చేసింది. డబ్బైకి పైగా దేశాలు యీ ఒడంబడికపై సంతకాలు చేశాయి. కమ్యూనిస్టు చైనా, ఫ్రాన్సు — ఈ రెండు మాత్రమూ సంతకం చేయడానికి నిరాకరించాయి. చైనా తొలిసారిగా తన అటంబాంబును సుదూర భవిష్యత్తులో తయారు చేయాలనుకుంటున్నది. 'యుద్ధం తప్పనిసరి' అనే తన సిద్ధాంతం చైనాను ఎంతమాత్రమూ అణ్వస్త్ర పరీక్షల నిషేధ ఒప్పందానికి ఒప్పుకునేటట్టు చేయడం లేదు. డిగాలీ ఆధ్వర్యంలో ఫ్రాన్సు విడిగా ఒక అణ్వస్త్ర దేశంగా తయారవ్వాలనే అభిప్రాయాన్ని కలిగివుంది.

1959 లో రష్యా తనకు అటంబాంబు తయారుచేయడంలో సహాయపడడానికి ఏవిధంగా తిరస్కరించిందీ చైనా బయట పెట్టింది. దీనివల్ల 1959 కి పూర్వమే చైనా ధోరణిని రష్యా కనిపెట్టి వుందనేది స్పష్ట పడుతున్నది. ఈ రెండు దేశాల మధ్యా సంబంధాలు మరింత బిగిసిపోయి సిద్ధాంత విభేదాలకు తావిచ్చి, చివరకు ఇటీవలి సరి హద్దు ప్రతిష్ఠంభనకు కూడా కారణభూత మయ్యాయి.

## 'మాఫిలిండో' ఒప్పందం

గత నెలలో మలయా, ఇండోనీషియా, ఫిలిప్పైన్సు దేశాలు మలయాలో సమావేశమై 'మాఫిలిండో' అనబడే మల యాసియా సమాఖ్యను ఏర్పరచేందుకుగల అవకాశాలను పరిశీలించడానికి అంగీక రించాయి.

మలయాసియా సమాఖ్యను గూర్చి బ్రూనో రాజ్యాలలోని ప్రజల అభిప్రాయా లను తెలుసుకోవడానికై ఐ.రా.స. సెక్రటరీ జనరల్ ఉ. థాంట్‌ను అభ్యర్థించేందుకు యీ మూడు దేశాలూ అంగీకరించాయి. ఉ. థాంట్ అందుకు అంగీకరించి, ఉత్తర బ్రూనో,సారవాక్ రాజ్యాలకు యీవిషయమై బృందాలను పంపించారు. ఈ రకపు చర్యకు ఇంగ్లండు తన సమ్మతిని తెలియ జేసింది.

ఈ సమాఖ్యలో చేరే దేశాలు మలయా, సింగపూర్,సారవాక్, ఉత్తర బోర్నియోలు.

ఉత్తర బోర్నియోపై ఫిలిప్పైన్స్, బ్రూనీపై ఇండోనీషియా తెలియజేసిన హక్కులను గూర్చి కూడా పరిశీలించడానికి యీ మూడు దేశాలూ అంగీకరించాయి. 'మాఫిలిండో' సమాఖ్య ఏర్పాటుతో ఈ విషయం సుకరమౌతుంది.

## పాకిస్తాను శత్రుత్వం

కాశ్మీరులోయ అంతర్జాతీయాకరణ లేదా విభజన ప్రాతిపదికగాపాకిస్తానుతో ఒక ఒప్పందానికి రాగల అవకాశాన్ని త్రోసి పుచ్చుతూ భారత ప్రధాని పార్లమెంటులో ప్రకటించారు. పాకిస్తాను నాయకుల యుద్ధో న్మాదాన్నీ, భారతదేశంపై ద్వేషాన్ని పెంచు కోవడమనే సమిష్టిధ్యేయంతో పాకిస్తాను, చైనాదేశాలు రెండూ సన్నిహితం కావడాన్నీ ప్రధాని పూర్తిగా వ్యతిరేకించారు. ఇండియా, పాకిస్తాన్ దేశాలమధ్యగల అభిప్రాయ భేదాలను తొలగించడానికి భారతదేశం ఎంత గానో ఆతృత పడుతున్నప్పటికీ పాకిస్తానుకు ఆ చింతనేలేదు. భారతదేశాన్ని అశక్తు రాలిగా చూడాలన్నదే పాకిస్తాను ముఖ్యో ద్దేశం. అయినా భారతదేశం 'నిర్యుద్ధ సంధి'తోసహా కొన్నికొన్ని సౌకర్యాలను పాకిస్తానుకు యిచ్చింది కాని పాకిస్తాను

పిడివాద ధోరణినిబట్టి ఒక్క నిర్యుద్ధసంధి మంతనాలుతప్ప మిగిలిన అన్ని సౌకర్యాలను ఉపసంహరించుకోవడం జరిగింది. భారతదేశానికి వ్యతిరేకంగా పాకిస్తాన్ చేసే దురుద్దేశ పూర్వకమైన విష ప్రచారాన్ని స్వయంగా పరిశీలించాలని, కాశ్మీరు సమస్యా పరిష్కారం కావాలని పట్టుబట్టే పశ్చిమ రాజ్యాలను ఆయన అడిగారు. "కాశ్మీరు సమస్య పరిష్కారమైనా భారత రక్షణకు తోడ్పడడం గానీ, పెకింగ్‌తో స్నేహాన్ని విడనాడడం గానీ జరగబోదని కూడా పాకిస్తాన్ నాయకులు ప్రకటించారు. భారతదేశానికి వ్యతిరేకంగా నిష్కారణమైన శత్రుత్వాన్ని పాకిస్తాన్ విడనాడనంత వరకూ పరిష్కారం సాధ్యమయ్యే అవకాశం తక్కువగా ఉన్నది" అని ఆయన ప్రకటించారు.

ఇది ఇలా ఉండగా చైనాతో పాకిస్తాన్ స్నేహం దినదిన ప్రవర్ధమాన మవుతున్నట్టుగా కనిపిస్తున్నది. విమాన యాన సర్వీసు ఒప్పందం కుదరడం మున్ముందు సన్నిహిత సంబంధాలకు ఎక్కువ అవకాశం ఉండడం వల్ల పశ్చిమ రాజ్యాలతో పాకిస్తాన్‌కు ఉన్న స్నేహబంధాలు అచిరకాలంలోనే తెగతెంపులు అయ్యే అవకాశం ఉంది. ఉమ్మడి విపత్తు కొత్తగా ప్రాణ మిత్రులను సృష్టిస్తుందని అంటారు. కాని ఉమ్మడి ద్వేషం అంతకంటే కొత్త స్నేహాలను సృష్టిస్తుందేమో! అయితే చైనాతో చెలిమివల్ల పాకిస్తాన్‌కు కలిగే లాభం, చైనా ఏకాకిత్వంలో భాగం మాత్రమే అవుతుంది.

## ఆర్థిక అసమానత

భారతదేశంలోని వివిధ రాష్ట్రాలమధ్య ఉన్న తీవ్ర ఆర్థిక అసమానతలే ప్రతి రాష్ట్రంలోని వివిధ జిల్లాలమధ్య కూడా ఉన్నాయని అప్లైడ్ ఆర్థిక పరిశోధన జాతీయ మండలి పరిశీలనల ద్వారా తెలిసింది. అంతే గాక ఆయా రాష్ట్రాలలోని ఆర్థిక వ్యత్యాసాలు రాష్ట్ర పారిశ్రామికీకరణలపై ఆధారపడి లేవని కూడా వెల్లడయింది. ఇతోధిక పరిశ్రమలు ఉన్న రాష్ట్రాలలో కూడా వ్యవసాయంపై ఆధారపడిన వెనుకబడిన రాష్ట్రాల మాదిరిగానే ఆర్థికఅసమానతలు ఉన్నాయి. జాతీయ మండలి పరిశీలన జరిపిన 289 జిల్లాలలో 207 జిల్లాల తలసరి ఆదాయం సగటు జాతీయ ఆదాయంకన్నా తక్కువగానే ఉంది. ఉత్తర ప్రదేశ్, ఒరిస్సా, బీహార్ రాష్ట్రాలలో ఆర్థికంగా వెనుకబడిన జిల్లాలు ఎక్కువగా ఉన్నాయి. జాతీయమండలి పరిశీలన ప్రకారం పశ్చిమ బెంగాలుఎక్కువ ధనిక రాష్ట్రం; ఆ తర్వాత స్థానం మహారాష్ట్రది, ఆర్థికంగా పూర్తిగా వెనుకబడిన రాష్ట్రం బీహార్. పరిశ్రమాభివృద్ధి ద్వారా పశ్చిమ బెంగాలు, మహారాష్ట్ర సంపన్నం అయ్యాయి. వెనుకబడిన రాష్ట్రాలయినబీహార్,మధ్య ప్రదేశ్ వ్యవసాయంపై ఆధారపడి ఉన్నాయి. అయితే యీ విషయంలో పంజాబును మినహాయించవచ్చు. రక్షణ సర్వీసులు, వ్యవసాయంద్వారా యీ రాష్ట్రానికి ఎక్కువరాబడివస్తుంది. పరిశ్రమల ద్వారా అతి తక్కువ శాతం ఆదాయం లభిస్తుంది. సామ్యవాద సమాజ వ్యవస్థలో యీ ధోరణి గర్హనీయమైంది. పారిశ్రామిక వ్యవసాయ రంగాలలో జరిగే పురోభివృద్ధి వల్ల కొన్నివర్గాలు, కొన్ని ప్రాంతాలు వెంటనే లాభాలు పొందడం ఆర్థికంగా వెనుక బడిన దేశాలలో సహజంగా జరుగుతుంది. అయితే యీ ధోరణి అవాంఛనీయ పరిస్థితికి దారితీయకుండా అరికట్టేందుకు ప్రణాళికా సంఘం తగినచర్యలుతీసుకోవాలి.

## మాస్కోలో 'భారతదేశం'

మాస్కోలో సోవియటు ప్రధాని కృశ్చేవ్ ప్రారంభోత్సవం చేసిన భారత ఉత్పత్తుల ప్రదర్శనలో ప్రైవేటు, పబ్లిక్ రంగాలకు చెందిన 850 భారత సంస్థల తాలూకు దాదాపు 10 లక్షల వస్తువులను ప్రదర్శించారు. మధ్య తరహా లఘుపరిశ్రమలు, వాడకం దార్ల వస్తువుల ప్రదర్శనకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడింది. ఇంత పెద్ద ఎత్తున విదేశాలలో భారత ప్రదర్శనలు ఇంతకుముందు ఎప్పుడూ జరగలేదు. భారతదేశానికి సంబంధించిన వివరాలనుతెల్పే అసంఖ్యాకమైన ఫోటోలు, చార్టులను యీ ప్రదర్శనలో ఉంచారు. భారత చిత్రకారుల కళాఖండాలతో ప్రదర్శనను సర్వాంగసుందరంగా అలంకరించారు. ప్రతిరోజు సగటున దాదాపు 50,000 మంది ప్రజలు యీ ప్రదర్శనను తిలకించారు. సోవియటు రాజధానికి చాలా దూర ప్రదేశాలలో ఉన్న ప్రజలు టెలివిజన్ ద్వారా యీ ప్రదర్శనను తిలకించారు. భారత దేశంతో వాణిజ్యాన్ని పెంపొందించుకునే అవకాశాన్ని పరిశీలించడానికై అనేకదేశాల వాణిజ్య ప్రతినిధివర్గాల వారు యీ ప్రదర్శనాన్ని తిలకించారు. ఈ ప్రదర్శనాన్ని తిలకించిన అతి ముఖ్యులలో యు. యన్. ప్రధాన కార్యదర్శి శ్రీ ఉ. థాంటు కూడా ఉన్నారు. స్వాతంత్ర్య సముపార్జన తర్వాత పారిశ్రామికాభివృద్ధిలో భారతదేశం సాధించిన విజయాలను శ్రీ ఉ. థాంటు ఎంతో మెచ్చుకున్నారు. తెలుగుతోసహా వివిధ భారతీయ భాషల చలన చిత్రాలను మాస్కోలోని వివిధ పట్టణాలలో ప్రదర్శించారు.

ప్రదర్శన ముగిసిన తర్వాత రు॥ 11 కోట్ల భారత వస్తువులకై సోవియటు ఆర్డరు చేసిందని ప్రకటించబడింది. ఇటువంటి ప్రదర్శనలు మన ఎగుమతులను పెంపొందించడంలో తోడ్పడి, తద్వారా మన ప్రగతికి దోహదం చేస్తాయి.



## ముఖ్యవార్తలు

### రాష్ట్రంలో

19 జూలై : హైదరాబాదులో క్రొత్తగా నిర్మింపబడుతున్న అమెరికన్ సాంస్కృతిక కేంద్రం భవనానికి గవర్నరు శంఖుస్థాపన చేశారు.

22 జూలై : మురికివాడల నిర్మూలన పథకం క్రింద హైదరాబాదులోని యాద్గార్ హుస్సేన్ కుంటవద్ద స్వల్పఖర్చుతో నిర్మింపబడిన గృహాలకు ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

23 జూలై : హైదరాబాదులో సాలార్ జంగ్ మ్యూజియం కై నిర్మింపబడుతున్న క్రొత్త భవనానికి ప్రధానమంత్రి శంఖుస్థాపన చేశారు.

భారతప్రభుత్వం నియమించిన మద్యపాన నిషేధ పరిశీలకబృందం హైదరాబాదు విచ్చేసింది.

24 జూలై : శ్రీశైలం ప్రాజెక్టు పనులకు ప్రాజెక్టు స్థలంలో ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు

26 జూలై : రు 42 కోట్ల ఖర్చుతో నిర్మితమవుతున్న పోచంపాడు ప్రాజెక్టు పనికి ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

27 జూలై : అత్యవసర పరిస్థితి దృష్ట్యా రాష్ట్రంలో నిర్బంధించబడిన కమ్యూనిస్టు డిటెన్యూలందరినీ ప్రభుత్వం విడుదల చేసింది.

29 జూలై : పట్టణ ప్రాంతాలలోని వ్యవసాయేతరభూములపై పన్ను విధింపుకు సంబంధించిన బిల్లును శాసనసభ ఆమోదించింది.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి సంబంధించిన సంయుక్త సెలక్టు కమిటీ నివేదికను వ్యవసాయమంత్రి శాసనసభకు సమర్పించారు.

31 జూలై : వర్షాకాలపు సమావేశాల తర్వాత శాసనసభ సమావేశం నిరవధికంగా వాయిదాపడింది.

2 ఆగస్టు : వర్షాకాలం సమావేశాల తర్వాత శాసనమండలి సమావేశం నిరవధికంగా వాయిదా పడింది.

3 ఆగస్టు : ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన గ్రంథాలయం క్రొత్త భవనాలకు రాష్ట్రపతి డాక్టర్ యస్. రాధాకృష్ణన్ ప్రారంభోత్సవం చేశారు.

4 ఆగస్టు : విశాఖపట్నంలో క్రొత్త మీడియంవేవ్ ట్రాన్సిమీటరుకు ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

5 ఆగస్టు : ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని సహకార ఎపెక్సు బ్యాంకుల విలీనీకరణ ఫలితంగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకుకు హైదరాబాదులో ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

అఖిల ఇండో–జర్మన్ సాంస్కృతిక కేంద్రం మాక్స్‌ముల్లర్ భవనానికి గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

6 ఆగస్టు : సంవత్సరానికి 17 రోజుల పాటు హైదరాబాదులో విడిదిచేయవిచ్చేసిన భారత రాష్ట్రపతి న్యూఢిల్లీ వెళ్ళారు.

లోక్‌సభ, శాసనసభ సభ్యుల ప్రాంతీయ పరిశీలక క్యాంపు సభ్యులనుద్దేశించి కేంద్ర పంచాయతీరాజ్ సహకార మంత్రి ప్రసంగించారు.

17 ఆగస్టు : అఖిలభారత చేతి పరిశ్రమల బోర్డు సమావేశానికి హైదరాబాదులో ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

### భారతదేశంలో

22 జూలై : భారతదేశంలో జరిపే సమిష్టి వైమానిక శిక్షణ, విన్యాసాలకు సంబంధించిన పశ్చిమ రాజ్యాల ప్రతిపాదనకు భారతప్రభుత్వం తమ ఆమోదాన్ని ప్రకటించింది.

28 జూలై : న్యూఢిల్లీలో జరిగే సమాజాభివృద్ధి, పంచాయతీ రాజ్‌ల అఖిలభారత వార్షిక సమావేశానికి కేంద్ర ప్రణాళికామంత్రి ప్రారంభోత్సవం చేశారు.

1 ఆగస్టు : రాష్ట్ర సమాజాభివృద్ధి పంచాయతీరాజ్ శాఖల మంత్రుల సమావేశానికి ప్రధానమంత్రి క్రొత్త ఢిల్లీలో ప్రారంభోత్సవం చేశారు.

7 ఆగస్టు : మూడవ ప్రణాళికకై మరో 187 మిలియన్ డాలర్ల సహాయం అందజేయడానికి భారత సహాయక క్లబ్‌లోని 10 దేశాలు అంగీకరించాయి.

9 ఆగస్టు : రాజ్యాంగ రీత్యా భారత రక్షణ చట్టం చెల్లనేరదని

సవాలుచేస్తూ వచ్చిన 14 విజ్ఞప్తులపై సుప్రీంకోర్టు వారు తను నిర్ణయాన్ని తర్వాత ప్రకటిస్తామని తెలియ జేశారు.

13 ఆగస్టు : 7 వారాలు జరిగే లోకసభ వర్షాకాలపు సమావేశం ప్రారంభమయింది.

మరో మూడు అఖిల భారతసర్వీసులనుఏర్పాటు చేయడానికి ఉద్దేశించిన బిల్లును లోకసభ ఆమోదించింది.

14 ఆగస్టు : శారీరక అర్హతగల విద్యార్థులందరికీ నిర్దేశించబడిన నిర్బంధసైనిక శిక్షణ పథకానికి ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## విదేశాల్లో

25 జూలై : బ్రిటన్, రష్యా, అమెరికా 'అగ్రరాజ్యత్రయం' మాస్కోలో పాక్షిక అణ్వస్త్ర పరీక్షల నిషేధం ఒప్పందంపై సంతకాలు చేశాయి.

26 జూలై : యుగోస్లావియా రిపబ్లిక్ లోని మాకిడోనియన్ రాజధాని అయిన స్కోప్జినగరం ఘోరమైన భూకంపం కారణంగా పూర్తిగా నేలమట్టం అయింది.

5 ఆగస్టు : శాంతి సంస్థాపనార్థమై కలిసి కట్టుగా పనిచేయడానికి అంగీకరిస్తూ మలయా, ఇండోనీషియా, ఫిలిప్పైన్స్ రాజ్యాలు 8 అంగీకార పత్రాలపై సంతకాలు చేశాయి.

6 ఆగస్టు : కాస్మోస్ 19 అనే మరో ఉపగ్రహాన్ని రష్యా ప్రయోగించింది.

8 ఆగస్టు : పాక్షిక అణ్వస్త్ర పరీక్షల నిషేధం ఒప్పందంపై భారతదేశం సంతకం చేసింది.

15 ఆగస్టు : ప్రెసిడెంటు అబె ఆల్బర్ట్ యూలోవ్ తన పదవికి రాజీనామా ఇచ్చిన కారణంగా పూర్వపు ఫ్రెంచి కాంగోలో క్రొత్తగా తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది.

సోమాలి రిపబ్లిక్ ప్రధానమంత్రి 4 రోజుల అధికార పర్యటనపై క్రొత్త ఢిల్లీ విచ్చేశారు. ★

# గ్రంథ స్వీకారం

చైనాదౌష్ట్యం : చైనాదాడి సంగ్రహ చరిత్ర – కొన్ని గేయాలు గల పుస్తకం; వెల–25 నయాపైసలు. పుటలు 14.

లక్షణముకురము : ఛందస్సు, అలంకారాలు నాటకాలను గురించి అతి సూక్ష్మంగా చెప్పిన గ్రంథం. పై రెండు గ్రంథాల రచయిత : చొల్లేటి నృసింహశర్మ; పుటలు–16. వెల–25 నయాపైసలు. ప్రతులకు : శారదా పబ్లిషింగ్ హౌస్–లష్కర్‌బజార్–హన్మకొండ, వరంగల్

వెన్నుపోటు : (పద్యకృతి) వెల–25 నయాపైసలు; పుటలు 12.

ఆవేదన : (పద్యకృతి) వెల–20 నయాపైసలు; పుటలు 10.

ఓదార్పు : (పద్యకృతి) వెల–25 నయాపైసలు; పుటలు 11. పై మూడు గ్రంథాల రచయిత: నల్లూరి వేంకటరత్నమాచార్యులు, ప్రతులకు : సాహిత్యసేవాసదనము, కోనేటిపురము.

చీకటి హృదయాలు : (చిన్న నాటిక) వెల–50 నయాపైసలు; పుటలు 30. రచయిత : డి. ఆర్. రాజ్‌పాల్. ప్రతులకు : రాగూర్ కళాసమితి, ఐతానగర్, తెనాలి.

శ్రీనివాస శతకము : (పద్యకృతి) వెల–50నయాపైసలు:పుటలు 28. రచయిత: భాష్య శ్రీనివాసాచార్య. ప్రతులకు : యస్. శ్రీనివాసాచార్య c/o ఆరిశనపల్లి రామారావు గారు. పంథిని, వయా : మామునూరు, తాలుకా, వరంగల్.

హరిశ్చంద్రోపాఖ్యానం : (గద్యరచన) వెల–31 నయాపైసలు. పుటలు 32. రచయిత: పురాణపండ రాధాకృష్ణమూర్తి. ప్రతులకు : కార్యదర్శి, అధ్యాత్మ ప్రచారక సంఘం, గీతా ప్రచారకశాఖ, విక్రమహాలు, రాజమండ్రి, తూ. గోదావరి జిల్లా.

శాంతిదూత : (పద్యకృతి) పుటలు 16 రచయిత్రి : బంట్ల ఆదిశేషభూషణాంబ. ప్రతులకు : ఆంధ్రభారతి, ప్రకాశం మందిర్ వేటపాలెం (ద. రైల్వే)

విశ్వకవి : (గద్యరచన)వెల–1 రూపాయి, పుటలు 54. రచయిత : డి. రామలింగం. ప్రతులకు : గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురం, ఉల్లిపాలెము పోస్టు, దివి తాలూకా, కృష్ణాజిల్లా.

శ్రీ గణేశ్ భక్తానంద భజన గీతారత్నములు : (గేయ సంపుటి) వెల–25 నయాపైసలు; పుటలు 16. రచయిత : కుప్పిలి గణపతిరావు పట్నాయక్, ప్రతులకు : పి. వెంకట్రావునాయుడు, వేణమ్మపేట, వయా : ఆమదాలవలస శ్రీకాకుళం జిల్లా. ★

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad.

# 10 సంవత్సరాల
# డిఫెన్సు డిపాజిట్ సర్టిఫికెట్లు

దరఖాస్తులను
హెడ్ పోస్టాఫీసులలోను, సబ్ పోస్టాఫీసులలోను
మరియు
రిజర్వు బ్యాంకు కార్యాలయాలలోను,
స్టేట్ బ్యాంకు, దాని సబ్సిడియరీ బ్యాంకులలోను,
ట్రెజరీలు, మరియు సబ్ ట్రెజరీలలోను
తీసుకుంటారు.

---

## ఈ సర్టిఫికెట్లను కొని
## పన్నులేని 4½ శాతం సాలుసరి వడ్డీని
## సంపాదించండి



జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

DA—63/217



# మనకు అంతిమ విజయం సిద్ధించేవరకూ
# ప్రతి ఒక్కరూ తమ కృషికి అంకితం కావాలి

జాతీయాభ్యుదయ సాధన కృషిలో రైల్వేలు నిర్వహించే పాత్ర గురుతరమైనది. కాగా ఈనాడు జాతీయ రక్షణ కృషిలో అవి నిర్వర్తించే పాత్ర మరింత ప్రధానమైనది.




## కేంద్ర రైల్వే





*నేఫాలో నూతన శకారంభం:* నేఫాలో పస్సీఘాట్ వద్ద ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో ట్రాక్టరుతో దున్నుతున్న దృశ్యం. [చూ-వ్యాసం, 43వ పేజీ.]



నేఫాలోని తిరప్ డివిజనులో ఒక గృహిణి మగ్గంవద్ద పనిచేసుకుంటున్న దృశ్యం.
[చూ-వ్యాసం, 43వ పేజీ.]

